


డి.రామానాయుడు సమర్పించు

వెంకటేష్ ఎంటర్‌ప్రైజెస్

# ఎంకి-నాయుడుబావ

సినిమాస్కోప్ ఈస్ట్‌మన్‌కలర్

నిర్మాత: డి.వెంకటేష్

దర్శకత్వం: బోయిన సుబ్బారావు

ఆంధ్ర-సీడెడ్: నవయుగ నైజాం: విజయా సురేష్ పిక్చర్స్

# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి : 4 సంచిక : 8

ఫిబ్రవరి : 1979

విడి ప్రతి : రెండు రూపాయిలు

సం॥ర చందా : ఇరవైనాలుగు రూపాయిలు

శ్రీలంక : రూ. 2.00 (ఇండియా)

మలేసియా : 90 సెంట్స్

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026


## బాలల శ్రమ నిషేధించాలి!

ప్రపంచమంతా బాలల సంవత్సరానికి శుభోదయం పలుకుతున్న తరుణంలో – గత నెల 27 వ తేదీన తమిళనాడులో ఒక ఘోరం జరిగింది. శివకాశిలోని అగ్గిపెట్టెల పరిశ్రమలో పని చేస్తున్న ముప్పైఐదు మంది బాలికలు దుర్మరణం పాలయ్యారు. శివకాశి చుట్టుపక్కలలోని మంగళం, కళ్లరకురిచ్చి, చానార పట్టి గ్రామాలనుండి రోజు ఆ పరిశ్రమకు చెందిన బస్సు ఈ బాలికలను శివకాశికి తీసుకు వెడుతూ వుంటుంది. ఆ రోజు బస్సులో ఏభై ఎనిమిదిమంది బాలికలు ప్రయాణం చేస్తున్నారు. అర్జునా నది దాటుతూ వుండగా వువ్వెత్తున హఠాత్తుగా ముంచుకు వచ్చిన వరదలు బస్సుని కబళించి వేశాయి. అందులో ఇరవైముగ్గురు తప్పించు కున్నారు. ముప్పైఅయిదుగురు బాలికలు వరద పాలిట పడ్డారు. ఇంతకీ వారి వయసు పది నుంచి



పధ్నాలుగు సంవత్సరాలలోపే! తమిళనాడులో ఒక చట్టం వుంది. ఆ చట్టం ప్రకారం పధ్నాలు గేళ్ళలోపు పిల్లలను పనిలోకి తీసుకోకూడదు. కాని శివకాశిలోని అగ్గిపెట్టెలు, బాణాసంచా, ముద్రణా పరిశ్రమలు – వీరు కారు చవకలో లభించడంతో పిల్లలనే పనిలోకి పెట్టుకుంటున్నారు. అయితే ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్లు ఏం చేస్తున్నట్లు? ప్రతి రోజూ వందలాదిమంది చిన్నారి బాలలను బస్సులలో ఫ్యాక్టరీలకు తరలించడం వారి దృష్టిని పడ లేదా? తమిళనాడులో మరో చట్టం కూడా వుంది. పధ్నాలుగేళ్ళలోపు పిల్లలు తప్పనిసరిగా పాఠశాలలో చదివి తీరాలని. మరి విద్యా విషయాలు చూసుకునే అధికారులు ఏం చేస్తున్నట్లు? ఈ అధికారులందరూ ప్రభుత్వం రూపొందించిన చట్టాలు సరిగ్గా అమలు జరుగుతున్నాయో లేదో కాస్త కనిపెట్టి వుంటే ఇటువంటి ఘోరాలు జరక్క పోను గదా.... ఈ విషాద సంఘటన తర్వాతనైనా అధికారులు మేల్కొని బాలలశ్రమ (child labour) పై నిషేధం విధించాలి. అది అవలంబించేటట్లు చూడాలి. అప్పటికి గానీ అంతర్జాతీయ బాలల సంవత్సరానికి ఒక అర్థం అంటూ ఏర్పడదు.... ఏర్పడదు.

మాధవి — మద్రాసు

> "విద్యావంతులైన స్త్రీలు తమ తోటి స్త్రీల గురించి చేస్తున్నదేమిటి? ఇందులో ఎంతమందికి తమ సంఘం గురించిగాని, దేశం గురించిగాని తెలుసు? ఎందరికి పిల్లలను ఎలా పెంచితే మంచి పౌరులుగా తయారవుతారన్నది తెలుసు? ఎంతమందికి తమ సాటి స్త్రీలను నిర్లక్ష్యం చెయ్యకుండా ఆదరించే అమృత హృదయం వుంది? మురికిలో కూరుకు పోతున్న ఎందరికి ఈ విద్యావంతులు ఆదరణ – కాదు, కనీసం సానుభూతి చూపించ గలరు?"
>
> వచ్చే సంచికలోని ఒక వ్యాసం — "ఓ స్త్రీ! మోసపోకు" (తెన్నేటి రామలక్ష్మి)

## శ్రీలంకలో భారతీయ వనితలు

శ్రీలంక అధ్యక్షులు శ్రీ జయవర్ధనే ఇటీవల ఒక స్త్రీల కళాశాలలో ప్రసంగిస్తూ – ప్రభుత్వరంగ ఉద్యోగాలలో స్త్రీ పురుష భేదం పాటించకూడదని తెలియజేశారు. అంతేకాదు. స్త్రీల సమస్యలను పరిష్కరించి వారి హక్కులు కాపాడడానికి పథకాలు రూపొందించడానికి ఒక 'మహిళా మండలి' (విమన్స్‌బ్యూరో)ని ఏర్పాటు చేశారు. ఈ మండలి ప్రణాళికా నిర్వాహక మంత్రిత్వశాఖకు అనుబంధంగా పని చేస్తుంది. అభ్యుదయ పథకాలు సక్రమంగా నెరవేరడానికి ఈ మండలి కృషి చేస్తుంది. అంచేత ఇవాళ పోలీసు అధికారులు గాను, బస్ కండక్టర్లుగానూ, పర్యవేక్షణాధికారులు గాను వుంటూన్న శ్రీలంక వనితలుత్వరలోనే సైనికులు గానూ, విమాన చోదకులుగానూ, ఇంజనీర్లుగానూ చూడగలమని ఆశించవచ్చు. అయితే – శ్రీలంకకు చెందిన వారిని రిజిష్టర్ పెళ్ళి చేసుకునే ప్రతి భారతీయ స్త్రీ ఐదువందల రూపాయలు పన్ను చెల్లించాలనే చట్టం వుండడం చాలా శోచనీయం! ఇటీవల జరిగిన పార్లమెంటు సమావేశంలో ఒక పార్లమెంటు సభ్యుడు దీని మీద తీవ్రంగా నిరసన తెలియజేశారు. శ్రీలంకలో లాభకరమైన ఉద్యోగాలు చేసే విదేశీయుల మీద 'లెవీ'ని మొట్ట మొదట విధించింది శ్రీమతి సిరిమావో బండారనాయకే. కాని 1965 వ సం॥ డడ్లీ సేనానాయకే పదవీ ప్రమాణం చేసిన వెంటనే అది రద్దు చేయబడింది. అయితే 1970 సం॥ సిరిమావో అధికారంలోకి వచ్చిన తర్వాత మళ్ళీ ప్రవేశపెట్టబడింది. అయినా లాభదాయకమైన ఉద్యోగాలు చేసే వారి మీద పన్నులు విధిస్తే పరవాలేదు కానీ కేవలం గృహిణులుగా వెళ్ళే వారి నుంచి కూడా వసూలు చేయడం ఎంతైనా గర్హనీయం. ఎందుకంటే రెండు మూడేళ్ళలో ఆ స్త్రీలు కూడా శ్రీలంక పౌరులుగా పరిగణించబడతారు!

ఏ. ఆర్. అరుణ — నగరి

## 'స్త్రీలకు ప్రత్యేకం' ఎంతవరకూ సాధ్యం?

విజయవాడ లయన్ లేడీస్ క్లబ్ సభ్యులు 'వనిత'లో జరిపిన గోష్ఠిలో వారు చర్చించిన సమస్యలు అభినందించదగినవే. కానీ ఆ సమస్యలకు తగిన పరిష్కార మార్గాలను మాత్రం సూచించలేకపోయారు. ఒక సమస్యకు పరిష్కార మార్గం సూచిస్తే అది ఆచరణ సాధ్యంగా వుండాలి.

'స్త్రీలు - భద్రత' విషయంలో ఒక సభ్యురాలు స్త్రీలకు ప్రత్యేకమయిన బస్సులు వేయాలని ఆ బస్సులలో స్త్రీలనే కండక్టర్లుగా వేయాలని సూచించారు. అలాగే 'స్త్రీలు ఉద్యోగాలు' శీర్షికలో మరొక సభ్యురాలు సంసారం చూసుకుంటూ ఆఫీసు పని చేయటం కష్టం కనక స్త్రీలకు పార్ట్ టైం జాబ్స్ ఇవ్వాలని సూచించారు. ఇవి సాధ్యం అయే పనులేనా? ఉద్యోగం చేసే స్త్రీలందరికి 'పార్ట్ టైమ్ జాబ్‌లు', స్త్రీలకు ప్రత్యేకమయిన బస్‌లు, ప్రతీ చోట అధిక సంఖ్యలో మహిళా పోలీసులు....ఇవన్నీ సాధ్యం అవుతాయా?

**శ్రీమతి భాస్కరం** **రాజమండ్రి**

*దశమగ్రహం – సత్యమే!*

సంఘంలో ఉన్న 'సమస్య'లతో ఈ 'దశమ గ్రహ' సమస్య కూడా లెక్కింపదగినదే. దీనితో ఎంతోమంది ఆడపిల్లల తల్లిదండ్రులు అంతకంటే ఎక్కువగా బాధపడిపోతున్నారు. వివాహంలో నాకబలికి ముందు 'అల్లుడు అలకకు వెళ్ళాడు' అనగానే గుండెల్లో రాయి పడుతుంది అమ్మాయి తలిదండ్రులకు. ఎక్కడలేని హిరణ్యాక్ష వరాలు కోరటానికి ఇదే అదను అల్లుడికి. ఒక వేళ అతడు మంచివాడై ఊరుకొనినప్పటికీ అతని అక్క చెల్లెళ్లూ, అన్నదమ్ములూ, బంధువులూ, స్నేహితులు అతని వెంటబడి 'ఇది నీ హక్కు, ఏదో ఒకటి తోచిందికోరుకో' అని చెబుతూ స్కూటరు, రేడియో, టేప్ రికార్డరు, ఖరీదైన వాచీలు కోరమని సలహాలిస్తారు. చివరకు అల్లుడు తనకు నచ్చిందేదో అడుగుతాడు. పిల్ల తండ్రి కలిగినవాడైతే సంతోషమే. లేకుంటే దీపావళికి తప్పక ఇస్తానని వాగ్దానం చేస్తాడు. కోరిన కోరికలు తీర్చలేదని పెళ్ళాన్ని అవమానించటం, ఇవన్నీ తరతరాలుగా జరుగుతున్నాయి. 'ఈ కారణంగా ఇంట్లోనుంచి గెంటివేయబడిన స్త్రీలూ, ఆత్మహత్యా ప్రయత్నానికి పాల్పడిన స్త్రీలూ కోకొల్లలుగా కనిపిస్తారు' అని గార్ల సరస్వతిగారనిన ('దశమగ్రహం' వ్యాసం) మాట ముమ్మాటికీ సత్యం.

**జి. సుమిత్రా రామకృష్ణ** **హైద్రాబాదు**

*దశమగ్రహం – దయనీయగ్రహం!*

'జామాత దశమోగ్రహః' అనే ఆర్యోక్తిని నూటికి నూరుపాళ్లు నిజం అని నిరూపించడానికి (దశమగ్రహం) రచయిత్రి ప్రయత్నించారేగాని ఆ గ్రహం చుట్టూ ఉన్న ముఖ్యమైన విగ్రహాలను ఏమాత్రం స్పృశించలేదు. అల్లుడు తన తలిదండ్రులకు; అక్కా చెల్లెళ్ళకూ ఉన్న కోరికలన్నీ కోరడం దారుణం అని రచయిత్రిగారు అన్నారు. నిజమే! దారుణమే. కాని ఆ దారుణానికి కారణం ఆ తలిదండ్రులు, అక్కా చెల్లెళ్ళే అని ఎందుకు అనుకోకూడదు? ఏ అల్లుడయినా కట్నం వద్దు అని తానుగా ముందుకొచ్చాడా అంతే - ఆదర్శ పురుషుడని అనరు సరికదా - అతగాడి పురుషత్వాన్నే అనుమానిస్తారు. మేం మా అల్లుడి కిచ్చింది కొడుకు ద్వారా వసూలు చేస్తాం అనే గొప్ప బుద్ధులే గాని, కోడలు తెచ్చింది అల్లుడి కిస్తాం అనే నిజాయితీ బుద్దులు ఎక్కడో తప్ప కనిపించరు. ఇలాంటి పరిస్థితుల్లో తలిదండ్రులను సమర్థిస్తే "క్రుకెడ్ సన్." అత్తమామలకు వత్తాసు పలికితే "హెన్‌పెక్డ్ హస్బెండ్." ఇతర లాంఛనాలెలా వున్నా ఇదీ అల్లుడికి దక్కే అందమైన లాంఛనమే. మామల చిత్తాలు, కోడళ్ళ అత్తలు మారినప్పుడే జామాత జాతకం మారేది. దశమగ్రహం దశ తిరిగేది. అంతవరకూ జామాత దశమగ్రహమే కాదు దయనీయ గ్రహం కూడా!

**నిమిషకవి స్వరాజ్యలక్ష్మి** **హైదరాబాదు**



ఈ సంచికలోని వ్యాసం — 'అసూయ' (28వ పేజీ)ను రాసిన కుమారి ఎ. వి. శేషారత్నం, విశాఖపట్నం ఆకాశవాణి కేంద్రంలో 'అనౌన్సర్'గా పని చేస్తున్నారు. జన్మస్థలం రాజమండ్రి; చదువు ఎమ్. ఎ. తెలుగు లిటరేచర్. వ్యంగ్య రచనలు చదవడం అన్నా, రాయడం అన్నా చాలా ఇష్టపడతారు. ఆమె రాసిన కొన్ని వ్యాసాలు వివిధ వారపత్రికల్లోనూ వచ్చాయి. 'నా రచనా వ్యాసంగానికి అన్నయ్య 'వసుంధర' ప్రోత్సహమే ఎక్కువ కారణం' అని చెబుతారు ఆమె.



ఈ సంచికలోని 52వ పేజీలో 'ఓ వనితా నీ పేరున దశాబ్దమా!' అన్న కథ వుంది. ఆ కథను రాసినవారు కుమారి లక్ష్మి. పొలిటికల్ సైన్స్‌లో ఆమె-ఎమ్. ఎ. పాసయ్యారు. రచనలు చెయ్యడం మీద వున్న ఉత్సాహంతో – చిన్న చిన్న కవితలు, వ్యాసాలూ రాశారు. అవి వివిధ పత్రికల్లోనూ వచ్చాయి. ఆమె రాసిన తొలి కథ 'ఎవరు పతిత?' 'మహిళ'లో వచ్చింది. "వనిత 'అభిప్రాయాలు'లో లోగడ రెండుసార్లు నా అభిప్రాయాలు ప్రచురింపబడ్డాయి. తద్వారా నేను పాఠకులకు పరిచితురాలినే" అంటున్న లక్ష్మి-శ్రీకాళహస్తిలో వుంటున్నారు.



ఈ సంచికలోని 14వ పేజీలో వున్న 'నమ్మకం' అన్న కథను కుమారి విస్సా రమాదేవి రాశారు. ఈ కథ ఆమె తొలి యత్నం. రమాదేవి మద్రాసులోని యస్. ఐ. ఇ. టి. కళాశాలలో బి. ఎ. చదువుకున్నారు; ప్రస్తుతం మద్రాసులోనే వుంటున్నారు. కవితలు, కథలూ, వ్యాసాలూ రాయడం అంటే ఆమెకు ఇష్టం. "సినిమా కథల్లాంటి కథలు కాకుండా, వాస్తవికతకు దగ్గరగా వుండేవీ; సంఘంలో పాతుకుపోయిన మూఢ విశ్వాసాలను నిర్మూలించేవీ అయిన కథలను రచయిత్రులు రాస్తే బాగుంటుంది" అని ఆమె అభిప్రాయపడతారు.

# చూపుకి అందం
# కంటికి చలవ
# అదే ఐటెక్స్ కాటుక



స్థానికమైన ఉత్తమ తైలముల మూలికల మిశ్రమంతో శాస్త్రరీత్యా తయారైనది ఐటెక్స్.




పెట్రోలియమ్ జెల్లీగాని, మైనం గాని, ఏ విధమైన రంగుగాని చేర్చబడనిది ఐటెక్స్.

కళ్ళకు కాంతి, చలవ ఆకర్షణలను కల్పించుటలో సాటిలేనిది ఐటెక్స్.

35 ఏళ్లుగా మీ అపార విశ్వాసమునకు ఒక చిహ్నము ఐటెక్స్.

మీ సౌందర్యమునకు మీ కన్నులే జీవనాడి. దానికి సాటిలేని ఉత్తమమైన కాటుకనే వాడాలి. అదే ఐటెక్స్ కాటుక అని వేరే చెప్పాలా?

ARAVIND LABORATORIES MADRAS-600 033



# ఉమాభారతి

ఏదైనా ఒక విద్య నేర్చుకున్నామూ అంటే అందుకు ఏదో ఒక ప్రయోజనం వుండాలని ఆశించడం సహజం. అయితే ఆ ప్రయోజనం స్వప్రయోజనం కోసం కాక సంఘసేవా కలాపాలకు, సహాయ కార్యక్రమాలకూ వుపయోగపడాలని అనుకోవడంలోనే వుంది విశేషమంతా.

అటువంటి విశిష్టమైన వనిత కుమారి ఉమా భారతి !

హైద్రాబాదుకు చెందిన ఉమాభారతి కూచిపూడి నృత్యంలో సిద్ధహస్తురాలు. భరతనాట్యంలోనూ ఆమెకు ప్రవేశముంది. కూచిపూడి నృత్యంలోని ప్రాథమిక పాఠాలను ఆమె కూచిపూడి నాట్యాచార్యులు శ్రీ వెంపటి చినసత్యం వద్ద నేర్చుకున్నారు. అప్పటికి ఉమాభారతి వయసు ఆరు సంవత్సరాలు ! ఆ విధంగా రెండేళ్ళ పాటు ఆయన వద్ద నేర్చుకున్న తర్వాత, వేదాంతం జగన్నాథశర్మ గారి వద్ద తన నృత్యానికి మెరుగులు దిద్దుకున్నారు.

ఉమాభారతి కేవలం నృత్యంలోనే కాదు. చదువులో కూడా ప్రథమురాలే. హైద్రాబాదు ప్రాన్సిస్ కళాశాల ద్వారా బి. ఏ. ప్రథమశ్రేణిలో వుత్తీర్ణురాలయ్యారు. ప్రస్తుతం రాజకీయశాస్త్రంలో ఎం. ఏ. తుది సంవత్సరం విద్యార్థిని.

ఒకవైపు చదువు మీద దృష్టి కేంద్రీకరిస్తూనే మరోపక్క నాట్యరంగం పైన కూడా ఉత్సాహాన్ని చూపుతున్న ఉమాభారతి ఇంతవరకు 600 ప్రదర్శనలు యిచ్చారు. అయితే వాటిలో చాలామటుకు ఏదో



ఒక సహాయ కార్యక్రమం కోసమే నిర్దేశించబడడమే విశేషం. వరద బాధితుల సహాయార్థం ఆమె తన నాట్య ప్రదర్శనల ద్వారా దాదాపు 20 వేల రూపాయలు సేకరించి ముఖ్యమంత్రి నిధికి సమర్పించారు. ఆ విధంగా ధనం సేకరించిన ప్రథమ నాట్యకారిణి ఆమే కావడం మరో విశేషం.

ఉమాభారతి విదేశాలలో దాదాపు 40 ప్రదర్శనల దాకా యిచ్చారు. అమెరికా, ఇంగ్లండు, దక్షిణ ఆఫ్రికా, మలయా, మారిషస్, సింగపూర్ దేశాలలో ఈ ప్రదర్శనలు జరిగాయి. త్వరలోనే తిరిగి ఆమె అమెరికా, ఇంగ్లండు, దక్షిణ ఆఫ్రికా దేశాలు తన బృందంతో పాటు పర్యటించబోతున్నారు. ఆమె బృందం పేరు ఓమ్ ఇంటర్నేషనల్ కల్చరల్ సెంటర్.

ఉమాభారతి తల్లి శ్రీమతి శారదా సత్యనారాయణ కూడా ఈ బృందంలో సభ్యురాలు. ఆమె ఉమాభారతి మేకప్, దుస్తులు మొదలైన విషయాలు చూసుకుంటూ వుంటారు. ఆమె తండ్రి మేజర్ సత్యనారాయణ ఈ సాంస్కృతిక సంస్థకి గౌరవ అధ్యక్షుడు. ఉమాభారతి సోదరుడు కూడా ఈ సాంస్కృతిక కార్యకలాపాలలో ముఖ్య పాత్ర వహిస్తున్నారు. ఇలా ఒక కుటుంబంలోని సభ్యులందరూ కూడా సాంస్కృతిక కార్యకలాపాలలో పాల్గొనడం చెప్పుకోదగ్గ విషయం.

ఉమాభారతి కేవలం రంగస్థలం పైన తన నాట్య కౌశలాన్ని చూపడంతోనే సరిపెట్టుకోలేదు. 'ఓమ్ ఇంటర్నేషనల్' పేరిట ఆమె ఒక హ్రస్వ చిత్రాన్ని కూడా నిర్మించారు. ఆ చిత్రం పేరు 'డాన్సస్ ఆఫ్ ఇండియా : కూచిపూడి'—భారత దేశపు నృత్యాలలో కూచిపూడికి గల ఉన్నత స్థానాన్ని తెలియజేస్తుంది ఈ చిత్రం. విదేశస్థులకు మన కూచిపూడి నాట్యపు ఔన్నత్యాన్ని తెలియజేయాలన్న తపనతో ఆమె ఆ చిత్రం ప్రతులను దక్షిణ ఆఫ్రికా, మలయా, మారిషస్ దేశాలకు బహూకరించారు.

గత ప్రపంచ తెలుగు మహా సభలలో ఆమె చేసిన నృత్యాన్ని దేశ విదేశాలకు చెందిన ఎంతో మంది ప్రతినిధులు తిలకించారు. విదేశాలనుండి వచ్చిన సభ్యులు ఆమె నాట్యానికి ముగ్ధులై తమ దేశాలకు ఆహ్వానించారు కూడా.

సింగపూర్, దక్షిణ ఆఫ్రికాలలో ఆమె నృత్య ప్రదర్శనలు వర్ణచిత్రం రూపంలో టెలివిజన్‌లో ప్రదర్శితమయ్యాయి.

"గన్స్ ఆఫ్ నొవరోన్", వంటి వుత్తమ చిత్రానికి ఛాయాగ్రహకుడైన సెడోవ్ ఆ ప్రదర్శనను చిత్రీకరించారు. ఇది నా జీవితంలో మరపురాని



సంఘటనలో చెప్పుకోదగ్గది" అంటారు ఉమా భారతి.

ఆమె తన కళాచాతుర్యాన్ని ఒక్క నాట్య రంగానికే పరిమితం చేయలేదు. సాహిత్య అకాడెమీ అవార్డు పొందిన నవల 'చిల్లర దేవుళ్ళు' చలన చిత్రంలో ఆమె ఒక ముఖ్య భూమికను పోషించారు.

"మంచి పాత్ర, చక్కటి కథా చిత్రం అయితే నటించడానికి నాకు ఎటువంటి అభ్యంతరమూ లేదు. కాని నృత్యం నా ధ్యేయం. మిగిలినవి తరువాతనే" అంటారు ఆమె.

1971 లో ఆమెకు కూచిపూడి నృత్యంలో ప్రథమ బహుమతి, స్వర్ణపతకం లభించాయి. ఆంధ్ర ప్రదేశ్‌కి చెందిన దాదాపు ముప్పై సాంస్కృతిక సంస్థలు ఆమెను బిరుదులు, సన్మానాలతో గౌరవించాయి.

'తరంగ విశారద', 'అభినయ భారతి', 'నాట్య మయూరి', 'నృత్యకోవిద' ఆమెకు గల బిరుదుల్లో కొన్ని. 'నాట్య భారతి' బిరుదాన్ని స్వర్ణ కంకణంతోపాటు ప్రఖ్యాత సంగీత విద్వాంసులు శ్రీ బాలమురళీకృష్ణ ఆమెకు సమర్పించారు. □




'వనిత'లో మీరు ప్రచురిస్తున్న 'ప్రాచీన అలంకరణ' చూసి చాలా ఆనందించాము. చాలా బాగుంది.

—కె. హేమలత, నెల్లూరు

జనవరి 'వనిత' అట్టమీద ఉన్న 'అంతర్జాతీయ బాలల సంవత్సర' సందర్భంగా బొమ్మ మమ్మలను ముగ్ధులను చేసింది. ఈ సందర్భంగా 'వనిత'లో ప్రచురించిన 'పిల్లల పెంపకంలో తీసుకోవలసిన కొన్ని జాగ్రత్తలు, చాలా విజ్ఞానదాయకంగా ఉన్నవి. అలాగే 'బాల నేరస్తులు', 'ఈ బాలలూ భారతీయులే', 'చిన్న పిల్లలూ-చిత్రహింసలూ' అను శీర్షికలు మమ్మలను ఎంతగానో ఆకర్షించినవి.

—డి. కమల, సుజాత, సునీత, కొలనూరు

జనవరి నెల సంచికలోని 'మాతృత్వం', తైల వర్ణ చిత్రం చాలా బాగుంది. మా మనస్సు కదిలించి వేసింది.

కె. లక్ష్మి, జానకి, సామర్లకోట

జనవరి నెలలోని 'మాతృత్వం' చిత్రం చాలా అసభ్యంగా, అసహజంగా వున్నది. ఎంత గొప్ప చిత్రకారుడు రచిస్తే మాత్రం-అటువంటి చిత్రం మీరు ప్రచురించడమా!

—పార్వతీ సుందర్, ఏలూరు

'వనిత' సంవత్సర పరీక్ష నెగ్గినందుకు మీరు పంపిన బహుమతి చేరినది కార్డులో 'నెల' లోపున పంపుతామని వ్రాశారు. చూసి, చూసి విసిగిపోయాము. ఇంక రాదని నిరాశ చెందాము. మీరు అన్నమాట ప్రకారం 'బహుమతి' పంపినందుకు సంతోషం. మాకు మీ నుంచి వచ్చే బహుమతి ముఖ్యం కాదు. అలాంటిది మేము ఎలాగైనా పొందగలము. కానీ, మా అభిమాన మాస పత్రిక 'వనిత' ద్వారా వచ్చిన బహుమతి అని చెప్పుకోవటంలో చాలా తృప్తి, సంతోషం వున్నాయి.

—యమ్. రాధ, పుత్తూరు

మీరు అందించిన '79వ సంవత్సరపు తొలి మాస పత్రిక ముఖచిత్రం అంత ఆకర్షణీయంగా లేదు. 'నా చరిత్ర' - గేయం శ్రీమతి శారదా అశోకవర్ధన్ బాగా రాసారు.

—ఎస్. టి. మంగతాయారు, గడ్డి అన్నారం

అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా ప్రచురించిన వ్యాసాలు చదివి నేనెంతగానో ఆనందించాను. ఈ వ్యాసాల ద్వారా ఎన్నో మంచి విషయాలను చాలా చక్కగా తెలియపరిచారు.

—పి. వి. సుబ్బలక్ష్మి, రాజమండ్రి

## వార్తావనిత

రాజమండ్రి ఇన్నర్‌వీల్ క్లబ్‌వారు తమ దశాబ్దోత్సవాలు స్థానిక శ్రీ దుర్గా కళ్యాణమండపంలో జరిపారు. ఆ సందర్భంగా కళాప్రపూర్ణ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారికి సన్మానం చేశారు. అనంతరం అష్టావధాని చిలుకూరి రామభద్రశాస్త్రి రచించిన 'శ్రీ సరస్వతీ సపర్యా మహోత్సవము' అనే కవయిత్రుల సమ్మేళనం నిర్వహించారు. ఇందులో సరస్వతిగా వేలూరి కామేశ్వరి, మధురవాణిగా డా॥ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, గంగాదేవిగా వేదుల మీనాక్షీదేవి, మొల్లగా అద్దేపల్లి వివేకానందదేవి, వెంకమాంబగా కోడూరి లీలావతీదేవి, రంగాజమ్మగా సత్యవాడ ఇందిరాదేవి, ముద్దుపళనిగా ఓగేటి ఉష, రామభద్రాంబగా కె. కమలాదేవి, కనుపర్తి వరలక్ష్మమ్మగా సునర్ల (నందుల) సుశీలాదేవి, మీరాబాయిగా ప్రేమకుమారి జాజూ పాల్గొన్న ఈ కవయిత్రుల సమ్మేళనంలో బృహస్పతిగా చిలుకూరి రామభద్రశాస్త్రి వ్యవహరించారు. ▼



మచిలీపట్నం శ్రీ విద్యాభివర్ధని సంఘంవారు తమ సొంత భవనంలో క్రెషె (శిశువిహార్)ను గత మూడు సంవత్సరాలుగా నడుపుతున్నారు. ఉద్యోగినులైన తల్లులు తమ పిల్లలను ఉదయం నుండి సాయంత్రం వరకు యిక్కడ వుంచుతారు. వారి సంరక్షణకు తగిన ఏర్పాట్లు అన్నీ అధ్యక్షురాలు శ్రీమతి వి. ఎల్. శారద పర్యవేక్షణలో చేయబడుతున్నాయి. ఆంధ్రప్రదేశ్ శిశు సంక్షేమ శాఖ సహకారంతో ఈ 'క్రెషె' నడపబడుతోంది.



తిరుపతి శ్రీ పద్మావతీ ప్రార్థన మహిళా మండలివారు ఇటీవల ఎగ్జిబిషన్ ఏర్పాటు చేశారు. శ్రీమతి గోపికాప్రసాద్ ప్రారంభోత్సవం చేశారు. శ్రీమతులు ఆచంట శారదాదేవి, అన్నపూర్ణా నూర్జాహాన్ న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు. మండలి సభ్యుల లలితకళల ప్రదర్శనతో కార్యక్రమాలు వైభవంగా జరిగాయి.



శ్రీమతి పొన్నలూరు పద్మావతి రచించిన 'రాధ' ('వనిత' సీరియల్), 'అంతరాలు', 'వియ్యాలు-కయ్యాలు' నవలలను ప్రముఖ రచయిత్రి శ్రీమతి పవని నిర్మల ప్రభావతి ఆవిష్కరించారు. ఆనాటి సభకు ఇసుగంటి కమలమ్మ అధ్యక్షత వహించారు. ప్రకాశం జిల్లా కందుకూరు తాలుకా రచయిత(తృ)ల సంఘం ఆధ్వర్యాన ఈ నవలాత్రయా విష్కరణ జరిగింది.





బరంపురం ఆంధ్ర మహిళా సమాజంవారు ఇటీవల సమాజ స్థాపకురాలు కీ॥ శే॥ గాదె చూడుకుడుతమ్మగారి జన్మదినోత్సవం జరుపుకున్నారు. ఈ సందర్భంగా కుమారి చాగంటి తులసి రాసిన 'తగవు' నాటిక ప్రదర్శించబడింది. ఆ నాటికలో శ్రీమతులు వత్సల, పద్మావతి, కాశీకుమారి, కుసుమ, మీనా, అహల్య, నీలవేణి, కుమారి లీల పాల్గొన్నారు. ఈ చిత్రంలో కుమారి ప్రభామీనన్ కూడా వున్నారు.

రాజమండ్రి లయన్ లేడీస్ క్లబ్‌వారు గత నెల డాక్టర్ మాలతీ ప్రభాకరరావు అధ్వర్యంలో ఉచిత వైద్యచికిత్సా శిబిరం ఏర్పాటు చేశారు. దాదాపు రెండువేలమంది స్త్రీలు ఈ శిబిరం ద్వారా వైద్య సహాయం పొందారు. కార్యదర్శి వై సరస్వతీ కృష్ణ అధ్యక్షురాలు సర్వలక్ష్మి సూర్యనారాయణ శిబిర నిర్వహణకు కృషి చేశారు.




చీరాల మహిళా మండలి తమ రజతోత్సవ వేడుకలు ఇటీవల జరిగాయి. శ్రీమతి భవనం జయప్రద సభకు ప్రారంభోత్సవం చేశారు. శాసన సభ్యురాలు శ్రీమతి దొడ్డపనేని ఇందిర అధ్యక్షత వహించారు. శ్రీమతి ఎమ్. కల్యాణి వందనసమర్పణ చేశారు. సభ్యురాండ్రచే 'మర బొమ్మలు' నాటిక ప్రదర్శించబడింది. ఆనాటి సభలో మండలి అధ్యక్షురాలు పి. అనసూయ, తొలి అధ్యక్షురాలు డాక్టర్ ఫ్రేజర్ పాల్గొన్నారు.

—పి. విజయలక్ష్మి





బొంబాయి తెలుగు సాహిత్యసమితిలోని స్త్రీ సభ్యులు స్థానిక మానవసేవామందిర్ హాలులో 'కుమారసంభవం' నృత్యనాటికను ప్రదర్శించారు. శ్రీమతి ఉషా కృష్ణారావు, కుమారి శుభద, కుమారి మాలతి నృత్య నిర్వహణ వహించిన ఈ నాటికలో అరుణ, కుముద, త్రిపురసుందరి, మధు, మాలతి, శారద, శుభద, సంగీత, సాయిప్రభ, భానుమతి వివిధ పాత్రలను ధరించారు.



సుప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ స్మారక సంఘం వారు బాపట్లలో శ్రీ హితైషిణీ మండలి భవనంలో – వరలక్ష్మమ్మ తైల వర్ణచిత్ర పటాన్ని శ్రీమతి కొండా పార్వతీదేవి ద్వారా ఆవిష్కరింపజేశారు. కుమారి దాసరి శారద ఈ చిత్రపటాన్ని బహూకరించారు. ఈ ఛాయాచిత్రంలో సంకా భామమతి, (మండలి ఉపాధ్యక్షురాలు) దాసరి శారద, కొండా పార్వతీదేవి, పాలపర్తి ఉమాదేవి (మండలి కార్యదర్శి) కనిపిస్తున్నారు.

విశాఖపట్నం మేధావి వర్గానికి చెందిన మహిళలు, వివిధ రంగాలలో ప్రవీణులయిన మహిళలు కలిసి యిటీవల నగరంలో ప్రప్రథమంగా "లయనెస్ క్లబ్బు" స్థాపించారు. ఇందులో డాక్టర్లు, లాయర్లు, విద్యావేత్తలు, ప్రొఫెసర్లేగాక వ్యాపార వాణిజ్యాలలో ప్రముఖులైనవారి భార్యలు, ఉన్నతోద్యోగుల భార్యలు మొదలైనవారు నలభైమంది సభ్యురాండ్రుగా చేరారు. విశాఖ లయన్సు క్లబ్బు ఆధ్వర్యంలో లయన్సు డిస్ట్రిక్టు – 324 C గవర్నరు సతీమణి శ్రీమతి నిర్మలా భాస్కరరెడ్డి – క్లబ్బుకు ప్రారంభోత్సవం చేయగా లయన్ డా॥ ఎల్. భాస్కర రెడ్డి కార్యకర్తలచే పదవీస్వీకారం చేయించారు. ప్రస్తుత సంవత్సరానికి కార్యదర్శిగా శ్రీమతి పార్వతీ భాస్కరరావు, అధ్యక్షురాలిగా డా॥ లావణ్య ముఖర్జీ (చిత్రంలో కనిపిస్తున్నారు) కోశాధికారిణిగా డా॥ మిస్ డి. ఆర్. చిత్ర ఎన్నికయ్యారు. లయన్సు పాస్టు డిస్ట్రిక్టు గవర్నరు ఎ. గోవర్ధన్ "ది విశాఖ లయనెస్" ప్రారంభోత్సవ సంచికను ఆవిష్కరించారు. లయన్సు క్లబ్బు అధ్యక్షులు లయన్ ఎ. వి. ఎస్. మూర్తి సభకు అధ్యక్షత వహించారు. లయనెస్ డా॥ డి. ఉషాదేవి వందనసమర్పణ చేశారు.

—విలేకరి





▲ విశాఖపట్నం లయన్ లేడీస్ క్లబ్ కార్యకర్తలు అధ్యక్షురాలు శ్రీమతి గ్రంధి విజయలక్ష్మి మంగరాజు ఆధ్వర్యంలో ద్వారకానగర్‌లోని "మిరియం చిల్డ్రన్ హోమ్" – అనాథశిశు శరణాలయం పిల్లలకు చలికాలంలో ఉపయోగించుకొనే నిమిత్తం ముతక దుప్పట్లను పంచిపెట్టారు.

—విలేకరి

హైదరాబాదు లయనెట్స్ క్లబ్ బల్కాంత్ నగర్‌లో యిటీవల నిర్వహించిన బాల్వాడీ ఆటల పోటీలలో పాల్గొన్న బాలబాలికలు – అధ్యక్షురాలు డా॥ సుధా కిశోర్, కార్యదర్శి శ్రీమతి సరయూ అవశ్య-తదితరులూ.

—విలేకరి ▼



ఆంధ్ర సాహిత్యంలో శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మకు విశిష్ట స్థానం వుంది. నేటి రచయిత్రులతో పోల్చి చూస్తే ఆమె చేసిన రచనలు తక్కువే అయినా అవి సాహితీ చరిత్రలో చిరస్థాయిగా నిలచిపోయే రచనలన్నవి నిర్వివాదాంశం. వాటిలో పేర్కొనదగినవి — 'ఆంధ్ర కవయిత్రులు', 'అఖిల భారత రచయిత్రులు'. ఉభయ భాషాప్రవీణ అయిన ఆమె తెలుగులోనే కాక, సంస్కృతభాషలో కూడా కొన్ని గ్రంథాలు రచించారు. సాహితీరంగంలోనే కాక ఆనాటి రాజకీయ రంగంలో కూడా ఆమెకు పరిచయం వుంది. స్వాతంత్ర్య పోరాటంలో, సత్యాగ్రహ ఉద్యమాలలోనూ ఆమె పాల్గొనడమే కాకుండా తన ఉపన్యాసాలతో దేశభక్తిని ప్రబోధించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనెట్, కేంద్ర సాహిత్య అకాడెమి, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ మొదలైన సంస్థలలో సభ్యురాలుగా వుండేవారు. ప్రస్తుతం ఆమె ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి, బాలల అకాడెమి, తెలుగు భాషాసమితులలో సభ్యురాలు. 1953 లో గృహలక్ష్మి స్వర్ణకంకణంతోపాటు 'ఆంధ్ర కవయిత్రులు' గ్రంథానికి తెలుగు భాషాసమితివారి బహుమతి కూడా పొందారు. అప్పటి నుంచి ఆమె అనేక సత్కారాలు, బిరుదులు పొందారు. సాహితీరంగంలో ఆమె చేసిన విశిష్టమైన సేవకు గుర్తింపుగా, గత సంవత్సరం ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆమెకు 'కళాప్రపూర్ణ' గౌరవ డాక్టరేటు పట్టం యిచ్చి గౌరవించింది.



మీరు రచనలు చేయడం ఎప్పుడు ప్రారంభించారు? మీ తొలి రచన ఏది?

నా పన్నెండో ఏట నేను తొలి రచన చేశాను. నాకు జ్ఞాపకం వున్నంతవరకూ 'నిశాకాంత' అనే స్కెచ్ తొలిసారిగా 'భారతి'లో ప్రచురితమయింది. అంతే కాదు. ఆ సంవత్సరం 'భారతి'లో వచ్చిన రచనలలోకల్లా చిన్న ఖండికరూపంలో వున్న నా రచన 'నిశాకాంత' ఉత్తమ సాహిత్య విలువలు గల రచనగా పేర్కొనడం జరిగింది.

సాధారణంగా రచనలు చేయడానికి ప్రేరణ కల్గించే సంఘటనలు కొన్ని వుంటాయని అంటూ వుంటారు. ఆ విధంగా మీరు రచనలు చేయడానికి ప్రోద్బలం చేసిన సంఘటనలు ఏవైనా వున్నాయా?

ఈనాడు రచయితలకి ఆలోచనలు రేకెత్తించి ప్రోద్బలం చేసే సంఘటనలు ఎన్నో వున్నాయి. ఆకలి, నిరుద్యోగం, అసంతృప్తి, వర్గకల్లోలాలు, సంఘర్షణలు మొదలైనవి. కాని నా బాల్యంలో బ్రిటిషువారి పరిపాలన, భారతీయుల దాస్య జీవనం జటిలసమస్యలుగా ప్రజల మనస్సులను కలచివేస్తూ వుండటం మాత్రమే వేనెరుగుదును. అయినా అది నా ప్రథమ రచనకు విషయం కాకపోవడం నాకూ ఆశ్చర్యాన్నే కలిగిస్తోంది. ప్రథమ రచన అని చెప్పుకోదగిన 'నిశాకాంత' కేవలం వర్ణనాత్మకమే. అయితే ఆ తరువాత ఆనాటి జాతీయ వుద్యమం, సాహిత్యోద్యమం నాపై తమ ప్రభావం చూపాయి. తత్ఫలితంగా వెలువడిన రచనలే – 'భారతదేశ చరిత్ర – కొన్ని గుణ పాఠములు', 'వ్యాకరణము-భాష'.

మీరు రచించిన 'వ్యాకరణము - భాష' ఆనాటి సాహితీరంగంలో సంచలనం చెలరేపిందంటారు. ఆ విషయం గురించి కొంచెం చెబ్తారా?

ఆ మాట నిజమే. ఆనాడు ఆంధ్రభాషకు వున్న వ్యాకరణం సమగ్రమైనది కాదు. వ్యాకరణం యొక్క నిష్ఠూరమైన నియమాలవల్ల భాషా సౌందర్యం, రచనా సౌందర్యం బాధింపబడకూడదనే వుద్దేశ్యంతో నేను ఆ వ్యాసం రాశాను. మా నాన్నగారు 'మధురకవి' నాళం కృష్ణారావు గారు నిర్వహించిన గిడుగు రామ్మూర్తి పంతులు సప్తతి జన్మదినోత్సవ సభలో ఆ వ్యాసం చదివాను. సాహితీ వేత్తలందరి ప్రశంసలు పొందిన ఆ వ్యాసం 'భారతి'లో ప్రచురింపబడింది. ఆనాటి సాహిత్యవేత్తల అభిప్రాయాలలో విప్లవాన్ని తెచ్చిన రచన అది.

మీరు రచించిన నవలలు, కథలు గురించి చెబు తారా? మీరు ఎటువంటి రచనలు చేయడానికి ఉత్సాహం చూపుతారు?

లేదమ్మా.... నేను నవలలు రాయలేదు. కథలు రాశాను. కాని అవి కొంచెం ధర్మసందేశ ప్రయోజనాన్ని కలిగి వుండడం చేతనేమో పత్రికలవాళ్ళు ప్రచురించలేదు. సాహిత్య అకాడెమీ వారి పక్షాన ప్రచురింపబడిన రచయిత్రుల కథా సంపుటాల్లో 'సుకాంచన' అనే పేరుతో నా కథలు ప్రచురితమయ్యాయి. ఇక ఎటువంటి రచనలు చేయడానికి ఉత్సాహం చూపుతానంటావా.... ఆ నాటి దేశావసరాలను బట్టి నా లేఖిని అనేక ఉద్యమ స్వరూపాలకు ఆకృతి దిద్దింది. అంచేత నిజంగా ఆలోచిస్తే అటువంటి రచనలంటేనే నాకెక్కువ ఇష్టమేమో అనిపిస్తుంది. ఆ.... అన్నట్లు.... కేంద్ర ప్రభుత్వం వారి ప్రణాళికవల్ల 'అఖిలభారత రచయిత్రులు' అనే గ్రంథం వ్రాశాను. ఆ సందర్భంగా నేను అఖిలభారత పర్యటన చేసి అన్ని భారతీయ భాషలలోని సాహిత్య చరిత్రలో గూఢంగా నిక్షిప్తమై వున్న రచయిత్రుల కావ్య పరిశ్రమను వెలికి తీయడం జరిగింది. ఈ గ్రంథ రచన నాకు తృప్తినిచ్చింది. నాకు నచ్చిన రచన అంటావా........'కోరల మధ్య కోటి స్వర్గాలు' అనే కథ.

ఆ నాటి జాతీయ ఉద్యమంలో మీకు ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కాని సంబంధం వుందా?

ఆ నాటి జాతీయ వుద్యమంతో నాకు ప్రత్యక్షంగానే సంపూర్ణమైన సంబంధం వుంది. మా అమ్మ నాళం సుశీలమ్మ, మా నాన్నగారు కూడా తమ జీవితాలను బాపూజీ స్వాతంత్ర్య పోరాట ఉద్యమానికి అంకితం చేసుకున్నారు. వారి ప్రభావం నా మీదా పడింది.

ఉపన్యాసాలిచ్చి, పూరేగింపులు జరిపి, మా నాన్న గారు రాసిన పాటలు పాడి నేనూ సంపూర్ణంగా వుద్యమంలో పాల్గొన్నాను. అయితే అప్పుడు చిన్నదాన్ని కావడం మూలాన జైలుశిక్ష, లాఠీ దెబ్బలు నాకు ప్రసాదింపబడలేదు. అంతే.

*మీకు అప్పటి మహిళోద్యమంతోనూ, ఈనాటి మహిళాభ్యుదయ రంగంతోనూ కూడా పరిచయం వుంది కదా...అప్పటికి, ఇప్పటికి ఏర్పడిన మార్పుల గురించి చెబుతారా?*

# ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ తో గోష్ఠి



చాలా మార్పు వుందమ్మా! నా చిన్నతనంలో నేను ఒకమారు మద్రాసులో జరిగే ఒక సభకు వెళ్ళాను. అక్కడ స్త్రీలలో చాలామంది విద్యాధికులు పరిచయం అయ్యారు. అంతేకాదు. 1961 – 62 ప్రాంతాలలో 'అఖిలభారత రచయిత్రులు' గ్రంథం కోసం దేశపర్యటన చేసినప్పుడు ఇతర రాష్ట్రాలలో అనేకమంది విద్యావంతులైన వనితలు కనిపించారు. అప్పుడనిపించింది. 'అయ్యో! మన రాష్ట్రంలో స్త్రీలు యింత విద్యాధికులు కారే' అని. అయితే ఆ నాటికీ యీ నాటికీ ఎంతో మార్పు కలిగింది. స్త్రీలంతా చక్కగా చదువుకుంటున్నారు. ఉద్యోగాలు చేస్తున్నారు. ఇది నాకు చాలా సంతోషాన్ని కలిగిస్తోంది. ఆ నాడు స్త్రీలలో ప్రబలి వున్న మూఢ విశ్వాసాలు, బాల్యవివాహాలు, వాటి దుష్పరిణామాలు తలుచుకుంటే యిప్పటికీ నాకు భయంవేస్తుంది. వీరేశలింగం పంతులు గారివంటి మహనీయుల కృషి ఫలితంగా ఆ మూఢాచారాలకు స్వస్తి చెప్పడం జరిగింది. అయినా ఈ నాటికీ స్త్రీకి సమాన ప్రాతినిథ్యం యిచ్చి ప్రగతిపథంలో నడిపించడానికి ఇంకా కొంత ప్రాతికూల్యం వుండటం విచారించ వలసిన విషయం. అంటే సామాజిక శ్రేయస్సు సాధించే అన్ని రంగాల్లోనూ కూడా స్త్రీల ప్రాతినిధ్యం పెరగాలని నా అభిప్రాయం. అయితే రచనా విషయంలో మాత్రం ఆధునిక రచయిత్రులలో కొందరు సామాజిక శ్రేయస్సును నిర్లక్ష్యం చేసి అశ్లీలమైన రచనలు చేస్తూ అదే మహిళోన్నతి అని భావించడం దురదృష్టకరం. సంఘ శ్రేయస్సు మీద దెబ్బకొట్టే యితివృత్తం గల రచనలు నాకు యిష్టం లేదు.

*సాహిత్యానికి భాష ప్రధానమా? భావం ప్రధానమా?*

ఉత్తమ భావ ప్రాధాన్యత కలిగి మధురమైన భాషా సౌందర్యాన్ని స్ఫురింపజేసే రచనలే ఎప్పటికైనా ఆంధ్ర సాహిత్యానికి తేజస్సును సమకూరుస్తాయి.

*ప్రస్తుతం కథలు, నవలలు కేవలం కాలక్షేపానికే. వుపయోగపడుతున్నాయని కొందరు అంటున్నారు రచనల వల్ల సామాజిక ప్రయోజనం వుండాలని అంటారా?*

రచన ప్రధాన లక్షణం సామాజిక ప్రయోజనాన్ని కలిగి వుండడమేనమ్మా. కాని ఈనాటి నవలల్లో చాలా వాటికి అటువంటి ప్రయోజనమేదీ లేదనే చెప్పాలి. రచయిత(త్రు)లు ఎంతసేపూ సినిమా దృష్టితోనూ, కీర్తి ప్రతిష్టలకు, రాస్తున్నట్లుంది కాని శాశ్వత ప్రయోజనాన్ని కలిగించే విధంగా రాయడం లేదు. మనదేశంలో ఈనాడు ఎన్నో సమస్యలున్నాయి. వాటిని ప్రతిబింబింపజేస్తూ వచ్చే రచనల సంఖ్య స్వల్పం. అటువంటివయితేనే తెలుగు సాహిత్యంలో కలకాలం నిలిచిపోతాయి.

*నాటికీ, నేటికీ పోల్చి చూస్తే నేడు స్త్రీలే అధిక సంఖ్యలో సాహిత్యరంగంలో ముందంజ వేస్తున్నారు కదా ..రచన కుటీర పరిశ్రమ అయిపోయిందన్న విమర్శపై మీ అభిప్రాయం ఏమిటి?*

నిజానికి నేటి సాహిత్యరంగంలో స్త్రీలదే పైచేయిగా కనపడడం ప్రశంసనీయమే. అయితే ఇంతకుముందు నేను చెప్పినట్లు రచనలు కేవలం కాలక్షేపం కోసం మాత్రమే కాక, సామాజిక శ్రేయస్సుకి కూడా వుపయోగపడే విధంగా వుండాలి. అటువంటప్పుడు అది కుటీర పరిశ్రమ అయితే ఇంకా మంచిది కదా! నేటి స్త్రీల రచనలు దిగజారాయంటే అందుకు బాధ్యత పత్రికల వాళ్ళది కూడా. స్త్రీలచేత రాయిస్తే తమ పత్రికల ఆర్థికస్థితి మెరుగుపడుతుందన్న అభిప్రాయంతో కాస్త కలం పట్టగల వాళ్ళందరిచేతా రాయించడం, వారు వీరి 'అభిరుచులకు' అనుగుణంగా రచనలు చేయడం జరుగుతోంది. అది మాత్రం శోచనీయమైన పరిస్థితి.

*కొత్తగా రచనలు చేసేవారికి మీ అమూల్యమైన సలహా ఏమిటి?*

ఆంధ్ర సాహిత్యం అనాడు, ఈనాడు కూడా రచనలవల్లే సంపుష్టమైంది కాబట్టి రచనలెంత విస్తారమైన సంఖ్యలో వస్తే అంత సంతోషించదగిన విషయం. నూతన రచయితలకు నేను చెప్పేదొక్కటే....రాశి కంటె వాసి చూడమనీ, వాస్తవ దృక్పథంతో కలం. పట్టమనీ, స్వార్థం కోసం, ధనం కోసం కాక సమాజానికి ఉపకరించే రచనలు చెయ్యమనీను. ఇదే వారు నేర్చుకోవాల్సిన గుణపాఠం. అంతకంటె నేనేం చెప్పగలనమ్మా!

—కోటంరాజు (చిల్లర) భవానీదేవి

రామయ్యశాస్త్రి గేటు తీసుకుని బయటికి అడుగు పెట్టాడు. ఎదురుగా.... తెల్లటి చీరకి ఎర్రటి బార్డర్ వున్న వెంకటగిరి చీర, ఎర్రటి జాకెట్టు, నుదుట ఎర్రటి కుంకుమ పెట్టుకుని, 'ఆమె' ఎదురు వచ్చింది. 'అబ్బ! ఎంత అదృష్టం' అని మనస్సు లోనే అనుకుని తాను బయలుదేరిన కార్యం తప్ప కుండా విజయవంతం అవుతుందనుకున్నాడు.

రామయ్యశాస్త్రికి జాతకాలపిచ్చి, శకునాలపిచ్చి. అడుగుతీసి అడుగు వేయడానికి, రాహుకాలం, యమగండం, వర్జ్యం చూడ్డం ఇవన్నీ మొదటి నుంచి ఎక్కువే. శాస్త్రాలు, పురాణాలు చదివినా, ఇంగ్లీషు చదువుచదివి, వుద్యోగం చేసి, సొంత ఇల్లు కట్టుకుని కాలక్షేపం చేస్తున్నాడు. ఆయన రిటైరైనప్పటి నుంచి ఆ పిచ్చి మరింత ఎక్కువైంది.

ఇద్దరు కొడుకుల తర్వాత విమల పుట్టింది ఆయనకు. విమల తండ్రికి పూర్తి వ్యతిరేకం. తుమ్మితే ఏ పని చెయ్యొద్దన్నా, ఆ పని తప్పక చేస్తుంది. ఇక ఆ పనిలో ఏ పొరపాటైనా వస్తే, తండ్రి చీవాట్లు, తండ్రితో పోట్లాట. ఆ తండ్రి కూతుళ్ళ పోట్లాటలు తీర్చలేక ఆ తల్లి సతమత మవుతూ వుంటుంది.

జాతకాలను, శకునాలను నమ్మవద్దంటుంది విమల. అవి లేకపోతే ప్రపంచమే లేదంటాడు రామయ్యశాస్త్రి.

విమల అన్నయ్య లిద్దరు ఉద్యోగరీత్యా బయటి వూళ్ళల్లోనే వుంటున్నారు. పెద్దన్న శ్రీకాంత్ పెళ్ళికి పిల్లలను చూసి చూసి విసిగిపోయి, తండ్రి ఎవరిని చేసుకోమంటే, వాళ్ళనే చేసుకుంటానని, ముహూర్తం పెట్టి, పిలిపించమని చెప్పి వెళ్ళి పోయాడు.

కొడుకు కోసం పిల్లను చూడటానికి పండ్లు, పూలు తీసుకురావటానికి బయలుదేరినప్పుడే 'ఆమె' శకునం వచ్చింది రామయ్యశాస్త్రికి. ఆయన అనుకున్నట్టుగానే పిల్ల జాతకం, పిల్లాడి జాతకం సరిగ్గా సరిపోయాయి. మిగిలిన విషయాలు మాట్లాడు కున్న తర్వాత ముహూర్తం పెట్టించి, అబ్బాయికి పెళ్ళిగ్రాం యిచ్చాడు శాస్త్రి.

అన్నయ్య పెళ్ళికి హడావిడంతా విమలదే. స్నేహితురాళ్ళందరిని పిలిచింది.

రామయ్యశాస్త్రి విమలను పిలిచి, "విమలా! ఈ వీధిలో తెల్లగా, కాస్త సన్నగా నుదుట ఇంత కుంకుమ పెట్టుకుని, ఒకావిడ వెళ్తుంటుంది చూశావమ్మా!" అని అడిగాడు.

"ఆ! ఎవరబ్బా! కాస్త తల నెరిసినట్టుంటుంది. ఇద్దరు పిల్లలను తీసుకుని వెళ్తుంటుంది. ఆవిడా?" అని అడిగింది కాస్త వివరించి.

"ఆ! ఆవిడే. ఆవిడే. ఎవరావిడ? మన వీధిలో ఎక్కడుంటుంది?" ఆత్రంగా అడిగాడు రామయ్యశాస్త్రి.

"మనింటికి మూడో ఇల్లో, నాలుగో ఇల్లో అనుకుంటాను. అయినా, ఆవిడతో ఏం పని?" సాగదీసింది విమల.

"అబ్బే! ఏంలేదు. మొన్న శ్రీకాంత్ పెళ్ళి విషయమై వెడుతుంటే, ఆవిడే ఎదురొచ్చింది. వాడి పెళ్ళి పని ఈసారి అతి సులభంగా ముగి సింది. తర్వాత కూడ రెండు మూడు సార్లు ఆవిడ ఎదురొస్తే, వెళ్ళిన పనులన్నీ సాఫీగా జరిగి పోయాయి. ఆవిడ 'శకునం' చాలా మంచిది లాగుంది." అన్నాడు శాస్త్రి.

"మళ్ళీ మొదటికొచ్చావా నాన్నా? వాళ్ళిద్దరికి పెళ్ళి జరగాలని రాసి వుంది. జరుగుతుంది. అంతే గాని, శకునాలేంటి, జాతకాలేంటి? చెబితే వినవు. ఏది ఎలా జరగాలని రాసి వుంటే అదలా జరుగు తుంది నాన్నా" అంది విమల ఆవిడ శకునంతో పని లేదన్నట్టు.

"సరేలే. నీతో నేను వాదించలేను కాని, నీకు ఈ వీధిలో ఎవ్వరూ ఫ్రెండ్స్ లేరన్నావు. పోనీ, ఆవిడతో కాస్త మాటలు కలుపుకుని, స్నేహం చేయకూడదూ" అంటూ అక్కడ నుంచి వెళ్ళి పోయాడు శాస్త్రి.

నాన్నకు ఆ 'గురి' కుదిర్చిన ఆ ఇంటరెస్టింగ్ పర్సనాలిటీని సరిగ్గా చూడాలని దారికాచి, ఆవిడను పట్టేసింది విమల. ఆవిడ వెనకాలే వెళ్ళింది. ఆవిడ గేటు తీస్తుంటే —

"ఇదాండి మీ యిల్లు?" అంది వెనక నుంచి.

"అవును...." అంటూ ఆవిడ వెనక్కి తిరిగి చూసింది. "నేను మీ యింటికి నాలుగో యింటిలో వున్న రామయ్యశాస్త్రిగారి అమ్మాయిని" తన్ను తాను పరిచయం చేసుకుంది విమల.

"అంటే జాతకాలు అవీ చూస్తూ వుంటారే...." ఆవిడ మాట ఇంకా పూర్తి కాకుండానే విమల అందుకుని, "అవునండి. ఆయనే మా నాన్న గారు" అంది.

"రండి. లోపలికి." ఆమె ఆహ్వానించింది.

"నా పేరు విమల. మరి మీరు...."

"నా పేరు సరోజ. ఎం. ఎ. చదువుకున్నాను. ప్రస్తుతం ఖాళీగానే వున్నాను." అంది పొడిగా.

"మీ పిల్లలు...."

"ఇద్దరండీ. ఒక పాప, బాబు. పాప నాలుగో క్లాసు చదువుతోంది. బాబు రెండో క్లాసు చదువు తున్నాడు. ఇప్పుడే వాళ్ళను స్కూళ్ళలో వదిలేసి, గుడికెళ్ళి వస్తున్నాను" అంది సరోజ.

ఆమె భర్త గురించి అడుగుదామనుకుని, ఇంకోసారి అడగవచ్చునని వూరుకుంది విమల.

తర్వాత కొంచెంసేపు పిచ్చాపాటి మాట్లాడు కున్న తర్వాత విమల ఇంటికొచ్చేసింది.

*

ఓ పదిరోజుల తర్వాత అన్నయ్య పెళ్ళి ఇన్విటేషన్ తీసుకుని, పది గంటల ప్రాంతంలో సరోజ ఇంటికి వెళ్ళింది విమల.

"రండి. రండి, మళ్ళీ చాల రోజుల తర్వాత కనిపించారు. ఏమిటి విశేషం?" సాదరంగా ఆహ్వానించింది సరోజ.

"మా అన్నయ్య పెళ్ళండి. మరి చీరలు, నగల సెలక్షన్ నాదే కదా. ఆ హడావుడిలో కాస్త బిజీగా వున్నాను" అంది విమల గర్వంగా.

"అవునండి. మా అన్నయ్య పెళ్ళికి నాకూ చాల సందడిగా, సరదాగా వుండేది. మరి ఆడ పడుచులం అర్ధమొగుళ్ళం కదా" అనేసరికి,

— విస్సారమాదేవి

# మైకం



ఇద్దరూ నవ్వేశారు.

"కాని, పెళ్ళి అయ్యేదాకానే అన్నయ్యలు. ఆ తర్వాత వాళ్ళ భార్యల భర్తలు కదా" అంది కొంచెం వెటకారంగా సరోజ.

"అలా అనకండి. మా అన్నయ్యలిద్దరూ అలాంటి వాళ్ళు కారు. అంతెందుకు? మా అన్నయ్య ఇంతదాక పెళ్ళికూతుర్ని చూడలేదు. మా నాన్న ఎవర్ని చేసుకోమంటే వాళ్ళని చేసుకుంటానన్నాడు! ఇంక, నేనంటే వాళ్ళిద్దరికీ పంచప్రాణాలు. ఎప్పుడొచ్చినా నాకు చీరలు, మంచి స్వీట్స్ తెస్తుంటారు" అంది విమల అన్నయ్యల గురించి గొప్పగా చెబుతూ.

"ఆగండి అక్కడ. ఇది పెళ్ళికి ముందు ప్రతి అన్నయ్య చేసే పనే. పెళ్ళి అయ్యాక కూడా మీ అన్నయ్యలు మారకుండా వుంటే మీ అంత అదృష్టవంతులు మరొకరుండరు. సరేనా?" రాజీకి వస్తూ అంది సరోజ.

"చూద్దామండి పందెం. సరేనా?" అంది విమల కొంటెగా. "సరేకాని, మీ పెళ్ళెప్పుడు?" అడిగింది సరోజ.

"ఆ విషయం మాత్రం అడక్కండి. ఎప్పుడో ఒకరోజు హఠాత్తుగా వచ్చి మీ కాళ్ళకు దండం పెడుతాననుకోండి" అంది విమల చమత్కారంగా.

"ఏం ప్రేమ వివాహమా?" ఆత్రంగా అడిగింది సరోజ.

"ఆ! అదొక్కటే తక్కువ! అదంతా ఏం లేదు కాని, నాకీ జన్మలో పెళ్ళి జరగదండి" ఢంకా కొట్టినట్టు చెప్పింది విమల.

"ఛ! అలా అనకండి" అంది సరోజ. "ఏం? ఎంచేత" అని కారణం అడుగుతూ.

"ఏం చెప్పమంటారు? మా నాన్నకు జాతకాల పిచ్చి. జాతకాలు కుదిరితే, పిల్లాడు బాగులేడనో, ఆస్తి లేదనో, మంచి ఉద్యోగం కాదనో, ఏదో ఒక సాకు చెప్పి, అన్ని సంబంధాలు చెడగొట్టేస్తుంటారు. ఏం చెయ్యను? మా నాన్నకు మరి నేను ఒక్కత్తెనే కూతుర్ని కదా! అందుకని, అన్ని హంగులున్న సుందరాంగుడు ఆయనకు అల్లుడు కావాలట. ఏ తండ్రికైనా అది సహజమైన కోరికేననుకోండి. గత ఆరు సంవత్సరాలుగా అంటే నా ఇరవైయవ యేట నుండి 'వరుల వేట' ప్రారంభించి, ఇప్పటికి ఇంకా ఒక్కడిని కూడ పట్టుకోలేకపోయారు. ఇక మీదట పట్టుకో

గలుగుతారనే నమ్మకం నాకు లేదు.'' అంది విమల తేలికగా

''అవేం మాటలండి మరీనూ'' అని సర్ద బోయింది సరోజ.

''అది అంతేనండి'' సీరియస్‌గా అయి పోయింది విమల. ''లేకపోతే ఏం జాతకాలు, ఏం గ్రహాలు చెప్పండి! అందుకే మా నాన్నకు నాకూ ఎప్పుడూ పోట్లాటలు వస్తుంటాయి. నా విషయం మీద అన్నయ్యలు కూడ నాన్నతో ఘర్షణ పడ్డారు. ఏం చేయలేక వూరుకున్నారు. ఏం చెయ్యగలం చెప్పండి? ఏది ఎలా రాసి వుంటే అలా జరుగుతుందన్న అభిప్రాయానికి వచ్చేశాను నేను.'' అని నిట్టూర్చింది విమల.

''నిజమేనండి. నాకు ఈ జాతకాల మీద ఒకప్పుడున్న నమ్మకం ఇప్పుడు పూర్తిగా పోయింది. జాతకాలు కుదిరే మా పెళ్ళి చేశారు. మరి ఇప్పుడేమైంది?'' అని ఆగి విమలకేసి చూసింది సరోజ.

''ఏమైంది?'' ఆత్రంగా అడిగింది విమల.

''నా పెళ్ళి అయి పట్టుమని పదేళ్ళు పూర్తి కాలేదు. ఆయన స్కూటర్ యాక్సిడెంట్‌లో పోయారు'' అంది బాధగా సరోజ.

విమల గుండెలు ఒక్క_క్షణం కొట్టుకోవడం మానేశాయి. 'ఈవిడ 'విడో'నా?' అని మనస్సులో అనుకుని, ఒక్క_సారి గట్టిగా వూపిరి పీల్చుకుంది.

''ఆయన పోయాక, ఇద్దరు పిల్లల్ని తీసుకుని, నేనెక్కడికి పోగలను చెప్పండి? నా ప్రాణప్రదమైన అన్నయ్య వదిన దాసుడైపోయాడు. ఆయన మిగిల్చిన ఈ యింటిలో, ఆయన సంపాదించిన ఆస్తితో కాలక్షేపం చేస్తున్నాను. కూడు, గుడ్డకు లోపం లేదనుకోండి. అయినా, నా మనస్సును డైవర్ట్ చేయడానికి, కాలక్షేపం కోసం ఏదైనా వుద్యోగం చేయాలనుకుంటున్నాను.'' అంది సరోజ.

''మరి మీరు బొట్టు....'' మాట ముగించలేదు విమల.

''అన్నయ్య నా మొహాన బొట్టు లేకుండా చూడలేనన్నాడు. పిల్లలు కొంచెం పెద్దయినప్పటి నుంచి బొట్టు పెట్టుకోమని ఒకటే గోల. అదీగాక, నా మనస్సులోనే వున్న మా వారిని మరువలేక ఎప్పుడూ బొట్టు పెట్టుకుంటాను.'' అంది భారంగా సరోజ.

అంత జాతకాల, శకునాల పిచ్చి వున్న నాన్న మరి ఈవిడ శకునం మహా గొప్పదని నమ్మాడు!, ఇప్పుడేమైంది? ఆలోచించసాగింది విమల.

''ఏమిటి ఆలోచిస్తున్నారు?'' అడిగింది సరోజ.

''ఏం లేదండి. కానున్నది కాకమానదు. నాకు మాత్రం మొదటి నుంచి ఈ జాతకాల మీద, శకునాల మీద నమ్మకం లేదు. మా నాన్నగారికి మాత్రం ఆ పిచ్చి ఎప్పుడు పోతుందో తెలీదు. మరి వస్తాను. చాలా లేటయినట్లుంది పెళ్ళికి తప్పకుండా రండి.'' అని మరీ మరీ పిలిచి ఇంటికి బయలుదేరింది విమల.

నాన్నకు ఈ విషయం చెపితే ఈ దెబ్బతో జాతకాల జోలికి, శకునాల జోలికి పోడు. ఆవిడ శకునం అంత గొప్పదని నమ్మాడు. మరి. ఆ విషయం తెలిస్తే, తప్పకుండా ఆ మూఢ నమ్మకాలన్నిటిని గంగలో కలిపేస్తాడు. ఆవిడ శకునంలో అంత 'గురి' వుందికదా ఆయనకు.

నాన్నకు ఆ విషయం గబగబ చెప్పేయాలని యిల్లు చేరింది విమల.

''ఇచ్చావా ఇన్విటేషన్? అమ్మయ్య! మొదటి ఇన్విటేషన్ ఆవిడకిచ్చాం. ఇంక అన్నీ సవ్యంగా జరుగుతాయి.'' అని సంతోషంతో వుక్కిరి బిక్కిరవుతున్న నాన్నను చూసి నోట మాట రాలేదు విమలకు.

ఆయన నమ్మకం ఆయనది. తను ఎందుకు దాన్ని వమ్ము చేయాలి? ఇప్పుడు గనుక తను ఆవిడ గురించి చెబితే ఎలా వుంటుంది? తండ్రి మనసు ఎలా మారుతుందో, దాని పర్యవసానం ఎలా వుంటుందో వూహించలేకపోయింది విమల. ఆయనకు ఆ విషయం తెలియకుండానే వుంటే మంచిదనిపించింది. ఏ పాపమెరుగని సరోజను ఆయన కోపానికెందుకు గురి చెయ్యాలి? నాన్న దృష్టిలో ఆవిడను 'గొప్పదానిగా'నే వుండనిమ్మని, ఏది ఎలా రాసి వుంటే అది అలా జరుగుతుందన్న తన ధృఢ నమ్మకాన్ని నమ్ముకుని లోపలికి వెళ్ళింది విమల. □



డాక్టర్ పద్మినీ చెంగల్‌రాయ్

విశాఖపట్నం సౌత్ లయన్‌లేడీస్ ఆక్సిలియరీ క్లబ్ ప్రస్తుతపు అధ్యక్షురాలు డాక్టర్ పద్మినీ చెంగల్రాయ్ మద్రాసు యూనివర్శిటీలో మెడిసన్ అభ్యసించి గ్రాడ్యుయేట్ అయిన తర్వాత, ఇంగ్లాండులోని లివర్‌పూల్‌లో 'సైకియాట్రీ' సబ్జక్టు స్పెషలైజ్ చేసారు. 1978 జూన్ నెలలో టోకియోలో జరిగిన అంతర్జాతీయ లయనిజం సమావేశానికి హాజరయ్యారు మలేసియాలో పర్యటనచేసి, అక్కడి యూనివర్శిటీ వైద్యశాలల తీరుతెన్నులను అవగాహన చేసుకుని, కౌలాలంపూర్ లయన్‌లేడీస్ సమావేశంలో పాల్గొన్నారు. డాక్టర్ పద్మిని భర్త విశాఖ కింగ్‌జార్జి హాస్పిటలులోని న్యూరాలజీ డిపార్టుమెంటు సర్జను డాక్టర్ చెంగల్‌రాయ్; తండ్రి తమిళనాడు రాష్ట్రంలో రిటైర్డు మెడికల్ సర్వీసెస్ డైరెక్టరు డాక్టర్ కె. పి. సారథి.

డాక్టర్ పద్మిని ఈ మధ్యనే లయన్స్ డిస్ట్రిక్టు 324-సి ఎనిమిదవ రీజియన్‌లోని పధ్నాలుగు లయన్‌లేడీస్ ఆక్సిలియరీ క్లబ్బుల ముఖ్య కార్యకర్తలను సమావేశపరచి 'ఇన్‌స్ట్రక్షనల్ సెమినార్'ను నిర్వహించారు. ఆమె అధ్యక్షతలో విశాఖ సౌత్ లయన్‌లేడీస్ ఆక్సిలియర్ కార్యకర్తలు గణనీయమైన సేవ చేస్తున్నారు. మర్రిపాలెం హరిజన కాలనీలో ఒక ఓపెన్ ఎయిర్ థియేటరును, ఒక గ్రంథాలయ భవనాన్ని నిర్మించారు. పారిశ్రామిక కార్యక్రమాల క్రింద-కాలనీలో 'చెత్తకుండీ'లను ఏర్పాటు చేసారు. ధర్మ నగరం హరిజన కాలనీలో ప్రజారోగ్యం నిమిత్తం వైద్య పరీక్షలు జరిపి, అక్కడి పిల్లలకు పోలియో నిరోధక మందులను, ఇంజక్షనులను యిచ్చారు. అదే కాలనీలో ఒక కుట్టుపని శిక్షణ కాలను నెలకొల్పి. అక్కడి స్త్రీలకు కుట్టు విద్యను నేర్పుతున్నారు. ఆర్థికంగా వెనుకబడిన ఒక అవిటివానికి ఒక కిళ్ళీకొట్టును ప్రదానం చేసి జీవనభృతి కల్పించారు. విద్యారంగంలో బడిపిల్లలకు ఉచిత వేతనాలను కూడా ఏర్పాటుచేసి, సాంస్కృతిక క్రీడా కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. —విలేకరి



# విహా పిల్లలచేత చేయించండి!

మీ ఇంటిముందో, వాకిట్లోనో, చెట్టు కిందో రంగు రంగుల పిట్ట ఎగురుతున్నట్టుగా కనిపించాలంటే, ఈ బొమ్మను మీ పిల్లలచేత చేయించండి. ఇది చెయ్యడం చాలా సులభం. ఇక్కడ కనిపిస్తున్న పక్షి బొమ్మల్ని కాస్త పల్చగావున్న అట్ట మీదికి 'ట్రేస్' చెయ్యమనండి. వాటికి రంగులు వెయ్యమనండి. తర్వాత పిట్ట ఆకారానికి, ('ఔట్‌లైన్' మీద) కత్తిరించమనండి. కత్తిరించడంలో చాలా జాగ్రత్తగా వుండాలి. పిట్టల ఆకారంలో వున్న రెండు బొమ్మల్నీ వెనక్కి నుంచి, (కళ్ళు రెండు పక్కలా కనిపించేట్టుగా పెట్టుకుని) రెండింటినీ ఒకదాని మీద ఒకటి సరిగ్గా వుంచి, జిగురుతో అతకమనండి. తర్వాత రెక్కల్ని కూడా అలాగే కత్తిరించి, రెండింటినీ కలిపి అతికించమనండి. పిట్ట బొమ్మ మీద రెక్కల్ని పెట్టి దారంతో (మధ్యలో) కట్టమనండి. ఆ దారానికే మరొక పొడుగాటి దారాన్ని కలిపి, చెట్టుకొమ్మకో, గుమ్మానికో వేలాడదీస్తే 'పిట్ట' గాలికి ఎగురుతూ వుంటుంది!

వేలాడే దారం ఇక్కడికి రావాలి.

ఇక్కడ మడిచి, రెండు భాగాల్నీ ఒకటిగా అతకాలి.

ఇక్కడ మడిచి, రెండు భాగాల్నీ ఒకటిగా అతకాలి.

ప్రపంచాన్నంతటినీ ఇవాళ ఆకర్షిస్తున్న దేశం ఇరాన్. కారణం అక్కడి రాజకీయ సంక్షోభం. ఇరాన్ రాజు–షా–ఎన్–షా మహమ్మద్ రెజా పహ్లెవి. అందరూ ఆయన్ని 'షా' అని అంటారు. ఆయన ముప్పై సంవత్సరాలకు పైగా ఇరాన్‌ని పరిపాలిస్తున్నాడు. ఇప్పుడు ఆతన్ని 'నెమలి సింహాసనం' మీదనుంచి పడగొట్టడానికి మతాధికారులూ, తీవ్రవాదులు, దేశంలోని నిరుద్యోగ సమస్యతోనూ, లంచగొండితనంతోనూ విసుగెత్తిన యువకులూ గట్టి ప్రయత్నాలు చేస్తున్నారు. ఇరాన్ పెట్రోలియం గనులకి ప్రసిద్ధిగాంచిన దేశం. అందుకే కొన్ని దేశాలు అక్కడి సంక్షోభం గురించి కలవరపడుతున్నాయి.

అయితే మరో ఇరవై ఏళ్ళలో ఆ నూనె గనులు కాస్తా యింకిపోతాయని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. అందుకే 'షా' ఈ లోపల తమ దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చెందేటట్లు చెయ్యాలని కృతనిశ్చయుడయ్యాడు. ప్రాచీన ఇస్లామ్ దేశమైన ఇరాన్‌ని అతను నవనాగరిక దేశం చేయడం మతాధికారులకు నచ్చలేదు. అయితే 'షా' నిరంకుశ ధోరణిలో తెచ్చే అభివృద్ధి పథకాలు ఆయన అభిమానులకు కూడా అసంతృప్తి కలిగించాయి.

అలాగే స్త్రీల ప్రగతికై రాణి ఫారాపహ్లెవి చేస్తున్న సంస్కరణ తొలగించి స్వచ్ఛమైన ఇస్లామ్ రాజ్యాన్ని స్థాపించాలని మతగురువులు ఒత్తిడి తెస్తున్నారు. షా రాజ్యాధికారాన్ని విడిచిపెట్టాలని, ఆయన కుమారుడు రెజాకి పట్టం కట్టాలని మతగురువుల కోరిక.

అల్లర్లు మరీ అధికం కావడంతో షా–తన తరఫున షాపుర్-బక్తియార్‌ని ప్రధానిగా నియమించి కుటుంబంతో సహా కొంతకాలం పాటు విశ్రాంతి తీసుకునేందుకు నిశ్చయించుకున్నాడు.

ఇరాన్ మహారాణి ఫారాపహ్లెవి స్త్రీల అభివృద్ధికై ఎన్నో పథకాలు ప్రవేశపెట్టింది. పరదా తొలగించడం, వారికి సంఘంలో సమాన ప్రతిపత్తి కలిగించడం వంటి స్త్రీ సంక్షేమ పథకాలు సనాతనవాదులలో సంక్షోభం చెలరేపాయి. దాంతో ఆమె దేశం విడిచి మజొర్కా అనే ప్రాంతానికి పారిపోవలసివచ్చింది. ఇటీవల ఇరాన్‌లోని 'తబస్' ప్రాంతంలో సంభవించిన దారుణ భూకంపం తర్వాత ఆమె తిరిగి తన దేశానికి వచ్చింది. ఆ విధంగా ఆమె కూడా ప్రపంచ పరంగా 'వార్తలలో వనిత' అయింది. ఆ సందర్భంగా ఆమెను 'వనిత' పాఠకులకు పరిచయం చేస్తున్నాము:

రెండువేల ఐదువందల సంవత్సరాల ఇరాన్ చరిత్రలో మహారాణిగా పట్టాభిషిక్తురాలైన ప్రథమ వనిత షాహబానో ఫారా పహ్లెవి. 1967 అక్టోబరులో ఇరాన్ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపబడిన ఈ సంఘటన జరిగింది. అయితే అలా కిరీటంతో సింహాసనం మీద కూర్చోవడమన్నది తనకు వ్యక్తిగతంగా లభించిన ఘనత అని ఆమె అనుకోలేదు. అది ఇరాన్ స్త్రీలందరికీ జరుగుతున్న గౌరవంగా ఆమె భావించింది. అందుకు తగ్గట్టుగానే వారి అభ్యున్నతికై పథకాలు రూపొందించింది. అప్పటి ప్రధాని అమొజెగర్ మంత్రివర్గంలో స్త్రీ సంక్షేమ మంత్రిత్వ శాఖ నెలకొల్పింది. పరదా ఛాయన మగ్గుతున్న ఇరాన్ వనితలను దేశ ప్రగతిలో భాగం పంచుకునే విధంగా ముందుకు నడిపించడానికి ప్రయత్నించింది.

అయితే ఆమె ప్రయత్నాలకు ఫలితం కనిపిస్తున్న తరుణంలో ప్రజల ఒత్తిడిపై షా–అమొజెగర్‌ని పదవీచ్యుతుని చేయడం, స్త్రీ సంక్షేమ శాఖకు బదులుగా ఆ స్థానంలో మత కార్యక్రమాలకై ప్రత్యేక మంత్రిత్వశాఖ ఏర్పరచడం జరిగాయి. దరిమిలా ఈ సంఘటనవల్లే ఆమె దేశం విడిచి విదేశంలో తల దాచుకోవాల్సిన పరిస్థితి కూడా ఏర్పడింది.

ఫారా-షా మూడవ భార్య. 1939లో షా ఈజిప్ట్ యువరాణి ఫాజియాని వివాహమాడాడు. కాని ఆమెకి 1948లో అతను విడాకులు యిచ్చాడు. రెండేళ్ళ తర్వాత సురయా అనే అందగత్తెను వివాహం చేసుకున్నాడు. వారిద్దరిదీ అపూర్వమైన ప్రేమగా అప్పట్లో పత్రికలు వర్ణించాయి. కాని పిల్లలు పుట్టకపోయేసరికి వారసుడు లేక సింహాసనం ఏమవుతుందోననే బెంగతో షా సురయాకు విడాకులు యిచ్చాడు. ఆ తరువాత అతను ఫారాను పరిణయమాడాడు. పద్దెనిమిదేళ్ళ వివాహ జీవితంలో ఫారా అతనితోబాటే ఇరాన్ రాజకీయాలలో చురుకుగా పాల్గొంటూ చేదోడువాదోడుగా వుంటోంది. వారికి నలుగురు పిల్లలు.

షాతో తన వివాహం గురించి ముచ్చటిస్తూ– "వివాహం అయిన తొలి రోజుల్లోనే స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలకు పరిష్కార మార్గం వెతకాలని నాకు అనిపించింది. నా జీవితం ఎంత క్లిష్టతర మవుతుందో ఆనాడే వూహించాను. నేను ఇరాన్ రాణి కాక ముందు ఎవరో అనామకురాలి. హాయిగా వీధులలో తిరగడం, సాధారణ ప్రజానీకంతో కలసిపోవడం, చుట్టూ రక్షక భటులు లేకుండా వుండడం సాధ్యపడుతుందా ఇప్పుడు ?–నేనేమైనా కోల్పోయానూ అంటే ఆ స్వేచ్ఛనే....నిజానికి అప్పుడప్పుడు అనిపిస్తూ వుంటుంది నాకు 'నిజమైన నేనంటే అదేనేమో' అని." అంటారు ఫారా.

ఫారా తను నెరవేర్చే ప్రజా కార్యక్రమాలలో చాలావరకు తన భర్తతో చర్చించి అతని అనుమతితోనే నిర్వహించేది. కొన్ని నిర్ణయాలు మాత్రం తనంతటతానే తీసుకుంటూ వారానికి ఒకసారి ప్రధానితోనూ మంత్రిత్వశాఖతోనూ సంప్రతింపులు జరిపేది.

"ఆర్థిక, పారిశ్రామిక అభివృద్ధి, ప్రతి పౌరుడికీ కనీస జీవన ప్రమాణం లభించేటట్లు చూడడం ప్రభుత్వ కర్తవ్యం. కాని సంస్కృతి, సంప్రదాయాలు కూడా ముఖ్యం. అందుకే అభివృద్ధి పథకాలతోబాటు వాటికీ విలువ యివ్వాలి. అయితే నేటి ప్రపంచ పరిస్థితులు మారిపోయాయి. వివిధ నాగరికతలతో విరాజిల్లుతున్న దేశాలన్నీ కూడా తమ తమ విధానాలను యితరులతో పంచుకోవడం మంచిది. ఆ విధంగా చేయడంవల్ల ఎన్నో నూతన విషయాలను తెలుసుకోవడానికి అవకాశం ఏర్పడుతుంది. పాశ్చాత్య దేశాలనుంచి పారిశ్రామికాభివృద్ధి మనం నేర్చుకుంటే వారు మనవద్దనుండి ఆధ్యాత్మిక చింతన గురించి తెలుసుకుంటున్నారు. ఇలా చేయడం వల్ల యిరువురికీ లాభదాయకమే కదా" – అని

# ఇరాన్ మహారాణి ఫారా పహ్లెవి



అభిప్రాయపడతారు ఫారా.

ఇరాన్‌లో నేడు స్త్రీల జీవితంలో ఎన్నో మార్పులు సంభవించాయి. ముఖ్యంగా గత పదమూడు సంవత్సరాలలో ఇరాన్ స్త్రీలు కలలో కూడా తలవని మార్పులు జరిగాయి. అందుకు కారణం -ఫారా అపార కృషి.

ఇరాన్ వనితలకు ఓటు హక్కు, మజ్లిస్ (పార్లమెంట్)కి ఎన్నిక కాబడే హక్కు లభించాయి. బహుభార్యత్వం, విడాకులు, విడాకులు పొందిన వారిలో పిల్లల పెంపకంపై ఎవరు బాధ్యత వహించాలి వంటి పలు సమస్యలు పరిష్కరింపబడ్డాయి.

గత సంవత్సరం ప్రారంభంలో మనదేశానికి చెందిన ఒక విలేకరి ఇరాన్ రాణిని కలుసుకుని "మీరు మీ కుటుంబం గురించి, మీ గురించి, మీ దేశం గురించి కంటున్న కలల గురించి చెబుతారా?" అని ప్రశ్నించాడు.

"మా దేశం ఆర్థికంగానూ; పారిశ్రామికంగానూ, సాంస్కృతికంగానూ కూడా అభివృద్ధి సాధిస్తుందని ఆశిస్తున్నాను. అయితే ఈ అభివృద్ధి ప్రకృతిని, మానవుడిని ధ్వంసం చేసేది కాకూడదనీ, మా ప్రజలు సంతోష సంరంభాలతో తులతూగాలని, ప్రపంచమంతటా శాంతి నెలకొనాలని ఆశిస్తున్నాను. ఇక నా పిల్లల గురించి - వారు ఆయురారోగ్యాలతో వుండాలనీ, బాధ్యత తెలిసిన పిల్లలుగా పెరగాలనీ, వారి కాళ్ళ మీద వారు నిలబడగలగాలనీ, తమ భావాలకు సరిపోయే వారిని వివాహమాడి ఆనంద దాయకంగా వుండాలనీ, దేశంపట్ల బాధ్యతతో ప్రవర్తించాలనీ కోరుకుంటున్నాను" అని సమాధానం చెప్పారు ఫారా పహ్లెవి.

తారుమారైన తమ దేశ పరిస్థితులు ఆమెలో ఎటువంటి ప్రభావాన్ని కలిగించాయో చెప్పలేము కానీ – ఇస్లాము మతంలోని ఒక సామెతను ప్రస్తావిస్తూ ఆమె ఒకానొక సందర్భంలో ఈవిధంగా అన్నారు

"వెలుగు ఎప్పుడూ చీకటి మీద విజయాన్ని సాధిస్తూనే వుంటుంది." □

# ఆ అందంచిందే వాలుకళ్ళు




మిలమిలలాడే, సొగసులు చిందే ముగ్ధమనోహరమైన ఆ కళ్ళు. మీ కళ్ళనూ అంత అందంగా తీర్చిదిద్దుకోవచ్చు. ఎలాగంటే

**శింగార్ డీలక్స్ కాటుక (కాజల్) అందించే సహజమైన రూపంతో**

ఈ కాటుకను కళ్ళలోపల, పైరెప్పకూ, కింది రెప్పకూ, కనుకొలకులలో రాసుకుని చూడండి. దీనితో మీ కళ్ళలో తొణికిసలాడతాయి లక్షలాది భావాలు, భాషలు.

మరొక మాట! శింగార్ డీలక్స్ కాటుక శుద్ధమైన మూల పదార్థాలతో తయారుచేయబడింది. ఆరోగ్యమైన తీరులో ప్యాక్ చేయబడుతుంది.

## శింగార్
డీలక్స్ కాటుక
(కాజల్)

**మీ కళ్ళకు మేలైనది, అందంగా తీర్చిదిద్దుకునేందుకు సాటిలేనిది.**

everest/78/SH/326 t

ఇందుకు ప్లెయిన్ డిజైన్ వేయాలి. అంటేరైట్ సైడంతా నిట్ రాంగ్ సైడ్ అంతా పర్ల్ అన్న మాట. బార్డర్ మాత్రం ఒక రింగు నిట్ ఒక రింగ్ పర్ల్ చొప్పున వేయాలి రెండు వైపులా. బార్డర్‌కు 12 గాని 13 నంబరు సూదులు గాని వాడాలి. బార్డర్ తర్వాత 10 వ నంబర్ సూదులతో వేయాలి. గుండీ పట్టీలు మెడకు కూడా 12 వ నంబర్ సూది వాడాలి. బ్లౌజ్ పొడవు ఎవరి ఇష్టం వారిది. ప్రస్తుతం పొడవు ఎక్కువగా వుండే బ్లౌజ్ గురించి తెలుసుకుందాం.



నిర్వహణ: మంగళాకందూర్

2 రింగులు చొప్పున 84 రింగుల వరకు ఎక్కిస్తే చేతి పొడవు, వెడల్పు సరిపోతుంది. తర్వాత రెండు వైపులా 5, 3, 1 చొప్పున తగ్గించాలి. తర్వాత ప్రతి లైనుకూ ఒక రింగు చొప్పున 35 రింగులు మిగిలేలా చూడాలి. రెండవ చెయ్యి కూడా ఇలానే అల్లుకొని బాడీకి అతికించాలి.

12 వ నంబరు సూదితో 1 నిట్ 1 పర్ల్ చొప్పున బార్డర్ కావలసినంత పొడవు వేసుకోవాలి. బార్డర్‌కు 12 రింగులు కావాలి. ఈ బార్డర్ కాస్త లాగుతూ అతకాలి. లేకపోతే వదులుగా వుండి వ్రేలాడినట్టుగా వుంటుంది. బటన్‌కు హోల్స్ కూడా ఇప్పుడే పెట్టుకోవాలి కావలసినన్ని. ఈపని అయిన తర్వాత ప్రక్కలు అతకాలి. నాజూకుగా చేసేవారయితే ఈ అతికేపని చేతితో చేయవచ్చు. లేకపోతే మిషన్ మీద వేయవచ్చు. కాని జాగ్రత్తగా వేయాలి కుట్లు. ఫోటోలో బ్లౌజ్ చూడండి. అది మిషన్ మీద వేసిందే. వారి వారికి తగ్గట్టుగా లావు, పొడవునుబట్టి రింగులు హెచ్చు తగ్గులుగా వేసుకోవచ్చు. కావలసిన వాళ్ళు దీని మీద పూలు అల్లే చేతి సూదితో (ఎంబ్రాయిడరీలాగ) డిజైనులు కుట్టుకోవచ్చును.





# 'వి'నెక్ బ్లౌజ్

34 సైజుకు సరిపడ కొలతలు యివి. ముందు వైపు రెండు భాగాలుగా అల్లుకోవాలి. మెడ, పట్టీలు తర్వాత అల్లుకొని కలపాలి. 40 రింగులతో ప్రారంభించాలి. ఒక్కొక్క భాగం 40 లైనులు బార్డర్ అల్లి, వెంటనే 3 రింగులు అక్కడక్కడ ఒకటి చొప్పున ఎక్కించాలి. సూదుల నంబరు మార్చండి. తర్వాత 55 రింగుల వరకూ ప్రతి 7వ రౌండ్‌కు ఒకటి చొప్పున ఎక్కించాలి. ఇప్పుడు చేతులకు తగ్గించాలి. మొదటి రౌండ్‌లో 5, తర్వాత 3, ఆ తర్వాత 1 చొప్పున తగ్గించాలి. చేతి తగ్గింపు నుంచి 1 అంగుళం పొడవు అల్లిన తర్వాత మెడ తగ్గింపు మొదలెట్టాలి. ప్రతి రౌండ్‌కు ఒక రింగు చొప్పున తగ్గించాలి. భుజమునకుగాను 20 – 25 రింగులు వుంచితే సరిపోతుంది. ఇంకొక భాగం కూడా ఇలానే అల్లుకొని ఈ రెండు ముక్కలు ఓ వైపు వుంచుకోవాలి.

వెనకభాగం 80 రింగులలో మొదలెట్టి బార్డర్ అయిన వెంటనే 6 రింగులు ఎక్కించాలి. తర్వాత ప్రతి 7 వ రౌండ్‌కూ 2 రింగులు చొప్పున ఎక్కిస్తూ 110 రింగులు వచ్చేవరకు వేయాలి. చేతులకుగాను 5, 3, 1 చొప్పున తగ్గించుకొని ముందు భాగం పొడవు చూసుకొని అల్లుకోవాలి; హైనెక్ కాబట్టి మెడకు రింగులు తగ్గించనవసరం లేదు. రెండు భాగాల భుజాలు కలుపుకోవాలి.

ఇక చేతుల అల్లిక మొదలెట్టాలి. దీనికి 46 రింగులు కావాలి. బార్డర్‌కుగాను 40 లైనులు అల్లాలి. (అంటే 20 రౌండ్స్ అన్నమాట) ప్రతి 9 వ రౌండ్‌కూ 2 రింగులు చొప్పున 70 రింగుల వరకూ ఎక్కించాలి. తర్వాత ప్రతి 7 వ రౌండ్‌కు

## వంటలు

# కాలిఫ్లవర్ మసాలా

ఒకే రకం కూరలు చేసుకుంటూ వుంటే అటు శ్రీవారికి, పిల్లలకే కాక మనకీ విసుగ్గానే వుంటుంది. అలా విసుగు కలగకుండా భోజనంలోకి ఆ కూరలతోనే రకరకాలుగా చేసుకుంటే కుటుంబంలోని వారందరి మెప్పు పొందడమే కాకుండా మనకీ తృప్తిగా వుంటుంది. అటువంటి మరో క్రొత్తరకం కూర — కాలిఫ్లవర్ మసాలా.

కావలసిన పదార్థాలు : 1 కాలిఫ్లవర్ (పెద్దది), 4 ఉల్లిపాయలు (ముక్కలుగా చేసుకోవాలి), 4

వర్ణచిత్రం : సత్యకుమార్



టొమాటాలు, ½ కప్పు పెరుగు, తగినంత ఉప్పు, వేయించడానికి కావలసినంత నూనె.

ఇవికాక-6 ఎండు మిరపకాయలు, 1 టీ స్పూను ధనియాలు, ½ టీ స్పూను గరం మసాలాపొడి, 2 ఏలకులు, 4 లవంగాలు, 1 చిన్న పాయ వెల్లుల్లి, చిన్న అల్లం ముక్క, 1 దాల్చిన చెక్క, 1 ఉల్లి పాయ (చిన్నది) - వీటన్నిటిని కలిపి నూరి ముద్దగా చేసుకుని అట్టే పెట్టుకోవాలి.

ముందుగా కాలిఫ్లవర్‌ని శుభ్రంగా కడిగి ముక్కలుగా తరిగి వుంచుకోవాలి. టొమాటాలను మరుగుతున్న నీటిలో వేసి ఉడకబెట్టాలి. అవి వుడికిన తర్వాత తోలు తీసి, ముద్దగా చేసి పెరుగులో కలిపి బాగా కలియబెట్టాలి. ఆ తరువాత ఒక బాణలిలోకి నూనె తీసుకుని ఆ నూనెలో ఉల్లిపాయ ముక్కలు వేయించాలి. వీటికి నూరి వుంచుకున్న మసాలా ముద్ద కలిపి బాగా కలియబెట్టాలి. ఇప్పుడు బాణలిలో వున్న ఆ ఉల్లిముక్కలకి కాలిఫ్లవర్, ఉప్పు చేర్చాలి. రెండు కప్పుల నీరు పోసి మూతపెట్టాలి. కాలిఫ్లవర్ మూడువంతులు ఉడికేంతవరకూ ఆ విధంగానే ఈ మిశ్రమాన్ని స్టవ్ మీద వుంచాలి. అలా వుడికిన తరువాత పెరుగులో కలిపిన టొమాటాలని వీటికి చేర్చాలి. ఈ మిశ్రమం గట్టిపడేంతవరకు కలియ బెట్టి ఆ తరువాత స్టవ్ మీద నుంచి బాణలి దించాలి. ఇలా చేసుకున్న కాలిఫ్లవర్ మసాలా పైన పచ్చి టొమాటాముక్కలు, ఉల్లిపాయ ముక్కలు సన్నగా పొడుగ్గా తరిగి అమర్చితే చూడ ముచ్చటగా వుంటుంది. ఈ కాలిఫ్లవర్ మసాలా భోజనంలోకే కాక చపాతీలలోకి, బ్రెడ్‌లోకి కూడా ఎంతో రుచిగా వుంటుంది.

—శోభారామ్‌జీ



ఉగాది కథల పోటీ

# వనిత

రానున్న ఉగాదికి (ఏప్రిల్ సంచిక) వనిత–"కథల పోటీ" ని నిర్వహిస్తున్నది. ఈ పోటీలో పాత, కొత్త రచయిత్రులందరూ పాల్గొనవచ్చును.

**మొదటి బహుమతి: రూ. 500**
**రెండవ బహుమతి: రూ. 300**
**మూడవ బహుమతి: రూ. 200**

**నిబంధనలు:**

☐ కథాంశం సమకాలీన జీవితానికీ, ముఖ్యంగా స్త్రీల సమస్యలకూ చెందినదై వుండాలి.

☐ కథ తావుసైజు (ఫుల్‌స్కేప్) లో ఎట్టి పరిస్థితిలోనూ పదిహేను పేజీలకు తగ్గకూడదు; ఇరవై పేజీలకు మించకూడదు.

☐ కథతోపాటు–"ఇది నూటికి నూరుపాళ్ళు నా సొంతకథ. దేనికీ అనుకరణ, అనువాదం కాదు. ఇంతవరకూ ఏ పత్రికకూ, మరి దేనికీ పంపలేదు." అన్న హామీ పత్రం రాసి, సంతకం చేసి, జత చెయ్యాలి. ఎన్నిక కాని కథలు తిప్పి పంపడానికి వీలుగా, తగినన్ని స్టాంపులు అతికించిన కవర్లు (తమ చిరునామా కూడా రాసి) కథతో పాటు పంపాలి.

☐ పోటీలో నెగ్గిన మూడు కథలే కాకుండా, తక్కిన వాటిలో నచ్చిన కథలను ప్రచురణకు స్వీకరించే హక్కు 'వనిత' కు వుంటుంది. ఆ విషయం రచయిత్రులకు తెలియబరచడం జరుగుతుంది.

☐ పోటీకి పంపే కథల మీద "ఉగాది కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. కథలు–ఫిబ్రవరి 5వ తేదీలోగా మాకు చేరేలా పంపాలి.

☐ గెలుపొందిన కథలు ఏప్రిల్ 'వనిత' లో ప్రచురింపబడతాయి.

☐ కథల నిర్ణయానికీ, తక్కిన నిబంధనలకూ రచయిత్రులు–పూర్తిగా కట్టుబడి వుండాలి. ఈ పోటీపై ఎలాటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడానికీ ఆస్కారం లేదు.

☐ కథలు సకాలంలో చేరకపోయినా, అసలు అందకపోయినా, ఆ బాధ్యత రచయిత్రులదే.

ఉత్సాహం గల రచయిత్రులందరినీ ఈ పోటీలో పాల్గొనవలసిందిగా వనిత' అర్థిస్తున్నది.

# దెయ్యాలతో రెండేళ్ళు

[భయభ్రాంతులైన వాళ్ళ ఊహా లోక చిత్రాలే దయ్యాలు అని కొందరంటే—కాదు అవి కొందరి జీవితాలలో తారసపడే అనుభవ సత్యాలు అని—మరికొందరు వాదిస్తారు. కానీ నేను మాత్రం ఈ మీమాంసలన్నీ మన కనవసరం, అర్థరహితం అనుకునే దాన్ని నిన్న మొన్నటివరకు. అయితే మా ఆయనకు ఇందులోని సత్యాసత్యాలను తేల్చుకోవాలని ఎంతో తపన. అందుకోసం ఆయన అమూల్యమైన కాలాన్ని, ధనాన్ని, శక్తి సామర్థ్యాలను వెచ్చించి వివరాలు సేకరించి పరిశోధనలు సాగిస్తున్నారు. ఆ వివరాలు చూసినప్పుడు నాలో ఒక ఆలోచన తట్టింది. అందులోని ఉత్సాహ పూరితమైన సంఘటనలను మావారి వివరణలతో వ్యాసం రాయడమే అది. ఆ ఆలోచన పర్యవసానమే— "దయ్యాలతో రెండేళ్ళు" అన్న ఈ వ్యాసం.]

—పుష్పా అశోక్‌కుమార్

మా ఆయన నోట్ :

దయ్యాలను చూశాను అని చెప్పే శ్రీమతి చంద్రమతిని కలుసుకుని కొన్ని వివరాలు సేకరిద్దామని నా మిత్రుని తోడుచేసుకుని బయలుదేరాను. నేనొక దినపత్రికలో ఉపసంపాదకుడిగా ఉద్యోగం చేస్తూండడంవల్ల - ఆమెతో పరిచయం అట్టే కష్టమనిపించలేదు. శ్రీమతి చంద్రమతి తన అనుభవాలను క్రింది విధంగా వివరించింది.

తొంగి చూసిన నల్లటి ముఖం

సుమారు పదిహేను సంవత్సరాల క్రితం. ఆ పట్టణంలోని కలెక్టర్ కార్యాలయానికి సమీపంలో మేము కాపురం వుండేవాళ్ళం. మా యింటి చుట్టూ పెద్ద ప్రహరీ గోడ వుండేది. ఆ ప్రహరీకి లోపల మా యింటితోపాటు ఇంకా కొన్ని యిళ్ళు-వరుసకు ఎనిమిదేసి ప్రకారం వరుసలు వరుసలుగానూ, కొన్ని అడ్డదిడ్డంగానూ వుండేవి.

ఆ కాంపౌండ్‌కు ఆనుకుని ఒక బట్టబయలు మైదానం. అక్కడక్కడ పొడి పొడి చెట్లు - ఒక మొండి గోడ వుండేవి. అదేకాకుండా అందులో అస్తవ్యస్తంగా కట్టబడిన ఒక పబ్లిక్ లేవటరీ వుండేది. ఆ మైదానానికి ఫర్లాంగు దూరంలో— ఆ రోజుల్లో ఒక శ్మశానం వుండేది.

మా కాంపౌండ్‌కు పక్కనే మరో కాంపౌండ్. ఈ రెండు కాంపౌండ్లకు మధ్య కొద్ది దూరంలో ఒక మంచినీళ్ళ బావి. మేము రోజూ తాగడానికి ఆ బావినుంచే మంచినీళ్ళు తెచ్చుకునేవాళ్ళం.

పొద్దు గూకిన తర్వాత నీళ్ల తేవడానికి అక్కడికి ఎవ్వరూ వెళ్లరు. మరీ నీళ్ల కొరత కలిగి-పోవలసిన నిర్బంధం యేర్పడితే - ఒక్కరుగా వెళ్ళకుండా ఇంకొకరినెవరినైనా తోడు చేసుకుని వెళ్ళడం అలవాటు.

ఆ రోజు....మా మాటగా నేనూ, మా పక్కింటావిడ నీళ్ల తేవడానికి వెళ్లాము. మామూలుగా మేము తాగే నీళ్ల కడవలలో వుంచడమే అలవాటు. ఆ రోజు కూడా నీళ్ళ కోసం మట్టి కడవనే చంకనెత్తుకుని బయలుదేరాను.

బావి దగ్గరికి చేరిన తర్వాత - "నేను మొదట నీళ్ల చేదుకుని ఇంట్లో పోసి ఒక్కక్షణంలో తిరిగి వస్తాను. ఇంతలో నువ్వు నీళ్ల తోడుకో. ఇద్దరం కలిసే వెళ్దాం" అంది పక్కింటావిడ. 'సరే' అన్నాను.

నేను నీళ్ల చేదుతూ వున్నాను. పూర్తిగా చీకటి కాలేదు. మసక మసకగా వుంది. నా వెనక వున్న ఖాళీ మైదానం నుంచి ఒక వింత శబ్దం వినబడింది. జాగ్రత్తగా విన్నాను. ఎవరో ఈల వేసినట్టు ఊహించాను.

"రౌడీ వెధవలు. ఆడది కంటపడితే చాలు...." అనుకుంటూ నీళ్ల చేదడంలో నిమగ్నమయ్యాను.

మళ్ళీ అదే విధమైన ధ్వని. అయితే మునుపటికన్నా వేగంగా దగ్గరలోనే కొంచెం బిగ్గరగా వినబడింది శబ్దం. 'దుర్మార్గపు వెధవ' అని మనసులో గొణుక్కుంటూ కడవను నడుము మీదికి ఎత్తుకుని కోపంతో వేగంగా ఇటు తిరిగాను.

మరుక్షణంలో నేను చూసిన దృశ్యం!! 'అమ్మా' అని గావుకేక వేశాను.

కడుపులోని భారం వున్నట్టుండి జారిపోయింది. ఏడు నెలలుగా నేను మోసిన గర్భం....నేలంతా ఒకే రక్తం!

అక్కడ....

కందెనకన్నా నల్లగా చుట్టలు చుట్టలుగా నల్లటి వెంట్రుకలు. బాతుగుడ్లులాంటి రెండు పెద్ద పెద్ద కళ్లు. ఒత్తుగా....మధ్య ఖాళీ లేకుండా కలుసుకుని వున్న లావుపాటి కనుబొమలు.

ముందుకు వంగినట్టుగా పొడవుగా వున్న దేగ ముక్కు.

పాలలా తెల్లగా వుండే పెద్ద పెద్ద పళ్లు. పెద్ద పెద్ద గుమ్మడికాయల్ని రెంటిని చేరిస్తే వున్న సైజులో పెద్ద తల!

కొడవళ్ళలా భయంకరమైన మీసాలు. సుమారు ఒకటిన్నర అంగుళాల చేతివేళ్ళ గోళ్లు!

ఎరుపూ నలుపూ కలిసినట్టున్న ఒక రకమైన రంగుతో సగం సగం కట్టబడివున్న ఆ లేవటరీ వెనకనుంచి ఆ ఆకారం ఒక చేత్తో గోడను పట్టుకుని తొంగి చూసింది....తల, చెయ్యి మాత్రం కనబడిన ఆ భీకరాకారం —నేను చూస్తుండగానే అదృశ్యమై పోయింది.

మా ఆయన నోట్ :

శ్రీమతి చంద్రమతి ఈ సంఘటన నాతో వివరించినపుడు - ఆమె శరీరం గగుర్పొడిచింది. కానీ నాలో మాత్రం ఎలాంటి భావావేశమూ యేర్పడలేదు. వాళ్లు-చెప్పిన విషయాలను నేను నమ్మానా? లేదా? అన్న విషయం పసిగట్టడానికి ఎంతో ప్రయత్నించారు. కాని విఫలులయ్యారు. నాకు మాత్రం ఇదంతా జరిగి వుంటుందా? అన్నది సందేహమే. గర్భం జారిపోయిందని విన్నప్పుడు మాత్రం నాలో ఒక విధమైన బాధ యేర్పడింది.

నేను 'వట్టి భ్రమ' అన్నాను. వెంటనే



— పుష్పా అశోక్‌కుమార్

చంద్రమతి చాలా కోపంతో "నేనే నా కళ్ళతో చూశానండి. పుట్టబోయే బిడ్డను కూడా పోగొట్టుకున్నాను." అంది. కాస్సేపు ఆగి "ఇంతేకాదు. ఇలాంటి సంఘటనలు ఆ యింట్లోనే ఇంకా ఎన్నో జరిగాయి." అంది. వెంటనే నేను "దీన్ని చూసిన తర్వాత మీలో భయం యేర్పడి కూడా ఆ ఇల్లు ఖాళీ చేయలేకపోయారా?" అన్నాను. దీనికి ఆమె చెప్పిన సమాధానం నన్ను ఆశ్చర్యపరచింది. "అలాగే వుండీ.... వుండీ.... అలవాటయిపోయిందండి" అంది. "ఇంకా ఏవేవో జరిగాయన్నరు కదా? అవి కూడా చెప్పండి విందాం." అన్నాను ఉత్సాహం కనబరుస్తూ. ఆమె చెప్పడం ప్రారంభించింది.

కొయ్య చెప్పులు....వింత ధ్వనులు

పై సంఘటన జరిగిన పద్దెనిమిది రోజుల తర్వాత ఇలాంటి అనుభవమే మరొకటి యేర్పడింది.

రాత్రి ఎనిమిదిదాటి వుంటుంది. హాల్లో హరికెన్ లాంతర్ వద్ద కూర్చుని, "ఏదో పుస్తకం" చదువుకుంటున్నాను. అప్పుడు నా చూపు నాకు తెలియకుండానే వంటగది వైపు పయనించింది. వంటగది నుంచి నా గదివరకు ఒక పొడవైన నీడ.... కళ్ళు నలుపుకుని మళ్ళీ నిదానంగా చూశాను. ఆ నీడలో ఎలాంటి చలనమూ లేదు. అది నా నీడే అనుకుని నవల చదవడానికి ఉపక్రమించాను.

కాస్సేపటికి నా ఎడమవైపు నుంచి ఏవేవో గుసగుసలు వినిపించాయి. ఆ పొడుగాటి నీడ ఇప్పుడు తన చేతుల్ని నడుము మీద వుంచుకున్నట్టుగా కనబడింది. ఆ తర్వాత అది అడ్డదిడ్డంగా తిరుగుతూ కనబడింది.

నాకు గుండె ఆగినంతపనయింది. రాను రాను నీడ పొడవు తగ్గిపోయింది. లావైన కొయ్య చెప్పులు వేసుకుని నా వైపు వచ్చేట్టుగా చప్పుడు వినబడింది.

ప్రక్కన్నే వున్న దుప్పటి తీసుకుని తల నుంచి కాళ్ళవరకు కప్పుకున్నాను. కళ్లు మూసుకుని అందరు దేవుళ్ళనీ ఒక్కసారిగా వేడుకున్నాను.

అలా పది నిమిషాలు గడిచాయి. గుసగుసలు గాని మరెలాంటి శబ్దంగాని వినబడలేదు. ముసుగు తీసి చూశాను. ఏ నీడా కనబడలేదు. నిశ్శబ్దంగా వుంది గది. భయం భయంగా లేచి పక్కింటికి పరుగుతీశాను. మా ఆయన వచ్చిన తర్వాతే మా యింట్లో అడుగుపెట్టాను.

మా ఆయన నోట్

దీనిని కూడా నేను నమ్మలేదు. "ఏదో చిత్తభ్రమ అయివుంటుంది. లేదా....దూలం మీదో, దండెం మీదో మీరు వేసిన బట్టల నీడ కావచ్చు" అన్నాను.

"నేనేమీ బట్టలు వేయలేదండి. అలాగే వేశాననుకోండి. అవి కొయ్య చెప్పులు తొడుక్కుని నా దగ్గరికి వచ్చి మాట్లాడుతాయటండీ-" అని నన్ను తిరుగు ప్రశ్న వేసింది. నేనేమీ బదులు చెప్పలేదు. ఆమె మరో సంఘటన వివరించడానికి పూనుకుంది.

విచిత్రమైన పాము—పిల్లి

పై సంఘటన జరిగి పది రోజులు అయి వుంటుంది. ఓ రోజు రాత్రి....పొయ్యివైపు తల పెట్టి పడుకున్నాను. రాత్రి ఒంటిగంట అయి వుంటుంది. తల దగ్గర సామానులేవో దొర్లే శబ్దం. ఉలిక్కిపడి లేచాను.

లోపలికి పైన పొగగొట్టం వుంది. దాని ద్వారానే దూరింది ఒక వింత ఆకారం. దాని కళ్ళల్లో చెప్పలేనంత కాఠిన్యం. తల మాత్రం పిల్లి తల కాని శరీరం పెద్ద పాములా కనబడింది. అటువంటి విచిత్రమైన ప్రాణిని నా జీవితంలో మొట్టమొదట చూశాను.

ఒక్క క్షణంలో దూకినట్టుగా లేచి నిలబడ్డాను. ఆ భీకరాకారం నన్ను ఉరిమిచూసి, వచ్చిన గొట్టం గుండానే వెళ్ళిపోయింది.

వెంటనే మా ఆయన నిద్రలేచి "ఏమిటలా చూస్తున్నావు బిక్కమొహం పెట్టి" అని అడిగారు.

జరిగిన విషయం వివరించాను. "సరి సరి; భయపడొద్దు. అంతా రేప్పొద్దున చూసుకుందాం. పడుకో" అంటూ మళ్ళీ నిద్రలో మునిగిపోయారు. ఇక నా పని అంటారా—ఆ రాత్రంతా శివరాత్రే!

మా ఆయన నోట్ :

నేను "కల అయివుండొచ్చుకదా?" అన్నాను. పాత్రలు దొర్లి చెల్లాచెదురు కావడం అది కల కాదనడానికి రుజువు" అందామె. "సరే, తర్వాత అనుభవం చెప్పండి" అన్నాను. చంద్రమతి మరో సంఘటన గురించి చెప్పడానికి ఉపక్రమించింది.

మనిషి ఎత్తు భయంకరమైన పిల్లి

ఈ సంఘటన జరిగి ఆరు రోజులు వెళ్ళాయి. అదే పొయ్యిమీద ఒక బూడిదరంగు పిల్లి మనిషి కన్నా ఎత్తుగా భీకరాకారంతో కూర్చుని వుంది.

నేను దానిని చూడ్డానికి కారణం ఒక చెడ్డ కల. కలగన్న తర్వాత కళ్ళు తెరవగానే ఎదురుగా కూర్చుని వుందా భీకరాకారం; కాని అది నేను చూస్తుండగానే కొద్ది కొద్దిగా నా చూపు నుంచి దూరమైపోయింది.

మా ఆయన నోట్ :

దీనిని విన్న తర్వాత నేను ఆమెతో "దయ్యాలు భూతాలు అనేవన్నీ నల్లటి భీకరాకారంతో వుంటాయనే ఇంతవరకు విని వున్నాను. పిల్లిలా, పాములా వచ్చిందని వినడం మాత్రం మీ నోటిగుండానే" అన్నాను కాస్తా పరిహాస ధోరణిలో. అందుకామె—"దయ్యం ఎలాంటి రూపమైనా ఎత్తగలదు సార్" అంది.

"సరే, సరి ఇంకా ఏమైనా చూశారా?" అని అడిగాను.

వెంటనే ఆమె "చూశానండి. కానీ అవన్నీ ఏకరువు పెట్టడం వల్ల ఏం ప్రయోజనం చెప్పండి. మీరేమో ఏం చెప్పినా నమ్మడం లేదు; అంది ఆమె అదే స్వరంతో. కానీ నేను "మీరు వివరించే వాటిని వినడం వల్ల నాలో మార్పు కలిగి నాకూ నమ్మకం ఏర్పడవచ్చు కదండీ" అన్నాను. దాంతో ఆమె కొంచెం ఉత్సాహం తెచ్చుకుని మరో సంఘటన చెప్పడానికి ప్రారంభించింది. □

# పెరటితోట పెంపకం



—లలితకుమారి

చాలామంది నాకు రాసే వుత్తరాల్లో-"మా ఇంట్లో ఫలాన చెట్టు వుంది. నాటి ఇన్ని సంవత్సరాలైంది. కాని ఇంతవరకు పువ్వు గాని, కాయ గాని రాలేదు. చెట్టు ఎండిపోతూంది" అని రాస్తూ వుంటారు. నిజానికి వాళ్ళందరూ చేస్తున్న పొరపాటు ఒక్కటే.

మనిషికి ఆహారం ఎంత ముఖ్యమో, చెట్టుకి ఎరువు అంత ముఖ్యం. సరైన పోషకాహారం లేకపోతే మనిషి ఎలా కృశించిపోతాడో-చక్కటి ఎరువు లేకపోతే చెట్టు కూడా అంతే.

సాధారణంగా మనం ఇళ్ళల్లో-రోజ్, క్రోటన్, తీగజాతి చెట్లు .... మల్లి, నైట్‌క్వీన్; సూర్యకాంతి, బంతి, గినియా వంటి సీజనల్స్, ఫల వృక్షాలు నాటుతాము. వీటికి ఏ ఏ పాళ్ళలో ఎరువులు వేసుకుంటే బాగా పెరుగుతాయో తెలుసుకుందాం.

రోజా చెట్లకి :

**బాగా మగ్గిన గుర్రపు పెంటగానీ, పశుపెంటగానీ-6 పాళ్ళు. ఎర్రమన్ను (కాలవయిసుక) మెత్తనిది-4 పాళ్ళు, ఇసుక-3 పాళ్ళు, చెత్త ఎరువు-2 పాళ్ళు.**

అయితే గుర్రపుపెంట ఎరువుగా వాడేటప్పుడు ఒక జాగ్రత్త తీసుకోవాలి. గుర్రపుపెంట చాలా వేడి. ఆ వేడిని చంపడానికి గోయి తీసి దాన్ని అందులో వేసి ఆరంగుళాల దళసరిన మట్టితో కప్పాలి. చెయ్యిపెట్టి చూస్తే వేడి తగలకూడదు. పొడిగా అవ్వాలి. అప్పుడే ఇది ఎరువుగా వుపయోగించడానికి అనువుగా వుంటుందన్న మాట.

క్రోటన్లకి :

**ఎర్రమన్ను (కాలవ యిసుక)-4 పాళ్ళు (పెద్ద కణాలు శ్రేష్ఠం) బాగా మగ్గిన ఎరువు-4 పాళ్ళు చెత్త ఎరువు-2 పాళ్ళు.**

వీటితోపాటు పాత సున్నం కొంత వేస్తే-ఆకుకి చక్కటి రంగు వచ్చి కళకళలాడుతూ వుంటుంది.

సీజనల్స్ :

**ఆయా సీజన్స్‌లో మాత్రమే పూసే-బంతి, గినియా, బాల్సన్ (నీళ్ళ గోరింట) సూర్యకాంతి మొదలైనవి.**

**బాగా మగ్గిన ఎరువు-3 పాళ్ళు; ఎర్రమన్ను-1 పాలు; కాలవ ఇసుక-1½ పాళ్ళు.**

తీగజాతి చెట్లకి :

**ఎర్రమన్ను-5 పాళ్ళు; బాగా మగ్గిన ఎరువు-4 పాళ్ళు; కాలవ యిసుక-4 పాళ్ళు; చెత్త ఎరువు-2 పాళ్ళు.**

పళ్ళ చెట్లకి :

**ఎర్రమన్ను-4 పాళ్ళు; కాలవ యిసుక (పెద్ద కణువులై వుండాలి)-2 పాళ్ళు; బాగా మగ్గిన గుర్రపు పెంట-1 పాలు; గొర్రె పెంట-1 పాలు.**

వీటికి కోడి ఎరువు కూడా వేయవచ్చును. కాని యిది చాలా ఘాటైనది కాబట్టి తతిమ్మా ఎరువుతో కలిపి వేస్తే మంచిది.

వేటి వేటికి ఎరువులు ఏ ఏ పాళ్ళలో వెయ్యాలో తెలుసుకున్నారు కాబట్టి యిప్పుడు విత్తనం నాటే విధానం గురించి కూడా చెబుతాను. సాధారణంగా చాలా మంది వేళ్ళతో నేలని గోకినట్లు తవ్వి విత్తనాలు చల్లి మట్టి కప్పేస్తారు. ఆ తరువాత చెట్లు పెరగలేదనో, అసలు రాలేదనో బాధపడితే ఏం లాభం?

విత్తనాలు నాటేటప్పుడు శుభ్రంగా నేలని ఆరంగుళాల (6") లోతు ఒకటిన్నర (1½') అడుగు వెడల్పు తవ్వాలి. అందులో 3 పాళ్ళు చెత్త ఎరువు, 2 పాళ్ళు పాత ఎరువు (కుండల్లో పెంచే మొక్కలకి వేసివుంచిన పాత ఎరువు) 1½ పాళ్ళు యిసుక, వంటింట్లో వుపయోగించిన కట్టెలనుండి వచ్చే బొగ్గు పొడి ½ పాలు వెయ్యాలి. విత్తనాలు నాటేటప్పుడు కొత్త ఎరువువేసే ముందు పాత ఎరువు వెయ్యాలి. అందుకే కుండీల్లో వేసివుంచిన ఎరువు వాడమంటున్నది. ఆ విధంగా చేసినట్లయితే మొక్కలు ఏపుగా ఎదుగుతాయి. పచ్చగా కళకళలాడుతూ చెట్లు మనస్సుకి ఎంతో ఆహ్లాదాన్ని కలుగజేస్తాయి.

---

కూరలు—పోషకపదార్థాలు :

క్యాబేజి పువ్వు :

**ఇది మూర ఎత్తువరకు పెరుగుతుంది. క్యాబేజీ ఆకులు తెలుపు ఆకుపచ్చరంగు కలిసినట్లుగా దొంతర దొంతరలుగా వుంటాయి. క్యాబేజీ పువ్వు గట్టిగా వుంటుంది. బాగా పూసిన క్యాబేజీ పువ్వు గుమ్మడికాయంత వుంటుంది. క్యాబేజీలో మూడు రకాలు వున్నాయి. పుష్పగోభి, పత్రగోభి, గ్రంధిగోభి. మనం కూరకు నిత్యం వుపయోగించేది పుష్పగోభి. దీన్నే ఆంగ్లంలో క్యాబేజీ అంటారు.**

**ప్రతి 100 గ్రాముల క్యాబేజీ పువ్వులోనూ-90.2 గ్రాముల తేమ, 1.8 గ్రా. ప్రొటీన్లు, 0.1 గ్రా. క్రొవ్వుపదార్థం, 0.6 గ్రా. ఖనిజ పదార్థం, 1.0 గ్రా. నార, 6.3 గ్రా. పిండి పదార్థం, 0.03 గ్రా. కాల్షియం, 0.05 గ్రా. భాస్వరం, 0.8 గ్రా. ఇనుము, 2,000 యూనిట్ల విటమిన్ ఏ, 0.06 మిల్లి గ్రాముల విటమిను బి, 0.4 మి. గ్రా. నికోటినిక్ ఆమ్లము, 0.12 మి. గ్రా. రిబోఫ్లోవిన్, 124 మి. గ్రా. విటమిన్ సి, 12.0 మి. గ్రా. ఆక్సాలిక్ ఆమ్లమూ వుంటాయి. వీటి కెలోరీ విలువ-33.**



**క్యాబేజీ-కూరకు ఉపయోగపడే పువ్వు. శనగపప్పు, కొబ్బరితో కలిపి కూరగా చేసుకుంటే రుచిగా వుంటుంది. కొందరు క్యాబేజీ టమోటా కలిపి సూప్ (చారు) కూడా చేసుకుంటారు. క్యాబేజీతో చేసిన వడలు కూడా రుచిగా వుంటాయి.**

**క్యాబేజీ మేహకాంతి చేస్తుంది. మూత్రాన్ని జారీ చేయును పైత్యాన్ని హరిస్తుంది. వీర్యాన్ని వృద్ధి చేస్తుంది. బలాన్ని చేకూరుస్తుంది. మలాన్ని బంధిస్తుంది. ఆకలిని హరింపజేస్తుంది. కఫాన్ని అయితే కొంచెం పెంపొందింపజేస్తుంది. క్యాబేజీ ఆకు పెగ్గడ్డలకు కడితే గుణం కలిగిస్తుంది - అని చెబుతోంది ఆయుర్వేదశాస్త్రం.**

# సంస్కృత పాఠమాల (2)

## स्वर व्यञ्जन योगरीति

స్వర వ్యఞ్జన యోగరీతిః (అచ్చులు హల్లులతో కలిసినప్పుడు వ్రాయవలసిన రీతి)

क् + अ = क  क् + आ = का  क् + इ = कि  क् + ई = की  क् + उ = कु

క్ + అ = క  క్ + ఆ = కా  క్ + ఇ = కి  క్ + ఈ = కీ  క్ + ఉ = కు

क् + ऊ = कू  क् + ऋ = कृ  क् + ॠ = कॄ  क् + ॡ = कॢ  क् + ए = के

క్ + ఊ = కూ  క్ + ఋ = కృ  క్ + ౠ = కౄ  క్ + ఌ = కౢ  క్ + ఎ = కె

क् + ऐ = कै  क् + ओ = को  क् + औ = कौ  क् + अं = कं  क् + अः = कः

క్ + ఐ = కై  క్ + ఓ = కో  క్ + ఔ = కౌ  క్ + అం = కం  క్ + అః = కః

## स्वरयुक्त व्यञ्जनानि

స్వరయుక్త వ్యఞ్జనాని (స్వరములతో కలసిన హల్లులు) గుణింతము

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ |
| क | ख | ग | घ | ङ | च | छ | ज | झ | ञ |
| కా | ఖా | గా | ఘా | ఙా | చా | ఛా | జా | ఝా | ఞా |
| का | खा | गा | घा | ङा | चा | छा | जा | झा | ञा |
| కి | ఖి | గి | ఘి | ఙి | చి | ఛి | జి | ఝి | ఞి |
| कि | खि | गि | घि | ङि | चि | छि | जि | झि | ञि |
| కీ | ఖీ | గీ | ఘీ | ఙీ | చీ | ఛీ | జీ | ఝీ | ఞీ |
| की | खी | गी | घी | ङी | ची | छी | जी | झी | ञी |
| కు | ఖు | గు | ఘు | ఙు | చు | ఛు | జు | ఝు | ఞు |
| कु | खु | गु | घु | ङु | चु | छु | जु | झु | ञु |
| కూ | ఖూ | గూ | ఘూ | ఙూ | చూ | ఛూ | జూ | ఝూ | ఞూ |
| कू | खू | गू | घू | ङू | चू | छू | जू | झू | ञू |
| కృ | ఖృ | గృ | ఘృ | ఙృ | చృ | ఛృ | జృ | ఝృ | ఞృ |
| कृ | खृ | गृ | घृ | ङृ | चृ | छृ | जृ | झृ | ञृ |

(మిగిలిన గుణింతములు వచ్చేసారి)

# అసూయ

## శేషారత్నం

అసూయ అంటే ఆడవాళ్లు గుర్తొస్తారు అందరికీ. పూర్వకాలంలో ఎవరో మహానుభావులు అసూయకీ ఆడవాళ్ళకీ ముడి పెట్టేసారు ప్రాస కుదిరింది కదా అని. బహుశా వాళ్ళకి ఆడవాళ్ళ మీద భరించలేని అసూయ వుండివుంటుంది. లేకపోతే అసూయకి ఆడా మగా ఏమిటండీ! ఇందుగలదందులేదను సందేహం లేకుండా లోకంలో మూల మూలలా అసూయే. అసూయ లేని జీవిని చూపించండి.

పసిపిల్లలు మొదలుకొని ప్రపంచ దేశాల వరకు అసూయ లేనివాళ్ళెవరు? ఊహ తెలియని చంటి పిల్లలు కూడా తల్లి వేరెవరి కుర్రాడినైనా ఎత్తుకుందీ అంటే చాలు వాడిని దింపేవరకూ గోల చేస్తారు. దీన్నేమంటారు? ఏదో ఒకటి అనాలి కనుక చుప్పనాతితనం అంటారు. అవ్వపేరే ముసలమ్మ!

అసూయ కూడా చుప్పనాతితనం, ఓర్వలేని తనం, ఆరాటం, ఏడుపు అంటూ రంగులు మారుస్తుంది ఊసరవెల్లిలా.

ప్రక్కవారి బాబ్జీ అంటుంటాడు నాతో "ఐస్ క్రీమ్ తింటే పళ్ళు పుచ్చిపోతాయి కదూ శేషక్కా" అని. బాబ్జీ వాళ్ళమ్మ ఐస్‌క్రీమ్ తిననివ్వదు.

"ఆ లీలగారి మొగుడు రోజూ చావగొడతాట్టగా పెళ్ళాన్ని"—రహస్యంగా ఒక్కొక్కరికీ చెప్పతుంది వెంకటలక్ష్మి. లీల చాలా అందంగా వుంటుంది.

"వాళ్ళబ్బాయి జీతం ఎనిమిది వందలని చెప్పకుంటుందా పార్వతమ్మగారు? అబ్బే! నాల్గువందల చిల్లరట. మావాడు చెప్పాడులెండి మొన్న" అంటుంది-నిరుద్యోగి సుబ్బారావు తల్లి ఆదిలక్ష్మి.

"పోనిద్దూ! మా అమ్మాయి పాసవకపోతే వచ్చిన నష్టం ఏమిటి - అదేమైనా ఉద్యోగాలు చెయ్యాలా? ఊళ్ళేలాలా?"—ఉద్యోగం చేస్తున్న కూతురున్న లక్ష్మణరావుగారితో మెట్రిక్ 30 సార్లు ఫేలయిన కూతురు తండ్రి అంటాడు.

"రెండువందలు పెట్టి చీరేమిటండీ! నేను పొగుడుకోకూడదుగానీ మా పిల్లలలా మిడిసి పడిపోరు. వాళ్ళకా మెరుపుల చీరలు నచ్చవు. అయినా సంసారులమా సానివాళ్ళమా!" — అంటారు ఇస్త్రీ నలగని చీరతో ఆఫీసుకెడుతున్న ఇందిరను చూసి అమ్మలక్కలు.

అసూయ అని తెలియకుండానే అసూయ. ఆటంబాంబ్ తయారీకి కారణం ఏమిటండీ! ప్రపంచ యుద్ధాలకి? పొరుగువాడి దేశం పచ్చగా వుందంటే........ఇరుగు రాజ్యంలో రాజకీయాలు చక్కగా వున్నాయంటే ప్రక్కవాడికి కడుపు మంటా తప్పదు; బాంబుల తయారీ తప్పదు.

అంతెందుకు దేవతలకే తప్పలేదు అసూయ. కథలనండి కాకరకాయలనండి. దేవదానవుల యుద్ధాలకు కారణం? రాక్షసుల భుజబలం చూసి దేవతలకు రగులుకుపోలేదూ! కాలుకదపని దేవతల అమర సౌఖ్యాలు చూసి దానవులకు మండిందంటే మండదూ!

డబ్బున్నవాడి డబ్బు మీద లేనివాడికి అసూయ. లేనివాడి ఆరోగ్యం చూసి డబ్బున్న రోగికి మంట. పెళ్ళయిన వాళ్లేదో సుఖపడిపోతున్నారని కానివాళ్ళ ఆరాటం. పెళ్ళికానివాళ్ళు ఏ జంజాటం లేకుండా టింగురంగామంటూ వున్నారని అయిన వాళ్ళకు దుఃఖం. ఇప్పటితరం అనుభవిస్తున్న స్వేచ్ఛని చూసి ముందుతరం ముసలివాళ్ళకు కడుపులో దేవుతుంది - వాళ్ళని వాళ్ళ పెద్దలలా బ్రతకనీయ లేదని—'మా కాలంలో ఇలా వుందా....' అంటారు.

ప్రక్కవాడి పెళ్ళాం అందంగా వుందంటే ఇవతలి ఇల్లాలికి రోజూ చీవాట్లు తప్పవు. అవతా లావిడకి అపవాదులూ తప్పవు. అందంగా వున్న వాళ్ళంతా పతితలు. చెట్టా పట్టాలేసుకుని పోతున్న జంటనిచూస్తే తన పెళ్ళాం నాగరికంగా లేదే అని బాధ. మరీ నాగరికత ముదిరిపోయి వెర్రి వేషాలేసే సోషల్ భార్యని చూసి సంసార పక్షంగావున్న ఇల్లాలిమీద ఇంటాయన విసుర్లు. పిల్లల్లేని వాళ్ళకి-ఉన్నవాళ్ళకి పున్నామ నరకం తప్పిపోతోందే అని ఆరాటం. పిల్లల్లేని వాళ్ళేదో డబ్బు నిల్వ చేస్తున్నారని ఉన్నవాళ్ళ విరుపులు.

ఇక అవిటివాళ్ళకు సలక్షణంగా వున్న వాళ్ళ మీద అసూయలో వింతలేదు గానీ, వాళ్ళలో వాళ్ళకి పోటీ మళ్ళీ. కళ్ళులేని బిచ్చగాడిమీద కాళ్ళు లేని వాడి కసూయ - వాడికి డబ్బు లెక్కువ రాల్తాయని.

అవతల వాళ్ళ భాగ్యం మనకీ వుంటుంది. కాని అది వాడికూ్కడా ఎందుకుండాలని అఘోరింపు. వెనకటికి మా అమ్మమ్మ అంటూ వుండేది - తనకి లేదని ఏడిస్తే ఒక కన్ను; ఎదుటివాడికుందని ఇంకో కన్నూ పోతాయని.

అసూయకి తన పర భేదం కూడ లేదు.

నేను కట్టుకున్న చీర అందమైనదైనా సరే మా సుజా చీరనెవరైనా మెచ్చుకుంటే నాకు అసూయ మెరమెరలాడుతుంది. మళ్ళీ అదంటే విపరీతమైన యిష్టం.

మా శాస్త్రిగారంటుంటారు "ఇష్టాలన్నీ దాటి పోతే చివరిమెట్టు అసూయదేనని. ఒకడిని అభి

---

## నిజం చెప్పనా?

మాది ఆదర్శ వివాహం!
కులాంతర మొకటే కాదు
మతాంతరం కూడాను
(మా కులం వాళ్ళెవ్వరూ నా కమ్మాయి నివ్వలేదు)
కట్నం లేదు కదా
లాంఛనాలు కూడా లేవు....
(ఇస్తామనడానికైనా వాళ్ల వద్ద ఏగానీ లేదు)
అందం చూసి పెళ్లాడేనంటారేమో
అమ్మాయికి మెల్ల కన్ను
(గుడ్డి కన్న మెల్ల నయం కదా! నాకో కన్నే లేదు)
మాది ఆదర్శ వివాహం!

—భార్గవి

మానిస్తాం. ఇంకా అభిమానిస్తాం. ఇంకా ఇంకా అభిమానిస్తాం. ఇంకా తరువాతేం చేయాలో తెలియక చేసేదే అసూయపడడం. నీకు దేని మీద మక్కువో దానిమీదే అసూయ కలుగుతుంది.'' నిజమేననిపిస్తుంది నాకు. గుర్తుపట్టలేని అసూయ లివి. శ్రీరాముడి మీద రావణుడికున్నదదే.

చిత్రమైన అసూయలు! మా అక్కయ్య ఉదయం పూట చిరచిరలాడుతూంటుంది. ఎందుకు? మా తమ్ముడు 10 గంటలయినా గుర్రుపెట్టి నిద్ర పోతుంటాడు. పిడుగులు పడనీంచి, ప్రపంచ యుద్ధం రానీండి - వది దాటితేగాని శేషపాన్పు దిగడు. ఈలోగా తలుపులు దభీమని బాదేయడం, పిల్లల్ని చావగొట్టడం, గిన్నెలు ఎత్తేయడం అన్ని వాద్య సమ్మేళనాలు మా యింట్లో. దీనికంతటికీ మావాడి నిద్రే కారణం. పోనీ అక్కయ్యకు అంత టైము వరకు నిద్రపడుతుందా అంటే కాదు. అయినా వాడంత సుఖంగా నిద్రపోవడమేం? తమ్ముడంటే అసూయ అనుకునేరు. చచ్చేంత యిష్టం వాడంటే. కాని తనకు రానిది వాడికి వచ్చేది ఆ నిద్ర వుంది చూసారూ - దానిమీద ఆ విరుచుకు పడడం.

నిద్రంటే గుర్తొచ్చింది. పరీక్షల సమయంలో నన్ను చూడాలి. ఇంటిల్లిపాదీ హాయిగా నిద్ర పోతుంటారు. నాకు హోరుమని నిద్ర వచ్చేస్తూ వుంటుంది. కాని నిద్రపోవడానికి వీల్లేనితనం. దిక్కుమాలిన దానిలా చదవాలి. ఎంత ఉక్రోషం వస్తుందో! వాళ్ళందరి నిద్రా చెడగొట్టడానికని ఖయ్యిమని చదువుతూంటాను - మా అమ్మ ఒక్క కేక వేసేవరకూ!

అసూయని ఏం చేయలేక కాంపెన్సేట్ చేస్తుంటామన్న మాట. బస్సులో కూర్చున్న వాడి మీద నిలబడిన వాడు ఒంటికాలి మీద లేస్తాడు ఏమైనా అంటే. ప్రక్క వాళ్ళమీద మంటకొద్దీ పిల్లల్ని బాదేస్తుంటారు కొందరు. ఎదురింటి పిల్లాడి అందమైన బొమ్మ విరిచేసేదాకా తోచదు పిల్లలకి.

వెయ్యి రూపాయల జీతగాడి అంతులేని బాధ్య తని, తక్కువ జీతం వున్న తమ స్వేచ్ఛనీ బేరీజు వేసుకోవలసిందే. పొరుగు రాష్ట్రం వాడికి నదీ జలాలు పోకుండా ఆనకట్టలు కట్టాల్సిందే. అవతలి రాజ్యంలో అరాజకం ప్రబలితేగాని తోచదు పొరుగు దేశానికి. యుద్ధాలు చేసుకుంటూ జన నష్టం చేస్తే గాని తోచదు ప్రపంచానికి. ఏదైనా మోతాదులో వుంటే ఫరవాలేదు మించితేనే ప్రమాదం. □

## కలువ పూల ముగ్గు

ఈ ముగ్గు వెయ్యడానికి ముందు 21 చుక్కలు పెట్టుకోవాలి. తరువాత వరుసలో రెండు రెండు చుక్కలు వదిలి 17, అట్లాగే ప్రతి వరుసలోనూ రెండు రెండు చుక్కలు విడిచి పెడుతూ (13, 11, 9, 7, 5, 3, 1) ఒకటి వరకూ పెట్టుకుని బొమ్మలో చూపిన విధంగా కలుపుకుంటే చక్కని కలువ పువ్వుల ముగ్గు తయారవుతుంది.

—పి. వి. భారతి



వస్తునం అనుకుంటాం గాని—
ఏమర్రా!

ప్రతి చిన్న జబ్బుకి మందులు అవసరం అంటారా! కొద్దిగా జలుబుపడితే మందు; కాస్త దగ్గొస్తే మందు; తలనొప్పి వచ్చినట్టుగా అనుమానం వొస్తే మందు - ఇలా ఇష్టానికి మందులు వేసుకున్న వాళ్ళెంతోమంది వున్నారు. నిజానికి, న్యాయంగా అలాంటి వాటన్నింటికీ వెంట వెంటనే మందులు వాడేయనక్కర్లేదర్రా. వొంటికి కాస్త వేడిచేస్తే దగ్గు రావచ్చు; సద్దుకోగానే దగ్గు తగ్గిపోవచ్చు. అలాగే ఏ కారణంగానైనా తలనొప్పి రావచ్చు. కాస్సేపట్లో దానంతట అదే తగ్గిపోవచ్చు. మరీ తగ్గకుండా, భరించలేకుండా వున్నప్పుడయితేనే మందు వాడాలి. దగ్గు రెండు రోజులపాటు వుండి, కాస్త హెచ్చుతున్నట్టుగా వుందనుకోండి - అలాంటప్పుడు మందు తీసుకోవలసిందే! నే చెప్పేదేమిటంటే - చీటికీ మాటికీ అయినదానికీ కానిదానికీ అదేపనిగా మందులు వాడొద్దని.

కొన్నింటికి మందు అక్కర్లేకుండానే చికిత్సలు వున్నాయి. కొన్నింటిని ప్రకృతే నయం చేస్తుంది. వాటినే ప్రకృతి చికిత్సలు అంటారు. ప్రకృతే ఆ వ్యాధుల్ని నయం చేసేస్తుందన్న మాట. మన పెద్దవాళ్ళు 'లంఖణం పరమౌషధం' అన్నారు. అంటే - ఓరోజు జ్వరం కాసినా, వొంట్లో నలతగా వున్నా, అజీర్ణం చేసినా - 'లంఖణం' చేస్తే - అవి నయమైపోతాయి. అజీర్ణం పొద్దున చేసిందనుకోండి - ఆ రాత్రి ఏమీ తినకుండా వుండడమే ఔషధం గాని, అజీర్ణానికి ఏదో మందు వేసుకుని, మళ్ళీ రాత్రి భోజనం చేయడం మంచి పద్ధతి కాదు.

ప్రకృతి వైద్యం అన్నది - చాలా పురాతనమైనది. మన దేశంలోనే కాకుండా, కొన్ని విదేశాల్లో కూడా ఈ ప్రకృతి వైద్యాన్ని పాటించేవారు. ఇప్పటికీ, పల్లెటూళ్ళలో వున్నవాళ్ళూ, కొండ ప్రాంతాల్లో వుండేవాళ్ళూ ఈ విధానాన్ని పాటిస్తూనే వున్నారు. కాని పట్నాల్లో వుండేవాళ్ళకి మాత్రం - ఇదేదో వెగటుగానూ, వెక్కిరింపుగానూ కనిపిస్తుంది. "కాలు వాపు పెడితే, వేడినీళ్ళతో కాపడం పెడితే తగ్గుతుందా? మాత్రలు వేసుకోవాలిగాని!" అంటారు. నిజానికి అక్కర్లేదు — వేడినీళ్ళ కాపడంతోనే తగ్గిపోవచ్చు.

సూర్యరశ్మిలోనూ, ఆరోగ్యకరమైన ప్రదేశాల్లో వీచే గాలిలోనూ మంచి 'ఔషధాలు' వున్నాయి. ప్రకృతి వైద్యం నీళ్ళతోనూ, మట్టితోనూ కూడా జరుగుతుంది!

# బామ్మగారి పేజీ



పల్లెటూళ్ళలో వుండేవాళ్ళ ఆరోగ్యం పట్టణ వాసుల కంటె ఎందుకు బాగుంటుందంటారు? — అక్కడ రద్దీ, జనం, కల్మషమైన గాలి, నీరూ వుండవు. స్థలాలు విశాలంగా వుంటాయి. చెట్లు వుంటాయి. పచ్చని పొలాలు వుంటాయి. వీటి మీద నుంచి మంచి గాలి వస్తుంది. మంచి ఎండ తగులుతుంది. హడావిడి వుండదు, ప్రశాంతత వుంటుంది. అక్కడివాళ్ళు వేకువనే లేస్తారు. బస్సులూ బళ్ళూ వుండవు గనక సుబ్బరంగా నడుస్తారు.

ప్రకృతి వైద్యం ఏం చెబుతుందంటే — మన ఆలోచనలు, తినేతిండి, తాగేనీరు, చేసుకునే పనిపాటలు, తీసుకునే విశ్రాంతి - ఇవన్నీ సరిగా లేనప్పుడే వ్యాధి వస్తుంది - కాబట్టి, వచ్చినప్పుడు పద్ధతి ప్రకారం వాటిని సరిచేసుకోగలిగితే చాలు - అంటుంది. వచ్చే వ్యాధిని తగ్గించడానికి, శరీరంలోని క్రమ విధానమే చాలు - అంటుంది. వ్యాధిని నిరోధించే శక్తులు, వ్యాధిని నిర్మూలించే శక్తులూ శరీరానికే వున్నాయంటుంది. అందుకే చూడండి - పశుపక్ష్యాదులు జబ్బులు వస్తే ఏ మందులు వేసుకుంటాయో! ఇంట్లో పెరిగే కుక్కలకీ, పిల్లులికీ జ్వరం వస్తే - ఏమీ ముట్టుకోవు — అలా పడుకుంటాయి. రెండు రోజుల తర్వాత అవే మామూలు అయిపోతాయి. కడుపులో మందగించినా అలాగే చేస్తాయి. అంటే, వ్యాధిని తగ్గించే మార్గాలు శరీరం ద్వారానే జరుగుతున్నాయన్న మాటేగదా.

ప్రకృతి వైద్యంలో శుభ్రత, శారీరక వ్యాయామం, విశ్రాంతి, నియమితమైన ఆహారం - ఇవే మందులు. అలాగే మంచినీరు, మట్టి, గాలి, సూర్యరశ్మి - కూడా మందులే. వీటన్నింటినీ, వైద్యులు ఆయా విధానాల్లో ఆచరింపజేస్తారు.

ప్రకృతి వైద్యం అతి పురాతనమైనదే అయినా, రానురాను తగ్గిపోయింది. కారణం ఏమిటీ, ఈ ఆసుపత్రులు, ఆంగ్లం చదువుకున్న వైద్యులూ ఎక్కువగా రావడం; ప్రకృతి వైద్యంలో కొన్ని నియమ నిష్ఠలు వుండడం! అయినా, ఇప్పటికే పెద్ద పట్టణాల్లోనూ, చిన్నపట్టణాల్లోనూ కూడా ప్రకృతి వైద్యశాలలు వుంటున్నాయి; రోగాలు మరీ ముదిరిపోయిన వాళ్ళు, అక్కడ జేరి, నయం చేసుకుంటున్నారు. (ఆ మధ్య మీరు 'వనిత'లో ఇలాంటి వైద్యశాలల గురించి చదివే వుంటారు)

అంచేత —

ఓ సామెత వుంది. "మంచిగాలి, వెలుతురూ వచ్చే ఇంట్లో — డాక్టరు అడుగుపెట్టడు" అని. అంటే, డాక్టరుకి ఇష్టంలేదని కాదు - ఆ యింట్లో వాళ్ళకి రోగాలు రావని! మంచిగాలి, వెలుతురూ వున్న చోట్లలో వుంటూ, కావలసినంతవరకే మంచి ఆహారం తీసుకుంటూ, శరీర వ్యాయామం చేసుకుంటూ వుంటే, ఆరోగ్యం చక్కగా వుండదూ! అందుకనే సూర్యోదయం వేళలో, ఆ ఎండ ఒంటి మీద పడేలా — చక్కగా బయట నడవమన్నారు. అప్పుడు వచ్చే సూర్యకిరణాల్లోనూ, అప్పుడు వీచే గాలిలోనూ - ఎన్నో సుగుణాలు వున్నాయట! ముఖ్యంగా ఏదైనా జబ్బున పడి, కోలుకున్న వాళ్ళని అలాంటి వేళల్లో, చోట్లలో తిరగమంటారు. ఎందుకని? — అందులోనే 'మందులు'న్నాయని!

అంతేగాని - మా పెద్దవాడి రెండోవాడిలా తొమ్మిదయితేనే గాని లేవక, లేచినా బద్ధకంతో మరో అరగంటసేపు పక్కమీదనే కూచుంటే, ఆరోగ్యం ఎలా బావుంటుంది? — దానంతటదే, పాడవుతుంది. 'బద్ధకం' మనిషికి పరమశత్రువన్నారు. ముందు ఆ శత్రువును పారదోలితే — ఆరోగ్యం అదే బాగుంటుంది. లేకపోతే, దానికనీ దీనికనీ మందులూ, వైద్యాలూ తప్పవు! కదర్రా!

# ప్రశ్నలకు జవాబులు

**పి. డి. యస్. పద్మలత, విశాఖపట్నం**

ఈ మధ్య మా చెల్లెలు వాళ్లు, కింద చూపిన ప్రకారం వున్న స్థలాన్ని కొన్నారు. పడమటి వేపు రోడ్డు వుంది గనక, ముఖద్వారం అటు పెట్టుకుని, అక్కడ ఏవైనా కొట్లులాంటివి కట్టి, మధ్య భాగంలో నివాసానికి ఇల్లు కట్టుకోవాలనుకుంటు న్నారు. తూర్పు వైపుకి ఏదైనా కుటీర పరిశ్రమ పెట్టుకోవాలని కూడా అనుకుంటున్నారు. ఈశాన్యం వైపున బావి త్రవ్వించుచున్నారు. వాస్తు ప్రకారము వారి తలంపు సరైనదా, కాదా తెల్పగోరుతున్నాను.




కొలతల ప్రకారం, వాస్తురీత్యా ఇల్లు కట్టుకోడానికి బాగానే వుంది. ఈశాన్యంలో బావి ఉండడం మంచిదే. ఐతే, ఒక స్థలంలో మూడు ఇళ్ళు కట్టకుండా, పడమటివేపు అంగడి కొట్లు కట్టి, తూర్పున కుటీరపరిశ్రమకు గాను




ఇల్లు కట్టుకుంటే మంచిది. పడమర ముఖం పెట్టి, అంగడి కొట్లు కట్టుకుంటే, వెనక ఇల్లు కూడా తూర్పు, పడమర ద్వారాలు పెట్టి కట్టుకోవాలి. తూర్పున కట్టే ఇంటికి, పడమరకంటె తూర్పున, ఉత్తరం వేపునా ఎక్కువ ఖాళీస్థలం వుండేలా చూసుకోవాలి. బొమ్మలో చూపినట్లుగా రెండు ఇళ్లు మాత్రం కట్టుకోవాలి. స్థలంనుంచి బయటికి వచ్చే మురుగునీరు, ఆగ్నేయంనుంచి ఈశాన్యానికి వచ్చి, ఉత్తరపు ఖాళీగుండా, పడమర రోడ్డుకు పారేటట్లు కాలువ కట్టుకోవాలి. ఇదీ శాస్త్రం! పోతే శాస్త్ర ప్రకారం ఒక స్థలంలో మూడు ఇళ్లు కట్టకూడదు. అంటే, సరి సంఖ్యలో వుండాలంటారు.

**యమ్. వి. యస్. లక్ష్మి, పెద్దాపురం**

రోటి మీద పొత్రాన్ని తియ్యకూడదని, గడప మీద కూచోవద్దనీ మా అమ్మ అంటూ వుంటుంది. కారణం ఏమిటంటారు?

రోలు మీద వుండే పొత్రాన్ని కదిలిస్తే, అది దొర్లి, కాలుమీద పడే ప్రమాదం వుంది. అంచేత, పొత్రాన్ని అనవసరంగా కదల్చకూడదు. ఏదైనా రుబ్బినప్పుడయితే, పొత్రం రోట్లోనే ఇరుక్కుని వుంటుంది గనక, కిందపడే ప్రమాదం లేదు. రుబ్బే పనిలేనప్పుడు పొత్రాన్ని ఎందుకు కదిలించాలమ్మా? - గడపమీద కూచోడం అంటారా - తప్పే. గడపకి శుభ్రంగా పసుపురాసి, కుంకం పెడతాం. దానిమీద కూచుంటే, పెట్టిన పసుపు, కుంకం చెరిగిపోతుంది. మన పెద్దవాళ్లు పురాణాల్లోని సంఘటనలు కూడా లెక్కకి తీసుకుంటారు. దక్షిణం వేపు తలపెట్టి పడుకున్న ఏనుగు తలకాయ తెచ్చి, శివుడు వినాయకుడికి అతికాడు. అలా - దక్షిణం వేపు తలపెట్టి పడుకోడం తప్పుగా పరిగణింపబడింది. అందుకనే, మనల్ని దక్షిణం వేపు తలపెట్టిపడుకోకూడదంటారు. అలాగే, ఉగ్రనరసింహమూర్తి, గడప మీద కూచుని హిరణ్యకశిపుడిని చంపాడు. అందువల్ల ఆ విధంగా కూడా అది నిషిద్ధంగా పరిగణింపబడింది.

**కె. జి. సరళకుమారి, కుప్పం**

మా పూర్వీకులు దసరా పండగ రోజుల్లో ప్రతియేడూ బొమ్మలకొలువు పెట్టేవారట. అది వారికి కలిసి రాలేదట. అందుకని, అప్పట్నుంచీ మా యింట బొమ్మలకొలువు పెట్టకూడదంటారు మావాళ్లు. వారి మూఢనమ్మకాలను గుడ్డిగా నమ్మి, మా సరదా వదులుకోమంటారా?

అంటే - ఒకటుందర్రా, దసరా కొలువు ఇంట్లో పెట్టినప్పుడు, ఏదైనా అశుభం జరిగిందనుకోండి - అప్పట్నుంచి, "ఈ కొలువు మనకి అచ్చిరాలేదు. అందువల్లనే ఇలా జరిగింది" అనుకుంటారు. చాలా విషయాల్లో మనవాళ్ళు ఇలాంటి నమ్మకాల్ని పాటిస్తూనే వుంటారు. మా తాతల కాలంలో - మా తాతగారు, మామిడికాయలు తియ్యాలని, చెట్టు ఎక్కి కాలుజారి కిందపడిపోయి, ప్రాణాలు పోగొట్టుకున్నారుట. మామిడి చెట్టువల్లనే అలా జరిగిందని, తర్వాత వాళ్లు ఆ చెట్టును కొట్టేసి అప్పట్నుంచి మామిడి చెట్టు ఇంట్లో వెయ్యొద్దని శాసనం కూడా చేసుకున్నారు. అలా మనం ఎన్నో నమ్మకాల్ని ఏర్పాటు చేసుకుంటూ వుంటాం. అది మూఢనమ్మకమే-సందేహంలేదు. ఒకవేళ తెగించి, ఎవరైనా చేశారనుకోండి-ఏమవుతుందోనని మనసు శంకిస్తూనే వుంటుంది. అంచేత, మానేయడం ఉత్తమం. 'ఏమీ కాదు' అని గట్టిగా అనుకుని, ఆ సందేహం మనసులోకి రాకుండా చెయ్యగలిగితే మరీ మంచిది!

**టి. శ్రీదేవి, కొల్లూరు**

పెదవుల మీద వెంట్రుకలు మొలిచినా, నొసలు కలిసి వున్నా అలాంటి ఆడవాళ్ళకి కష్టాలు తప్పవంటారు. కాని, సుఖంగా వున్న అలాంటి వాళ్ళను చూస్తూనే వున్నాం గదా. మరి, మా స్నేహితురాలు ఈ విషయమై నాతో వాదన వేసుకుంది. మీరేమంటారు బామ్మగారూ?

అది వొట్టిదే. గుడ్డినమ్మకం.

దాసరి నారాయణరావు

శ్రీ లలితా ఎంటర్‌ప్రైజెస్

# కోరికలే గుర్రాలయితే?

కలర్

నిర్మాత: జి. జగదీశ్‌చంద్ర ప్రసాద్ B.A.,



నటరాజ రూపంలో దర్శనమిచ్చే పరమశివుని క్షేత్రమైన 'చిదంబరం' గురించి-శివరాత్రి పర్వదిన (25-2-79) సందర్భంగా-ఇక్కడ వివరిస్తున్నాము :

ఆనందం ప్రతి ప్రాణీ ఆశించే అమృతం. దాని కోసం ఆరాటపడని మనిషిని చూడలేము. మంచిని పెంచడంలో కొందరికి ఆనందం; మంచిని పొందడం చాలామందికి ఆనందం; దానిని చెడగొట్టడంలో మరికొందరికి మహదానందం. పొరుగువారికి తోడు పడడం కొందరికి ఆనందదాయకం. తోడును విడ దీయడమంటే మరికొందరికి ముదావహం. డబ్బంటే కొందరు ఉబ్బితబ్బిబ్బవుతారు. విద్యార్జనలో కొందరికి విపరీతమైన సంతోషం. అన్నిటినీ వదులుకోవడంలో కూడా కొంతమందికి ఒక రకమైన ఆనందం. అధికారం చెలాయించడంలో కొందరికి అమితానందం. దానిని ధిక్కరించడంలో మరికొందరికి ఆనందం. అలా ఆనందం అందరినీ ఆకర్షించే అయస్కాంతం; ప్రాణుల్ని తన ఇష్ట ప్రకారం నడుపుకోడానికి కాలం వేసే గాలం ఆనందం! మనిషి మనిషికీ ఆనందం ప్రసాదించేవి వేరువేరుగా వుంటాయి. కాని ఒకరి ఆనందం మరొకరికి ఆవేదనగా పరిణమించనంత కాలం ఆనందం అన్వేషించడంలో ఎలాంటి అపశ్రుతీ వినిపించదు. అలాంటి ఆనందం శాశ్వతమైనదైతే మరీ ఉత్తమం! అటువంటి శాశ్వతానంద రహస్యం సూచిస్తూ ఆనంద తాండవం చేసే నటరాజస్వామిగా శివుడు వెలుగొందే పుణ్యస్థలం - దివ్యక్షేత్రమైన చిదంబరం!





# మన దేవాలయాలు: చిదంబరం



దక్షిణ భారత శివక్షేత్రాలలో అతి ప్రాచీన మైనదిగా భావింపబడే చిదంబరం _ మద్రాసుకు నూట ఏభై మైళ్ళ దూరంలో దక్షిణ ఆర్కాడు జిల్లాలో వుంది. కనులవిందు చేసే ద్రావిడ శిల్ప కళా చాతుర్యానికి కాణాచియైన ఈ ఆలయ విస్తీర్ణం నలభై ఎకరాలు. చిదంబర పట్టణ పరిసరాలలో గాని అక్కడినుంచి దాదాపు నలభై మైళ్ళ వరకు ఒక కొండ కాని, బండ కాని కనిపించదు. దూర ప్రాంతాలనుంచి రాళ్ళను మోసుకొచ్చి సువిశాల ఆలయ నిర్మాణం జయప్రదం చేసిన మన పూర్వుల కార్యదీక్షా దక్షతలు, శారీరక శ్రమ, భక్తి ప్రపత్తులు తలుచుకుంటే దిగ్భ్రాంతి కలుగుతుంది.

వ్యాఘ్రపాదుడు, పతంజలి అనే భక్తుల ప్రార్థనను ఆలకించిన పరమశివుడు ఈ 'చిత్సభ' లో దివ్యానంద నర్తనంతో దర్శనమిచ్చాడని స్థల పురాణాల కథనం!

రెండు వేల సంవత్సరాలనుంచే ఈ క్షేత్ర ప్రశస్తిని పురాణేతిహాసాలు వేనోళ్ళ కొనియాడు తున్నాయి. కాని ఏడవ శతాబ్దంనుంచే యేడాదికి యేడాది క్రమక్రమంగా అభివృద్ధి చెంది వినూత్న కాంతులతో ఈ ఆలయం వికసించినట్లు శిలాశాసనా లను పరిశీలించే చరిత్ర పరిశోధకులు చెబుతారు.

ఆలయ ప్రాకారానికి నాలుగు వైపులా రాజ గోపుర ద్వారాలు నిర్మింపబడి వున్నాయి. సప్తాశ్వ రథమధిరోహించి అరుణుని సారథ్యంతో పరమ రమణీయంగా ఊరేగుతున్న శివకేశవుల అపురూప శిల్పం వెలుగొందే తూర్పు గోపుర ద్వారం పదమూడవ శతాబ్దంలో సుందర పాండ్యునిచే నిర్మింపబడింది. ప్రముఖ విద్యాదాతగా విశిష్ట ఖ్యాతిని ఆర్జించిన పచ్చయప్ప 1785 సం॥లో దీనిని పునరుద్ధరించారు. పరమశివుడే తండ్రి-సర్వ ప్రాణికోటి వాని సంతానం; సర్వ మానవ సోదరభావంతో మసలుకొని జగత్పితను సేవించడం లోనే మానవ జన్మ సార్థకమౌతుందని 'సత్పుత్ర మార్గం' ప్రబోధించిన మణివాసగర్ ఈ ద్వారం గుండానే చిదంబరస్వామిని దర్శించేవాడట.

తన్ను దేవదేవుని దాసానుదాసునిగా భావించి శివ సాన్నిధ్యానికి 'దాస మార్గం' ఉపదేశించిన

# కేమెల్ వనిత క్రైలిన్® పోటీ





మీకు యివ్వబడిన డిజైన్ ట్రేస్ తీసి, చుట్టూ చక్కగా కుట్టబడి, నలుచదరంగా (35 సెం.మీ. x 35 సెం. మీ) వున్న గుడ్డపై కేమెల్ క్రైలిన్ రంగులతో ఆ డిజైన్‌కు రంగులు వేయండి. మీరు వేసే రంగులు వీలయినంత లేతగా వుండాలి. అందుకు కేమెల్ క్రైలిన్ మీడియమ్‌తో రంగులను పలుచన చేసుకోవచ్చు. పోటీ చేసే ప్రతి ఒక్కరూ 3 ఎంట్రీలకన్న ఎక్కువ పంపరాదు.

**బహుమతులు : రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- ఇవే గాకుండా 10 మెరిట్ సర్టిఫికెట్‌లు**

మీరు రంగులు వేసిన ఎంట్రీలను ఈ క్రింది ఎడ్రసుకు పంపండి:

పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్,

**కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్,** ఆర్ట్ మెటీరియల్ డివిజన్, జె.బి. నగర్, బొంబాయి 400 059

పేరు, ఎడ్రసు వ్రాసిన కవర్‌ను పోస్టేజితోసహా ఎంట్రీతోపాటు పంపితే పోటీ చేసే ప్రతి ఒక్కరికీ ఒక ట్రాన్స్‌ఫర్ పంపబడుతుంది.

మీ ఎంట్రీతో జతపరిచే 'ట్యాగ్'పై మీ పేరు, చిరునామా ఇంగ్లీషులో వ్రాయండి. మీ ఎంట్రీ తిరిగి పంపబడదు.

**ఎంట్రీలు పంపవలసిన ఆఖరు తేది : 31-3-1979**

**CONTEST NO. 11**

Vision

Join Camel School of Art Correspondence Course.
Contact the above mentioned address for details.

'జ్ఞానసంబందర్' దక్షిణ ద్వారం గుండా నటరాజ సన్నిధానానికి వచ్చేవాడట! దీనిని పదమూడవ శతాబ్దంలో కొప్పెరుం సింగదేవుడనే పల్లవరాజు కట్టించాడు.

దేవుని ప్రాణసఖునిగా భావించి సాటి మానవ కోటితో ప్రేమను పంచుకోవడమే శివసన్నిధిని చేర్చే పెన్నిధి అని భావించి 'సఖామార్గం' లోని మధురిమను చాటిన అప్పర్-పడమటి ద్వారం గుండా పరమశివుని దర్శించేవాడని పెద్దలు చెబుతారు.

నూట అరవై అడుగుల ఎత్తుతో గంభీరంగా వెలుగొందుతున్న ఉత్తర గోపుర ద్వారాన్ని-ఒరిస్సా ప్రాంత విజయ సూచకంగా పదహారవ శతాబ్దంలో శ్రీకృష్ణ దేవరాయలు నిర్మించాడట. మనిషిలోని మంచితనమే శివపూజా ద్రవ్యమని భావించి 'సన్మార్గా'న్ని ప్రబోధించిన సుందరమూర్తి ఈ ద్వారంగుండానే రోజూ శివదర్శనం చేసుకునేవాడట!

తూర్పు పడమటి రాజగోపురాల మీద భరత ముని నాట్యశాస్త్రంలో వివరించిన రీతులలో నూట ఎనిమిది భంగిమలలో నృత్య శిల్పాలు వాటి వివరణలతో సహా చెక్కబడి ఉన్నాయి.

ప్రాకారం దాటి లోపలికి ప్రవేశించగానే-ఏ గుడిని మొదట దర్శించాలా?-అన్న సందేహం రేకెత్తించే విధంగా చిన్న చిన్న గుడులు చాలా ఉన్నాయి. నైరుతీ మూలలో వినాయకాలయం-అందులోని ఎనిమిదడుగుల ఎత్తు గణపతి విగ్రహం చాలా అరుదుగా కనబడుతుంది. నృత్య భంగిమలో మరో గణపతి గుడి కూడా వుంది. రెండు షణ్ముఖ ఆలయాలు-పరాశక్తి, మీనాక్షీ సుందరేశ్వరుల ఆలయాలు, నవ లింగాలకు ఎదుట శివగంగ కోనేరు, దానికి సమీపంలో వరుసకు ఇరవై నాలుగు స్తంభాల ప్రకారం నలభై ఒక్క వరుసలు గల వేయి స్థంభాల మంటపం (రాజ సభ) మొదలైనవి ఉన్నాయి. ఉత్సవమూర్తి కొలువుండేది దేవసభ అనీ, ఊర్ధ్వ తాండవమూర్తి ఆలయాన్ని 'నృత్యసభ' అనీ అంటారు. నటరాజస్వామి నాట్య భంగిమలో కొలువుండే గర్భగృహం-'చిత్సభ'.

చిత్సభకు ఎదురుగా నటరాజస్వామి దివ్య నర్తనం తిలకిస్తున్నట్టుగా శాంతాకారంతో శయనించిన గోవిందరాజస్వామి సన్నిధి! ఒకరు నటరాజు; మరొకరు రంగనాథుడు. ఒకరు భుజంగ శయనుడైతే మరొకరు పన్నగభూషణుడు. ఒకే చోటులో నిలబడి ఇద్దరినీ దర్శించవచ్చు. నామరూపాలు మాత్రమే వేరు కాని హరిహరులిద్దరూ ఒక్కరే-అన్న మన పెద్దల మాటలు మనకు జ్ఞాపకం చేస్తాయి!

నటరాజమూర్తికి వెనుక భాగంలో నలుపు ఎరుపు రంగుల 'తిరస్కృణి' తెర! ఆ తెర తీయగానే బంగారు బిల్వదళ మాల అలంకరించబడిన ఖాళీ ప్రదేశం! సర్వాంతర్యామి, సత్య స్వరూపుడైన పరమశివుని ఆకాశలింగంగా పూజించడమే చిదంబర క్షేత్ర వైశిష్ట్యం! అదే అక్కడి రహస్యం!

బలం, ఒక క్రమం, అందం మిళితమైన కళ-నాట్యం! ప్రపంచమే ఒక నటనాలయం. ప్రతి జీవీ అందులో పాత్రధారి! దీనిని నడిపించేవాడు నటరాజు. అతడు చేసే ఆనంద నర్తనానికి అనుగుణంగా-సూర్యచంద్రాది గ్రహాలు, ఋతువులు పరిభ్రమిస్తాయి. వాటి పరిభ్రమణను అనుసరించి ప్రపంచ సృష్టి స్థితి లయాలు జరుగుతూ వుంటాయి. దీనిద్వారా పరమశివుడు-సృష్టి, స్థితి, సంహార, తిరోభావ, అనుగ్రహాలు అనే ఐదు కార్యాలు నెరవేరుస్తూ వుంటాడు. ఢమరుకధ్వని సృష్టికీ, అభయహస్తం స్థితికీ, అగ్ని సంహారానికీ, క్రిందికి చూపే హస్తం తిరోభావానికీ, పైకెత్తిన పాదం అనుగ్రహానికీ సంకేతాలుగా శైవ సిద్ధాంతులు చెబుతారు. ఆధ్యాత్మిక అనుభూతి, వైజ్ఞానిక సత్యం, కళాత్మక సౌందర్యం సంగమించే అపురూపమైన సజీవ కవిత్వం శివుని నటరాజ స్వరూపం! ఈ చిదంబర రహస్యం కూడా తెలుసుకుని దానికి అనుగుణంగా జీవిత పయనం సాగించినట్టయితే ప్రతి హృదయం చిదంబరమవుతుంది. నటరాజ పాదాల ఆనంద నర్తనా నాదాలు ప్రతిధ్వనిస్తాయి! *

## పాఠకులకు

# "చిత్రానికి వ్యాఖ్య"

ఇక్కడ ఒక వ్యంగ్య చిత్రం కనిపిస్తోంది. అది చూసి మీరేదైనా 'వ్యాఖ్య' లాంటిది రాయగలరా? ఆ వ్యాఖ్య చమత్కారంగా వుంటే మరీ మంచిది. వ్యాఖ్య నాలుగైదు మాటల్లోనైనా వుండొచ్చు – రెండు లైన్లలోనైనా వుండొచ్చు. ఏమైనా, పదిహేను మాటలకు మించకూడదు. వ్యాఖ్యలు కార్డుల మీదనే రాసి, పైన 'చిత్రానికి వ్యాఖ్య' అని రాసి ఫిబ్రవరి 5వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. కార్డు మీద వ్యాఖ్య, పంపినవారి చిరునామా తప్ప ఇంకేమీ రాయకూడదు.

ఫలితం : మార్చి సంచికలో



# ఆదాచేసి ఆదాయం పొందండి!

# మీకునచ్చే పథకములు

మంచి వడ్డీ,
బహుమతులు
పొందే అవకాశం.

ఉచిత
బహుమతులు
పొందే అవకాశం.

నేడే మీసమీపములో గల బ్రాంచీలందు
సంప్రదించండి!




## ఆంధ్రప్రదేశ్ సేవింగ్ & ఫైనాన్సు
### రాజమండ్రి - 533101.

ఫోన్: 4411. పి.బి: నెం. 47. గ్రాము: సేవింగ్.

రీజినల్ ఆఫీసులు:- స్టేషన్ రోడ్, నాంపల్లి. హైదరాబాద్.
రాఘవయ్యా పార్కు ఎదురుగా. విజయవాడ.

బ్రాంచీలు:-
కడప, కర్నూలు, అనంతపురం, ఖమ్మం, కాకినాడ, పాలకొల్లు
భీమవరం, కొత్తగూడెం, నల్లగొండ, కేసవరం, అనకాపల్లి, ఆదోని, రాజంపేట,
విజయవాడ, సికింద్రాబాద్, కోయిలకుంట్ల, మండపేట. నూజివీడు,
గుంటూరు. తిరుపతి, పెద్దాపురం, గిద్దలూరు, నందలూరు, మదనపల్లి,
ధర్మవరం, ఏలూరు, తాయ్యాలగూడెం, చిత్తూరు, బూర్గంపాడు.



ANU

# ప్రపంచం

**1979** ప్రవేశిస్తూ ప్రపంచ రాజకీయ చరిత్రలో ఊహించని ఒక పరిణామానికి స్వాగతం చెప్పింది. అగ్రదేశాలలో ప్రముఖ దేశాలయిన అమెరికా, చైనాల మధ్య దౌత్య సంబంధాలు ప్రారంభమయ్యాయి. ఒకటి పెట్టుబడి దారి దేశం మరొకటి కమ్యూనిస్టు దేశం కావడంతో ఒకనాటి అందరి ఊహలని ఈ పరిణామం పటాపంచలు చేసింది. అంతేకాక రాజకీయాలలో శతృత్వం ఏ నిమిషంలో ప్రారంభమవుతుందో, ఏ క్షణంలో ముగుస్తుందో ఎవ్వరూ చెప్పలేరనే నీతి ఈ మార్పుతో ఋజువయింది.

1972లో 'పింగ్‌పాంగ్ డిప్లమసీ' పేర చైనా, అమెరికాల మధ్య స్నేహ సంబంధాలు పునరుద్ధరించబడి, ఆరు సంవత్సరాల తర్వాత ఈ రోజున ఆ సంబంధాలు దౌత్యస్థాయికి పెరిగాయి. రష్యాని ప్రపంచంలో ఒంటరిగా మిగల్చాలనే ఆలోచన రెండు దేశాలకీ వుండడంవలన ఈ గొప్ప మార్పు సంభవించిందని రాజకీయ పరిశీలకుల అభిప్రాయం. ఆ అభిప్రాయానికి బలం చేకూర్చిన సంఘటనలు కొన్ని వున్నాయి. అవి పసిఫిక్ ప్రాంతంలో సోవియట్ నౌకా దళబలం అమెరికా సప్తమ నౌకా దళబలంకన్నా ఎక్కువ వుండడం, ఆఫ్ఘనిస్తాన్‌లో సోవియట్ రష్యాకు అనుకూలంగా తిరుగుబాటు జరగడం, వియత్నాంలో రష్యా ప్రభావం హెచ్చవడం, ఆగ్నేయాసియాలో అమెరికా పేరు ప్రతిష్టలు మంటకలవడం ఇవికాక వ్యవసాయ పంటలు అమెరికాలో మిగిలిపోతూ వుంటే, అతివృష్టికి అనావృష్టికి లోనవుతూ ఆహార ధాన్యాల లోటు ఏర్పడిన చైనాకి 'అత్యవసర పరిస్థితి'లో అమెరికా సహాయం కావలసివచ్చింది. చైనాకి అది అవసరమయితే ఆమెరికాకి అది వ్యాపారమయింది. ఆహార పదార్థాలతోపాటు అమెరికా పారిశ్రామికోత్పత్తులు చైనాకి కావలసి వచ్చాయి. అలా రాజకీయ రంగంలో రష్యాని బహిష్కరించి తన సమస్యలు పరిష్కరించుకోడానికి చైనా పడుతున్న తాపత్రాయానికి ఈ మార్పుని నిదర్శనంగా పేర్కొంటున్నారు.

ఇక చైనా, అమెరికా దౌత్య సంబంధాలవలన ప్రత్యేకంగా దెబ్బతిన్న దేశం తైవాన్. ఒకరోజున -ఫార్మోసాగా వ్యవహరించబడిన తైవాన్‌కి అమెరికా ఆసరాగా నిలిచి ఆదుకుంది. అమెరికా తనకి శాశ్వతంగా దూరమయిపోతూవుంటే పదిహేను కోట్ల జనాభాగల తైవాన్ రష్యా సరసన చేరుతుందా అన్న విషయం కొత్త సంవత్సరం నిర్ణయిస్తుంది.

## వార్తలలో అల్జీరియా

ఒక రోజున ఫ్రెంచి సామ్రాజ్యంలో అంతర్భాగమయిన అల్జీరియా 1962లో స్వతంత్ర ప్రతిపత్తిని సంపాదించుకోగలిగింది. అలా స్వతంత్ర దేశంగా అవతరించడానికి అల్జీరియా జరిపిన పోరాటం ఆఫ్రికా దేశాల చరిత్రలోనే ప్రముఖ స్థానం ఆక్రమిస్తుంది.

అయితే స్వతంత్ర దేశాలుగా అవతరించిన అనేక దేశాలలో ప్రాథమిక దశలో పరిస్థితులు ఎలా వుంటాయో అల్జీరియాలోనూ పరిస్థితులు కొంతకాలం అలాగే వున్నాయి. ప్రధానంగా ఆర్థిక రంగంలో అస్తవ్యస్తత చోటు చేసుకుంది. స్వతంత్రానంతరం అధికారంలోకి వచ్చిన ప్రభుత్వంలోని నాయకులు 'దేశంకోసం మనం' అనే సిద్ధాంతానికి తిలోదకాలు ఇచ్చి 'మన కోసం దేశం' అనే సిద్ధాంతంతో రాజకీయ అల్లకల్లోలానికి పురుడు పోశారు. 1962–65 మధ్యకాలంలో ప్రభుత్వం రెండుసార్లు మారింది. ప్రధాని పదవిలో వున్న బెన్‌ఖెద్దాను తొలగించి ఉపప్రధాని బెన్‌బెల్లా ప్రధాని పదవిని స్వీకరించాడు. ఇద్దరూ తమ పదవీ కాలంలో దేశ సమస్యలను పరిష్కరించలేకపోయారు. పాలకుల అసమర్థత ప్రజలలో అశాంతిని సృష్టించడంతో సహజంగా వచ్చే మార్పే అల్జీరియాలోనూ వచ్చింది. సైనిక నాయకుడు బౌమెడియన్ దేశంలో సైనిక విప్లవం తీసుకువచ్చి పరిపాలన స్వీకరించాడు. అచిరకాలంలోనే నియంతలలో ఆదర్శవాదిగా బౌమెడియన్ మంచిపేరు సంపాదించాడు. అల్జీరియాను సోషలిస్టు దేశంగా తీర్చిదిద్దాలని బౌమెడియన్ శ్రమించాడు. ఆఫ్రికన్ రాజ్యాల మధ్య అంతర్యుద్ధాలు కాని అభిప్రాయ బేధాలు కాని వుండకూడదని ఆయన కృషి చేశాడు. అటు అమెరికా ఇటు సోవియట్ రష్యా మధ్యధరా సముద్ర ప్రాంతాన్ని యుద్ధ స్థావరంగా ఏర్పరచుకోకుండా వుండాలని బౌమెడియన్ ప్రయత్నించాడు. అంతర్జాతీయరంగంలో అలీన విధానపు ప్రాముఖ్యాన్ని వర్తించి వ్యవహరించాడు. పదమూడు సంవత్సరాలు ఆల్జీరియాని పాలించి పరిపాలనలో సమర్థుడిగా పేరుగాంచి, ప్రజలకి సుస్థిరత్వాన్ని అందచేసిన బౌమెడియన్ ఇటీవలే మరణించాడు. బౌమెడియన్ మరణం అల్జీరియాకేకాక ఆఫ్రికన్ రాజ్యాలకే తీరని లోటుగా ప్రపంచం భావిస్తోంది.

## టర్కీకి అగ్నిపరీక్ష

పుణ్యకాలం ఇక ముగుస్తుందనిపించినప్పుడు కొంతమంది పాలకుల వెర్రి వెయ్యి తలలు వేస్తుంది. టర్కీ ప్రధాని బులెంట్ ఎసివిట్ దేశంలోని పదమూడు ప్రధాన నగరాలలో 'మార్షల్‌లా' ప్రవేశపెట్టి ప్రజాస్వామ్యాన్ని అగ్నిపరీక్షకి నిలబెట్టాడు. మిలటరీ పాలనలో ప్రజాస్వామ్య ధోరణులు కనిపిస్తున్నాయనుకున్న టర్కీలో రాజకీయ దురాగతాలు కొద్ది నెలలుగా పెచ్చు పెరిగాయి. మూడున్నర కోట్ల జనాభాగల టర్కీ ముస్లిం మత ప్రధానమయిన దేశం. అయితే ముస్లిమ్‌లలో రెండు తెగలయిన షియాలు, సున్నీల మధ్య టర్కీలో పచ్చగడ్డి వేస్తే భగ్గుమనే వాతావరణం ఏర్పడి అటు రాజకీయ అల్లకల్లోలంతో జత కలిపింది. 1925 ప్రాంతాలలో ముస్తాఫ్ కమల్‌పాషా దేశాన్ని మతం సంకెళ్ళు తెంపి అన్ని రంగాలలోనూ ఆధునికంగా మారుద్దామని చేసిన ప్రయత్నాలకి యాభయి సంవత్సరాల తర్వాత ముస్లిమ్‌లలోని అరిత కలహాలవలనే అవరోధం ఏర్పడడం ఆశ్చర్యకరంగా వుందని పరిశీలకులు భావిస్తున్నారు.

సరిగ్గా సంవత్సరం క్రితం ఎసివిట్ నాయకత్వంలో రిపబ్లికన్ పార్టీ మరికొన్ని పార్టీలతో చేతులు కలిపి అధికారంలోకి వచ్చింది. అయితే ఈ ఐక్య సంఘటనకి పార్లమెంట్‌లో ప్రతిపక్షాలకన్నా పెద్ద మెజారిటీ లేదు. అలా స్వల్ప మెజారిటీతో రిపబ్లికన్ పార్టీ నెగ్గుకువస్తోంది.

సైనిక పరిపాలన ప్రవేశపెట్టిన ఎసివిట్‌కి తాను ప్రవేశపెట్టే సంస్కరణలు అమలుపరచడంలో సైన్యం సహకరిస్తుందనే నమ్మకం కరువవడంతో టర్కీ అగ్ని పరీక్షనుంచి ఎలా బయటపడుతుందో 'ప్రపంచం' ఎదురుచూస్తోంది.

పెద్దకథ:

# 2 తెలిసి చేసిన పాపం

దినేష్ దగ్గరనుంచి రెగ్యులర్‌గా లెటర్స్ వస్తుండటంతో అతన్ని గురించిన బాధలేదు. "అతి త్వరలో ఇండియా వచ్చేస్తానమ్మా. నా రూమ్ బాగా డెకరేట్ చేసి వుంచాలి. నేను సాధ్యమైనంత త్వరలో వచ్చేస్తానమ్మా. నువ్వు బాధపడకు" అంటూ శోభకు ధైర్యం చెబుతూ వ్రాసేవాడు. అవి చదువుకొని దినేష్ వచ్చేసినట్లే సంబరపడిపోయేది శోభాదేవి.

దినేష్ చిన్నపిల్లవాడుగా వున్నప్పటినుంచీ ప్రతి పుట్టిన రోజునాడూ తీసిన ఫొటోలన్నీ ఓ ఆల్బమ్‌లో వుంచారు. పదే పదే అవి చూసుకుంటూ కొడుకు చిలిపి అల్లరి గురించి హర్షతో చెబుతూ హాయిగా నవ్వుతుండేవారు. హర్ష ఏదైనా కొంటె పని చేస్తే 'దినేష్ కూడా యిలాగే చేసేవాడు' అంటూ అనుక్షణం హర్ష ప్రతి కదలికలో కొడుకు జ్ఞాపకాలను చూసుకుంటూ వుండేది శోభ. హర్షమీద ఆమెకు ఆప్యాయత రోజురోజుకూ పెరుగుతోంది.

ఆ రోజు ఏదో స్కూల్ ప్రారంభోత్సవానికి ఆహ్వానం రావడంతో కలెక్టర్‌గారి ఫామిలీతో పాటు అందంగా హుందాగా వాళ్ళ కారులో దిగిన హర్షను చూసి అంతా వారమ్మాయనే అనుకున్నారు. హర్ష ఆ రోజు ఫంక్షన్‌లో కలెక్టర్ రావుగారి చెయ్యి వదిలిపెట్టలేదు. ఓ ప్రక్క శోభాదేవీ మరో ప్రక్క హర్షా కూర్చున్నారు. తను కలెక్టర్‌గారికి సన్నిహితురాలినని వాళ్ళందరూ అనుకోవాలని తనని గొప్పగా గౌరవించాలనీ హర్ష కోరిక.

హర్ష కోరుకున్నట్లుగానే కలెక్టర్‌గారి చెయ్యి విడువకుండా తిరిగే ఈ అందాల అపరంజి బొమ్మ నిశ్చయంగా కలెక్టర్‌గారికి అత్యంత ఆప్తురాలే అయ్యుంటుందని హర్షకు వి. ఐ. పి. ట్రీట్‌మెంట్ యిచ్చి చాలా గౌరవంగా చూశారు. ఆ రోజు హర్ష మనసు ఆనందంతో గంతులు వేసింది. ఇన్నాళ్ళుగా తనకు లేని గుర్తింపూ, ఓ ప్రత్యేకతా చూపించే మనుషుల మధ్య మసలుతుంటే జీవితం నందన వనంలా కనిపించింది.

అయితే, రావుగారు హర్ష పట్ల అభిమానంగానే వున్నా ఈ మధ్య ఆ పిల్ల పదేపదే వచ్చి తమ ఏకాంతానికి భంగం కలిగించడం అంత యిష్టముండేది కాదు. పెళ్ళైన రోజునుంచీ శోభ లేకుండా ఒంటరిగా భోంచేయడంగానీ, ఒంటరిగా ఒక్క నిముషమైనా యింట్లో గడపటంగానీ ఏవిటో అసహజంగా అనిపిస్తుండేది. అలాంటిది హర్ష మూలంగా ఎక్కువ భాగం హర్షతో గడిచిపోతుంటే శోభాదేవితో ఒంటరిగా మాట్లాడే ఆనందానికి దూరమవుతున్నానన్న బాధ లోలోన ఆయనకు అసంతృప్తిని కలిగిస్తుండేది.

అయినా హర్ష సమక్షంలో అవేవీ గుర్తు వుండేవి కావు. కాలానికి కళ్ళాలు లేనట్లుగా అతి వేగంగా నిముషాలూ, గంటలూ గడిచిపోయేవి. ఆ అమ్మాయి వెళ్ళిపోయింతర్వాతగానీ, తను రోజురోజుకూ శోభకు చాలా దూరమవుతున్నానన్న భావన కలగటంలేదు. మరు రోజు హర్ష రాగానే అన్నీ మరిచిపోయేవారు; ఆప్యాయంగా పలకరించేవారు. అభిమానంగా ఆఫీసు నుంచి వస్తూ తెచ్చిన స్వీట్స్, పూలూ అందించేవారు.

"మరో మూడు వారాల్లో వచ్చేస్తున్నానమ్మా! మీ ముందు వాలిపోతాను. డాడీ, నువ్వూ నన్ను ఎలా రిసీవ్ చేసుకోవాలా ఎంత గ్రాండ్‌గా స్వాగతం చెప్పాలా అని చూస్తున్నారు కదూ! వచ్చేరోజు డిసైడ్ అయిన దగ్గరనుంచీ నాకూ అలాగే ఆత్రంగా వుందమ్మా! ఎప్పుడెప్పుడు వచ్చి మిమ్మల్ని చూస్తానా అనిపిస్తోంది. మీ హర్షను కూడా ఎయిర్‌పోర్ట్‌కు తీసుకురండి. నువ్వంతగా వర్ణిస్తూ వ్రాసే మీ హర్షను చూడాలని మరీ కోరికగా వుంది. హర్ష పరిచయమైన తర్వాత నా గురించిన దిగులు కూడా మీకు లేకుండా చేసిన తనకు కృతజ్ఞతలు చెప్పాలి మొదట." అంటూ దినేష్ వ్రాసిన లెటర్ చూసి శోభాదేవి ఆనందంతో పొంగిపోయింది. కొడుకు వచ్చేసరికి యిల్లు అద్దంలా కనిపించాలని సామానులన్నీ చక్కగా సర్దించడం, దినేష్‌కు యిష్టమైన పిండివంటలన్నీ వంట మనిషి చేత వండించడంలాంటి పనుల్లో పడిపోయింది. ఆ ఆనందంలో హర్ష, రావుగారు కూడా పాలుపంచుకున్నారు. సాయంత్రాలు ముగ్గురూ కలసి దినేష్ రాగానే ముందుగా కన్నుల పండువగా కనిపించే గార్డెన్ చూసి మురిసిపోతాడని దగ్గరుండి మాలి చేత అడ్డదిడ్డంగా పెరిగిన మొక్కల్ని చక్కగా కత్తిరించడం, విడవకుండా లాన్‌లో నీళ్ళు చల్లించడంలాంటి పనులు చేయిస్తుండేవారు.

ఆ రోజు దినేష్ రూమ్ స్వయంగా తనే సర్దాలని దగ్గరుండి కడిగిస్తూ సర్దుతూ వుంది శోభాదేవి. తోటలో హర్ష, రావుగారు ప్రతి చెట్టు దగ్గరా ఆగి ఏ కొమ్మలు అడ్డదిడ్డంగా పెరిగాయో చూసి కత్తిరిస్తున్నారు కబుర్లు చెప్పుకుంటూ.

మొసాయిక్ ఫ్లోరింగ్ మీద సబ్బునీళ్ళతో శుభ్రంగా తుడుస్తోంది మాలక్ష్మి. దినేష్ వీణ దులిపి, ప్రక్కకు సర్ది, పుస్తకాల బీరువా వైపు అడుగులువేసిన శోభాదేవి కాలు స్లిప్‌కావడంతో క్రిందపడి కెవ్వున కేకపెట్టారు. ఆ కేకకు మాలక్ష్మి అదిరిపోయింది. క్రింద తోటలో నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్న రావుగారూ హర్షా పరుగెత్తుకొని పైకి వచ్చారు.

ఫామిలీ డాక్టర్ శ్రీనివాసరావుగారు దగ్గరుండి శోభాదేవికి ఎక్స్‌రే తీయించారు. మోకాలు దగ్గర ఫ్రాక్చరైంది. మరురోజు ప్రొద్దుటగానీ ప్లాస్టర్ వేయడానికి వీలులేదని అప్పటికి కట్టుకట్టి ఇంజక్షనిచ్చి ఏవో కొన్ని టాబ్లెట్స్ యిచ్చి జాగ్రత్తగా చూడమని చెప్పి వెళ్ళారు. హర్ష కళ్ళు అవిరామంగా వర్షిస్తున్నాయి. నిస్సహాయంగా మంచంలో పడిపోయిన శోభాదేవిని చూస్తే మనసు భారమైపోతోంది రావుగారికి. హర్ష ఎదురుగా వున్నదన్న విషయం కూడా మరచి శోభాదేవి ముఖం రెండు చేతుల మధ్యకు తీసుకొని హృదయానికి హత్తుకున్నారు. ఇద్దరి కళ్ళూ నీళ్ళతో నిండిపోయాయి. దినేష్ వస్తున్నాడన్న ఆనందం ఎగిరిపోయింది. పసిపిల్లవాడిలా బాధపడుతున్న రావుగారిని చూస్తే హర్ష మనసు కరిగి నీరైంది. అంత పెద్ద మనిషి అలా కన్నీరు కారుస్తుంటే ఏం చేయాలో తోచలేదు. మాలక్ష్మి పిలుపుతో

నెమ్మదిగా వెనుదిరిగి క్రిందకు వెళ్ళిపోయింది వాళ్ళిద్దరినీ ఒంటరిగా వదిలి.

మరురోజు పాదం దగ్గర నుంచీ మోకాలివరకూ ప్లాస్టర్‌తో దినేష్ గదిలో పైకప్పువేపు చూస్తూ పడుకుని వున్న శోభాదేవి—అడుగుల చప్పుడుకు తల తిప్పి హర్షను చూసి చిన్నగా నవ్వుతూ పిలిచింది.

"రామ్మా! హర్షా! రాత్రి చెప్పకుండానే వెళ్లిపోయావేం? మీ నాన్నగారు లేట్‌గా వస్తారన్నావు. ఒక్కదానివీ ఎలా వున్నావు? మీ అంకుల్ పసి పిల్లాడిలా ఏడుస్తుంటే ఆయన్ని ఓదార్చే ప్రయత్నంలో నేనూ ఏడుస్తూ వుండిపోయాను. ఆ తర్వాత మా లక్ష్మి నడిగితే నువ్వు వెళ్ళిపోయినట్లు చెప్పింది. రా కూర్చో" అంటూ చెయ్యి అందించిన శోభాదేవి చేయి తన చేతుల్లోకి తీసుకొని క్రిందనే చతికిలబడిన హర్ష ఆ చేయి పట్టుకొని ఏడ్చేసింది.

"ఆంటీ! ఎంతో సంతోషంగా అన్నీ అందంగా అమర్చాలని ఆరాటపడిన మీరు యిలా మంచం మీద పడివుండడం" అంటూ కన్నీరు కారుస్తున్న హర్ష పాలగ్లాసుతో మంచం దగ్గరకు వచ్చిన రావు గారిని చూసి ఆశ్చర్యపోయింది.

ఒక్క రాత్రిలో ఆయనలో వచ్చిన మార్పు హర్షను కలవరపెట్టింది. అందంగా డ్రెస్ చేసుకొని ఠీవిగా నడిచే రావుగారు – కలెక్టర్ పదవికే ఓ అందాన్నిచ్చే రావుగారు—పీక్కుపోయిన ముఖంతో నలిగిపోయిన బట్టలతో, చెదరిపోయిన క్రాపుతో



నీరసంగా అడుగులేస్తూ పాలగ్లాసు తీసుకుని వచ్చి, హర్షను చూసి చిన్నగా నవ్వడానికి ప్రయత్నిస్తూ గ్లాసు టీపాయ్ మీద పెట్టి మంచంమీద ఓ ప్రక్కగా కూర్చున్నారు. "క్రింద కూర్చున్నావేం హర్షా! అలా కుర్చీలో కూర్చో" అంటూ "లే శోభా! కొంచం పాలు త్రాగి పడుకో" అంటూ నెమ్మదిగా దిండ్లు రెండు ఎత్తుగా వేసి కూర్చోబెట్టారు.

రావుగారినే చూస్తూ నెమ్మదిగా లేచినుంచున్న హర్షవైపు చూసి నవ్వుతూ—

"చూశావా హర్షా! మీ అంకుల్ ఎంత ధైర్యశాలో. నా కాలు ఫ్రాక్చరైందంటే ఆయన ప్రాణాలు విలవిల్లాడిపోతున్నాయి. ఇంట్లో ఇందరు నౌకర్లుంటే తనే స్వయంగా పాలు తీసుకొచ్చి నాకివ్వాలా? ఆఫీసు కూడా ఎగ్గొట్టారు. ఎంతో ఠీవిగా కనిపించే అంకుల్ ఏమిటి యిలా అయ్యారని ఆశ్చర్యపడుతున్నావు కదూ!" అంది శోభాదేవి చిన్నగా నవ్వుతూ రావుగారి వైపు ప్రేమగా చూస్తూ. ఆ కళ్ళలో ప్రేమ ఆరాధనలతో పాటు ఓ సన్నని గర్వరేఖ కూడా తొంగి చూసింది.

"హర్షా! ఇంటినిండా ఎంతమంది నౌకర్లున్నా తనే నాకు అన్నీ ఎందుకందిస్తుందో కనుక్కో! ఇన్ని సంవత్సరాలు భగవంతుడు ఆ అవకాశం నాకిచ్చాడు. నేను స్వయంగా పాలు తీసుకొస్తే, ఎందుకంత బాధో మీ ఆంటీకి కనుక్కో. ఒక్క రోజు నేను ఆఫీసుకెళ్ళకపోతే కొంపలంటుకు పోతాయా!" అన్నారు రావుగారు చిరుకోపం

ప్రదర్శిస్తూ – శోభవైపే కన్నార్పకుండా చూస్తూ పాలగ్లాసు నోటికందిస్తూ. గ్లాసు చేతుల్లోకి తీసుకున్న శోభాదేవి కనురెప్పలు సిగ్గుగా వాలిపోయాయి.

కాలు ఫ్రాక్చరై పడుకున్న తనకు పాలగ్లాసు తెచ్చి అందిస్తున్న రావుగారిలో ఏ మార్పూలేదు. తమ యింట్లో బీద విద్యార్థిగా ప్రవేశించి క్రమంగా తన మనసుదోచుకొని తన ఆరాధ్యదైవంగా మారి, తనని ఆరాధించే రావుగారి ప్రేమ, మళ్ళీ అంత సన్నిహితంగా పాలందిస్తున్న ఆ చేయి చూస్తుంటే అతివేగంగా ఇరవై సంవత్సరాల వెనక్కు పరుగులు తీసింది శోభాదేవి మనసు.

గత మధుర స్మృతుల వారవడిలో పడి కొట్టుకుపోతున్న శోభాదేవి రావుగారూ - హర్ష అక్కడి నుంచీ ఎప్పుడు వెళ్ళిపోయిందో గమనించలేదు.

ఎంతోసేపటికి స్పృహలోకి వచ్చి తిరిగి చూస్తే హర్ష కనిపించలేదు. సిగ్గుగా తల తిప్పుకుంటున్న శోభాదేవి నుదుట ముద్దుపెట్టుకుంటూ –

"శోభా! భగవంతుడికి పక్షపాతం లేదు. ఇన్ని సంవత్సరాలూ ప్రతి నిముషం నా అవసరాలేమిటో కనుక్కుంటూ అమర్చిపెట్టే అవకాశం నీకు కల్పించాడు. ఇప్పుడు నాకా అదృష్టాన్ని ప్రసాదించాడు. అయితే ఇలా కాకుండా మరోలా అయితే ఇంత బాధలేకపోను. నువ్వు అలా కదలకుండా పడి వుంటే నాకు యింట్లో కాళ్ళూ చేతులూ ఆడటం లేదు. ఏమీ తోచడం లేదు. అదీ దినేష్ వచ్చే ముందు నువ్విలా మంచంలో పడి వుంటే...." రావుగారి కంఠం గద్గదమైంది. టప్పు టప్పున రాలుతున్న కన్నీళ్ళను చూసి కంగారుపడిన శోభాదేవి - ఆయన కళ్లు తుడుస్తూ "ఛా! ఏమిటండీ యిది చిన్నపిల్లల్లా! నాకేమైంది? మరో మూడు వారాల్లో కట్టు విప్పవచ్చని చెప్పారు డాక్టర్. సింపుల్ ఫ్రాక్చర్. ఆ తర్వాత మామూలుగా తిరుగుతాను. దినేష్ వచ్చే నాటికి ఇల్లంతా యిలాగే వుండిపోతుందే అనే నా బాధ. ఇంకా సర్దించాల్సినవి వున్నాయి."

"మరేం ఫర్వాలేదు హర్షతో చెబితే అన్నీ చూసుకుంటుంది. నువ్వు దిగులుపడకు శోభా!"

"అవును, హర్షా మీరూ వుండగా నాకెందుకు దిగులు? ముందు మీరెళ్ళి స్నానంచేసి, ఆఫీసుకెళ్ళండి." అంటూ హడావుడి పెట్టింది శోభాదేవి. అయిష్టంగానే లేచారు రావుగారు.

రావుగారు క్రిందకి వెళ్ళగానే హాల్లో కూర్చొని పేపర్ తిరగేస్తున్న హర్ష గబగబా పైకి వెళ్ళిపోయింది.

"పాపం! అల్లరిగా గంతులువేసే హర్ష కూడా గంభీరంగా మారిపోయింది ఈరోజు" అనుకుంటూ బాత్‌రూమ్ వైపు అడుగులు వేశారు రావుగారు.

పైకి చేరుకున్న హర్షను ప్రక్కలో కూర్చోబెట్టుకొని "హర్షా నాకేం ఫర్వాలేదు. దినేష్ వచ్చేటప్పటికి నేను లేచి మామూలుగా తిరుగుతాను. అప్పటివరకూ నీకో బాధ్యత వప్పజెపుతున్నాను. మీ అంకుల్‌కు యింత వయసు వచ్చింది కానీ దినేష్‌కంటే అన్యాయం. తనకేం కావాలో ఆయనకే తెలీదు. అన్నీ టైమ్‌కు నేనందిస్తుంటే, అందుకోవడమే తెలుసు. పనివాళ్ళు ఎంతైనా యింటి మనుషులు కాలేరుగా. ఆయన టిఫిన్ సరిగ్గా చేయరు. భోంచేయరు. ఇప్పుడింక చెప్పనే అక్ఖర్లేదు. తనని గురించి తను అసలు పట్టించుకోరు. అందుకని ఈ మూడువారాలూ నువ్విక్కడే వుండి అన్నీ చూసుకోవాలి దగ్గరుండి. మీ నాన్నగారికి నేను చెప్పి పంపిస్తాను. ఆయనకు భోజనం మనింటి దగ్గరనుంచే కారియర్ పంపించే ఏర్పాటు చేస్తాను. నువ్వీ సాయం చేయాలి" అంటూ హర్ష చేతులు పట్టుకొని ప్రాధేయపడుతున్నట్లడుగుతున్న శోభాదేవి వైపు చూసిన హర్షకు కాదని చెప్పడానికి నోరు రాలేదు.

"అలాగే ఆంటీ! మీరు చెప్పినట్లే అన్నీ చూసుకుంటాను. మీరు నిశ్చింతగా వుండండి" అంది.

తృప్తిగా వూపిరి పీల్చుకుంది శోభాదేవి.

"ఊ! త్వరగా క్రిందికి వెళ్ళు. వంట మనిషి ఏదైనా టిఫిన్ చేసిందో లేదో కనుక్కుని, చేయకపోతే చేయించి, మీ అంకుల్ చేత తినిపించాలి. ఆ తర్వాత స్ట్రాంగ్‌గా ఓ కప్పు కాఫీ కలిపి యివ్వాలి" అంటున్న శోభాదేవి మాటలు నోట్లో వుండగానే పరుగులాంటి నడకతో క్రిందకు వెళ్ళిపోయింది హర్ష.

హడావుడిగా వంటింట్లో ప్రవేశించిన హర్ష అక్కడ టిఫిన్‌చేసే ప్రయత్నాలేవీ కనిపించకపోవడంతో వంటామెను అడిగింది.

"అమ్మగారు అలా పడి వున్నారు కదమ్మా! అయ్యగారినడిగితే నాకేం వద్దు అన్నారు. అందుకని ఏమీ చేయలేదు." ఆంటీ మాటలు ఎంత నిజం? వాళ్ళకేం పట్టింది? వద్దంటే వూరుకుంటారు అనుకొని గబగబా సేమ్యా వుప్మా చేయమని చెప్పి అంకుల్ గదివైపు వెళ్లింది. గబగబా ఆ ప్రయత్నంలో పడింది వంటామె.

రావుగారి రూమ్‌లో అడుగుపెట్టిన హర్షకు బాత్‌రూంలో నుంచీ షవర్ శబ్దం వినిపిస్తోంది. స్నానం చేస్తూనే "శోభా! టవల్‌తీసి పెట్టావా?" అంటూ కేక వేశారు.

గబగబా బీరువా దగ్గరకు వెళ్ళిన హర్ష పాంటూ షర్టూ, టై, కోటూ, కర్చీఫ్ అన్నీ మాచింగ్‌గా తీసి మంచం మీద పెట్టి మళ్ళీ వంట గది వైపు పరుగెత్తింది.

స్నానం చేస్తూనే అప్రయత్నంగా అలవాటు ప్రకారం శోభను కేకవేసిన రావుగారికి మొట్ట మొదటిసారిగా శోభ తనకెంత అవసరమో తెలిసి వచ్చింది. ఆమె లేకుండా ఒక్కక్షణం గడవదు. ఏం కట్టుకోవాలో కూడా తనకు తెలీదు. అన్నీ అమర్చి పెడితే అందంగా డ్రెస్ చేసుకోడం, రుచిగా తినిపిస్తుంటే తినడం తప్పించి, తనకు తనుగా ఏదీ కావాలని అడగటం అలవాటు లేదు. ఇన్నేళ్ళూ అలాగే గడిచిపోయాయి. ఇన్నాళ్ళకి విధి ఈ అంతరాయం కలిగించడం ఎంత అన్యాయం?

టవల్ చుట్టుకొని రూమ్‌లో అడుగుపెట్టిన రావుగారికి ఎప్పటిలా అన్నీ అమర్చిపెట్టి వుండటం చూసి ఆశ్చర్యమేసింది. గబగబా డ్రెస్ చేసుకొని హాల్లోకి వచ్చిన రావుగారికి ఎవరు తన డ్రెస్ అలా తీసిపెట్టారో అర్థంకాలేదు.

"అంకుల్ టిఫిన్ రెడీ" అంటూ ప్రవేశించిన హర్షను చూడగానే అర్థమైంది రావుగారికి "మీ ఆంటీ నీకె ట్రెయినింగ్ అంతా ఎప్పుడిచ్చింది హర్షా!" అన్నారు చిన్నగా నవ్వుతూ.

"ముందు టిఫిన్‌తినండి అంకుల్-ట్రెయినింగ్ విషయం తర్వాత మాట్లాడవచ్చు. టిఫిన్ ఆరిపోతే బావుండదు. మీరు తింటూ వుండండి, ఆంటీకి పెట్టి నిముషంలో వచ్చేస్తాను" అంటూ మరో ప్లేట్ తీసుకొని పైకి పరుగెత్తింది హర్ష.

శోభకు టిఫిన్ అందించి మంచినీళ్ళిచ్చి, "మీరు తింటూ వుండండి ఆంటీ, అంకుల్‌కు కాఫీ కలిపి యిచ్చి మీకూ తీసుకొస్తాను" అంది చిన్నగా నవ్వుతూ.

పాటిబండ్ల విజయలక్ష్మి

"హర్షా! నన్ను గురించి తొందరలేదు. అంకుల్ టిఫిన్ చేస్తున్నారు. దగ్గరే కూర్చోవాలమ్మా. లేకపోతే ఓ స్పూన్ తిని ఏదో ఆలోచిస్తూ మంచి నీళ్లు తాగేస్తారు."

"ఓ అయామ్ సారీ ఆంటీ!" అంటూ క్రిందకు పరుగెట్టిన హర్ష మంచినీళ్ళ గ్లాను చేతిలోకి తీసుకున్న రావుగారి చేతిలోనుంచి గ్లాసందుకుంటూ "అంకుల్ అదేవిటి? టిఫిన్ తినమని పెట్టాను, చూసి, మంచినీళ్ళు తాగమని కాదు" అంటూ నవ్వింది.

నవ్వుతూ మళ్ళీ టిఫిన్ ప్లేటందుకొని హర్ష చెప్పే కబుర్లు వింటూ టిఫిన్ పూర్తి చేశారు.

"ఒన్ మినిట్ అంకుల్" అంటూ లోపలికి పరుగెట్టిన హర్ష కాఫీ కప్పుతో ప్రత్యక్షమైంది.

నవ్వుతూ కాఫీ అందుకున్న రావుగారు, చిరు చెమటలు పట్టిన హర్ష ముఖంవైపు చూస్తూ "నువ్వూ తెచ్చుకో హర్షా కాఫీ" అంటుండగానే మా లక్ష్మి కాఫీ తీసుకొచ్చి హర్షకిచ్చింది.

కాఫీత్రాగి రావుగారు కారులో వెళ్ళిపోతుంటే చాలాసేపు అలాగే ఆయన వెళ్ళినవైపే చూస్తుండి పోయింది హర్ష.

*

రావుగారు మామూలుగా ఆఫీసుకెళ్ళి వస్తున్నారు. సాయంత్రం కొంతసేపు శోభతో కూర్చుని కబుర్లు చెప్పుకొని ఆ తర్వాత క్రింద తోటలోకి వచ్చి మొక్కలవైపు చూస్తూ కూర్చుంటారు. ఏదో ఆలోచిస్తూ మధ్య మధ్య హర్ష పలకరింపులతో పులిక్కిపడుతూ మళ్ళీ మామూలుగా నవ్వడానికి ప్రయత్నిస్తారు. ఆ రోజు డాక్టర్ చెప్పిన విషయం విన్న దగ్గరనుంచీ మనసు మనసులో లేదు రావుగారికి. యాంత్రికంగా హర్షను, శోభను బాధపెట్టడం యిష్టంలేక తిని తిరుగుతున్నా, మనసులో విపరీతమైన ఆందోళనగా వుంది. ఫ్రాక్చర్ చిన్నదే అయినా ఆ షాక్ నుంచీ శోభాదేవి కోలుకోలేదు. ఆమె ఆరోగ్యం రోజురోజుకూ క్షీణిస్తున్నట్లే వుంది. దానికి తగ్గట్టు రావుగారిని గురించిన ఆందోళన ఆమెను క్రుంగదీస్తోంది.

ఎంత మామూలుగా వున్నట్లు కనిపిస్తున్నా, రావుగారు మానసికంగా చాలా బాధపడుతున్నారు. మధ్య మధ్య నవ్వుతూ నవ్విస్తూ తిరిగే హర్షే లేకపోతే రావుగారికి పిచ్చెక్కి వుండేదేమో! తన శోభకు టి. బి. వుందని డాక్టర్ చెప్పిన దగ్గరనుంచీ ఏం చేయాలో పాలుపోవడంలేదు. టి. బి క్యూర్ చేయడం అంత కష్టమైన పనేమీకాదు ఈ రోజుల్లో. కానీ ఈ పరిస్థితుల్లో శోభకు ఆ విషయం తెలీకూడదు. తెలీకుండా మందులు వాడాలంటే అసాధ్యం. డాక్టర్ ఎలాగో ఆలోచించి తనే స్వయంగా టాబ్లెట్స్ తీసుకొచ్చి ఆవిడకిస్తూ యింజక్షన్స్ యిస్తూ ఏదో బలానికని చెప్పిమధ్య పెడుతున్నాడు. కానీ అలా ఎంతకాలం? ఏదో ఒకనాడు శోభకు ఈ భయంకరమైన నిజాన్ని చెప్పక తప్పదు. అంటు వ్యాధి కనుక జాగ్రత్తగా వుండమని చెప్పాడు డాక్టర్.

కానీ అదెలా సాధ్యం! శోభతో దగ్గరగా కూర్చుని మాట్లాడకుండా ఒక్కరోజైనా తను గడపగలడా? రోజూ రాత్రిపూట పాలు ఒకేగ్లాసులో యిద్దరూ పంచుకుని త్రాగటం అలవాటు. ఇప్పుడు తను క్రింద రూమ్‌లో పడుకుంటున్నాడు. ప్రక్క రూమ్‌లో హర్ష. పైన దినేష్ రూమ్‌లో శోభ పడుకుంటూంది. హర్ష పైనే ఆంటీదగ్గర పడుకుంటానంటుందేమో ఎలా వద్దని చెప్పాలా అని మదన పడ్డ రావుగారికి తను, 'ఆ ప్రక్క రూమ్‌లో పడుకో హర్షా' అనగానే తలవూపిన హర్షను చూసి తేలిగ్గా వూపిరిపీల్చుకున్నారు.

"శోభా! నీకేమైనా అవసరమైతే చూడాలంటే చిన్నపిల్ల హర్ష - రాత్రిపూటేం చేస్తుంది? వంటా

# చర్మ సౌందర్యం

శారీరక సౌందర్యానికి చర్మ ఆరోగ్యం చాలా అవసరం — అని అందరికీ తెలుసు. కాని అందుకు మనం తీసుకోవలసిన జాగ్రత్తలు — అలా జాగ్రత్త తీసుకోకపోవడం వల్ల వచ్చే వ్యాధులు, వాటి నివారణోపాయాలు మొదలైనవి మాత్రం చాలా మందికి అట్టే తెలియడం లేదు. ఒక రకమైన నిర్లక్ష్యం ప్రబలడం వల్ల మనం ఎన్నో చర్మ వ్యాధులకు గురికావలసి వస్తోంది.

బయటి వాతావరణానికి ప్రత్యక్షంగా గురి అయ్యేది; ఒత్తిడికి, ప్రభావానికి లోనయ్యేది మన శరీరంలో చర్మం మాత్రమే. చర్మవ్యాధులు రావడానికి ఇదే ముఖ్యకారణం. పైగా, మొటిమలు, కురుపులు మొదలైనవి పదిమంది కళ్ళుపడే చోట వచ్చాయంటే దానివల్ల కలిగే బాధ ఒకవంతయితే అది ఎదుటివారికి కనబడుతుందే అన్న మానసిక క్షోభ పదింతలుగా వుంటుంది. ఇది వాటితో బాధ పడేటప్పుడు మాత్రమే కాకుండా అవి మానిన తర్వాత కూడా వాటి స్థానంలో మానిపోని మచ్చలుగా, చిన్న చిన్న గుంటలు యేర్పడతాయి. కాబట్టి అవి రాకముందే తగు జాగ్రత్తలు తీసుకోడం, ఒకవేళ వచ్చినా వెంటనే తగు చర్యలు — తీసుకోడం, వైద్యచికిత్స చేయించుకోడం చాలా అవసరం. చర్మ ఆరోగ్యం గురించి తెలిపే వైద్య విభాగాన్ని ఆంగ్లంలో డెర్మటాలజీ (Dermatology) అంటారు.

చర్మం, గోళ్ళు, శిరోజాలు — వీటిని ఆరోగ్యంగా వుంచుకోవాలంటే వాటిని ఎప్పుడూ పరిశుభ్రంగా వుంచుకోవడమే దానికి మొదటి మెట్టు. ముఖ్యంగా పిల్లలను రోజుకు కనీసం రెండుసార్లు మంచి సబ్బుతో స్నానం చేయించడం మంచిది. మంచి షాంపూతోనో లేదా అభ్యంగ స్నానం ద్వారానో వారానికి రెండుసార్లు శిరోజాలను శుభ్రం చేసుకోవాలి.

గోళ్ళు మురికిగా వున్నట్లయితే అసహ్యంగా వుండడం మాత్రమేకాదు. సూక్ష్మక్రిములు నోటి ద్వారా జీర్ణాశయానికి చేరడానికి ఇవి దోహదం చేస్తాయి.

అతిప్రాచీన కాలం నుంచే స్త్రీలు అలంకార ద్రవ్యాలను ఉపయోగిస్తున్నారు. అలంకార ద్రవ్యాలు అందాన్ని ఇనుమడింపజేస్తాయి కూడా. అయితే, చర్మ ఆరోగ్యదృష్ట్యా వాటిని మానుకోమనడం సబబుకాదు. సాధ్యం కూడా కాదు నేటి ఆధునిక వనితలకు. కాబట్టి ఇక్కడ ఒక్క విషయం గుర్తుంచుకుంటే చాలు. ఘాటైన ఆమ్లాలు, కాస్టిక్‌సోడా మొదలైన రసాయనిక పదార్థాలు ఎక్కువగా వున్న సబ్బులు ఉపయోగించినట్లయితే అవి శరీరం నుంచి ప్రకృతి సిద్ధంగా స్రవించే నూనె పదార్థాలను పూర్తిగా పీల్చివేస్తాయి. చర్మం మరీ పొడిగా తయారవుతుంది. అంచేత మంచి రకాలను ఎంపికచేసి వాటినే వాడడం ఉత్తమం.

అందరూ గుర్తించుకోవలసిన మరొక ముఖ్య విషయం - అందం, ఆరోగ్యం అవినాభావ సంబంధం కలదన్న విషయం. అంచేత శక్తివంతమైన ఆహారం, తగినంత వ్యాయామం, విశ్రాంతి-శరీర ఆరోగ్యంతోపాటు అందానికి కూడా ఎంతో దోహదం చేస్తాయి.

మెను నీ గదిలో పడుకోబెట్టుకో '' అన్నారు.

శోభ జబ్బు విషయం తెలీని హర్ష ఆమెతో మరీ క్లోజ్‌గా వుండవచ్చు-అలా ఆ జబ్బు హర్షకు సంక్రమించవచ్చు. అందుకే ముందు ఆలోచనతో సాధ్యమైనంతవరకూ హర్షను శోభ రూమ్‌లో వుండనిచ్చేవారు కాదు. ఏదో పని చెప్పి క్రిందకు పంపించేవారు.

'' పాపం! హర్షను నా దగ్గర అయిదు నిముషాలన్నా వుండనివ్వరేమండీ '' అంది శోభ.

'' ఏవో జోక్స్ వేస్తుంటుంది. నువ్వు కదిలి కదిలి నవ్వుతావు - కాలు ఎక్కడ కదుపుతావోనని నా భయం '' అంటూ ముంగురులు సవరిస్తున్న రావుగారివైపు ఆప్యాయంగా చూస్తూ ఆ చేతిని తీసి పెదాలకంటించుకుంటుంది శోభాదేవి.

కళ్ళనిండా తిరిగిన కన్నీళ్ళను అదుపులోకి తెచ్చుకుంటూ ' యిప్పుడే వస్తాను శోభ ' అంటూ తప్పించుకుని క్రిందకి వెళ్ళిపోయేవారు.

ఉత్సాహంగా యింటిపెత్తనం చేస్తూ రావుగారికి అన్నీ అందిస్తున్న హర్షలో ఏదో అలజడి మొదలైంది.

మొదటినుంచీ రావుగారి మీద పెంచుకున్న ఆరాధన ఇప్పుడు వొంటరిగా శోభ బదులుగా తను సేవలు చేయడంతో మరింత ఆత్మీయత పెంచుకుంది. ఆయనకు టిఫిన్ పెడుతున్నా, కాఫీ అందిస్తున్నా, బట్టలుతీసి పెడుతున్నా ఏదో అవ్యక్తానందం కలుగుతోంది. ఆయనతో కబుర్లు చెబుతున్నా ఏదో మునుపెన్నడూ కలగని వో అతీతమైన ఆనందానుభూతి.

మైమరచినట్లు తనను అలాగే చూస్తుండిపోయే హర్ష చూపులు రావుగారిని ఇబ్బంది పెడుతున్నాయి. అసలే మానసికంగా బలహీనంగా వున్న ఆయనలో హర్ష చూపులు కలవరాన్ని కలిగిస్తున్నాయి.

హర్షలోనూ ఏమూలో తన భావాలూ, వూహలూ తప్పు అనే అభిప్రాయం అంతర్గతంగా రగులుతున్నా, రావుగారి సన్నిధిలో సర్వం మరచిపోయినట్లుండేది. అప్పుడు ఎవ్వరూ గుర్తు వచ్చేవారు కాదు. ఆయన ఆఫీసుకెళుతుంటే అలా చూస్తూ నుంచోడంలో ఏదో ఆనందం.

ఆ రోజు హర్ష మనసు వెర్రి ఆనందంతో గంతులు వేస్తోంది. కారణం రావుగారు ఆఫీసు కెళ్ళలేదు. శోభాదేవి రూమ్‌లోనూ కూర్చో లేదు. క్రింద ఆయన రూమ్‌లోనే పడుకొని వున్నారు. యాంత్రికంగా స్నానంచేసి డ్రెస్ చేసుకొని కూడా అలాగే పడుకున్నారు. ఎందుకో ఆయన మనసు ఆరోజు విపరీతంగా బాధపడుతోంది. శోభ దగ్గర నిజం దాచి ఆమెకు దూర దూరంగా తిరుగుతూ ఆమెను బాధపెడుతున్నానేమో అన్న బాధ ఆయన్ని సుఖంగా వుండనీయడం లేదు. అప్పటికే పది రోజులు గడిచిపోయాయి. హర్ష తమ యింట్లో ఒక మనిషిగా అయిపోయింది. ఈ ఆపద సమయంలో హర్ష లేకపోతే తను ఎంత యిబ్బంది పడవలసి వచ్చేది? ఆలోచిస్తూ పడుకున్న రావుగారు అడుగుల చప్పుడుకు తలెత్తారు. ఎదురుగా టిఫిన్ ప్లేట్ పట్టుకొని హర్ష కనిపించింది.

'' ఇవ్వాళ టిఫిన్ తినాలని లేదు హర్షా!'' అంటూ లేచి కూర్చున్న రావుగారివైపు ఆప్యాయంగా చూస్తూ—

'' ఎందుకని? ఈరోజు నా చేతుల్తో నేను స్వయంగా చేశాననా?'' అంటూ జుంగమూతి పెట్టిన హర్షను చూడగానే రావుగారికి ఛళ్ళున ఎవరో వీపున చరిచినట్లైంది.

సరిగ్గా యివే మాటలు శోభ నోట తను విన్నాడు. పెళ్ళయిన కొత్తలో స్వయంగా పేష్ట్‌లా తయారు చేసుకొచ్చిన వుప్మా చూసి తనన్న మాటకు యిలాగే అంటూ జుంగమూతి పెట్టిన శోభను దగ్గిరకు తీసుకొని ఆమెనే తినిపించమని నోరు తెరిచాడు.

అలాగే శోభ తినిపిస్తుంటే పేష్ట్ లాంటి ఆ వుప్మా అమృతంలా అనిపించి అంతా తినేశాడు.

ఓ క్షణం హర్షవైపు మైమరచి చూస్తూండిపోయిన రావుగారు అంతలోనే కళ్ళు వాల్చేసి, '' లేదు హర్షా! నిజంగా తినాలని లేదు '' అన్నారు.

'' ఏవిటి? నిజంగా నేను చేసింది తినాలని లేదా! నేను తినిపించి తీరతాను.'' అంటూ స్పూన్‌తో వుప్మాతీసి రావుగారి నోటి దగ్గర పెట్టింది. ఇంక రావుగారికి ఏం చేయాలో తోచలేదు.

తన వంట్లో వున్న శక్తినంతా కూడదీసుకొని గట్టిగా అరిచారు-'' వద్దని చెబుతుంటే నీక్కాదూ!'' అంటూ స్పూన్ నెట్టేయడంతో ప్లేట్ కూడా ఎగిరి దూరంగా పడింది.

ఒక్కసారి రావుగారివైపు బేలగా చూసిన హర్ష గుడ్ల నిండా నీరు కుక్కుకుని బయటకు పరుగెత్తింది.

*

అంతులేని బాధకు వుపశమనమేమిటో తెలీకుండా మంచం మీద పడి అలాగే వుండిపోయారు రావుగారు. మధ్యాహ్నం భోజనానికి పిలవడానికి వచ్చిన వంటామెతో ఓ కప్పు కాఫీ తెప్పించుకొని తాగి మళ్ళీ మంచం మీద వాలిపోయారు. అసలే అల్లకల్లోలంగా వున్న మనసును ఈ హర్ష సాన్నిధ్యం మరింత కల్లోలపరుస్తుంది. పాపం! కష్ట సమయంలో తమను ఆదుకున్న ఆ పిల్లను అలా విసిరి కొడితే ఎంత బాధపడిందో! తెలీక ఆ పిల్ల మూర్ఖత్వంగా ప్రవర్తించినా అనునయంగా సర్ది చెప్పాల్సింది పోయి అలా కసరికొట్టడం ఏం న్యాయం? ఆలోచనలతో జ్వర వేడెక్కిపోతుంటే నెమ్మదిగా ప్రక్క మీద నుంచి లేచారు రావుగారు.

హాల్లో అంతా నిశ్శబ్దంగా వుంది.

'' మాలక్ష్మీ!'' అంటూ పిలిచారు.

'' అయ్యా!'' అంటూ పరుగెత్తుకొచ్చింది పనిమనిషి.

'' హర్ష ఎక్కడుంది?'' అన్నారు.

''అమ్మగారికి అన్నం తినిపించి తమ గదికొచ్చి పడుకున్నారండి. అయ్యా! హర్షమ్మ పొద్దుటి నుంచీ ఏమీ తినలేదండీ '' కబురు చెప్పి నెమ్మదిగా తప్పుకుంది లక్ష్మి. హర్షవున్న గదివైపు అడుగులు వేశారు రావుగారు. మంచం మీద ఓ ప్రక్కకు వొరిగి పసిపాపలా నిద్రపోతోంది హర్ష. అప్పటి వరకూ ఏడ్చినందుకు గుర్తుగా కన్నీళ్ల చారికలు కనిపిస్తున్నాయి బుగ్గల మీద. విశ్రాంతిగా మూసుకొని వున్న ఆ రెప్పలతడి యింకా అలాగే వుంది.

ఓ క్షణం అలాగే చూస్తూ నుంచుని హాయిగా నిద్రిస్తున్న హర్షను లేపడానికి మనసు రాక చిరు చెమటలు పడుతున్న హర్ష ముఖంవైపు ఓసారి చూసి ముంగురులు సవరించి ఫానువేసి బయటకు వెళ్ళారు.

నెమ్మదిగా మెట్లెక్కి పైకి వెళ్ళారు. శోభాదేవి హాయిగా నిద్రపోతోంది. భోంచేసి టాబ్లెట్ వేసుకుంది కాబోలు వెంటనే నిద్రపట్టి వుంటుంది. అవన్నీ అలా టైమ్ ప్రకారం జరుగుతున్నాయంటే వాటికి మూలం హర్ష. హర్ష లేకపోతే ఏదీ సక్రమంగా జరిగి వుండేది కాదు. శోభతోపాటు తనూ ఓ బెడ్ మీద పడి వుండేవాడు. అలా తమకు అన్ని విధాలా సాయపడుతున్న హర్షను తనెంత క్రూరంగా అవమానించాడు?

పాపం తను ఎన్నడూ లేంది కోపంగా కసురుకో

## శిశువు — కొన్ని విశేషాలు



* తల్లి కడుపులో వున్నప్పుడే పాపాయి గుండె పనిచేయడం ప్రారంభిస్తుంది. అయితే శ్వాస కోశాలు మాత్రం బయటి ప్రపంచంలో పడ్డ తర్వాతే పనిచేయడం ప్రారంభిస్తాయి.

* పుట్టిన క్షణమే ఏడ్చే శిశువు నలభై రోజులు అయితేగాని నవ్వడం ప్రారంభించదు.

* పుట్టేటప్పుడు శిశువు శరీరంలో వుండే ఎముకల సంఖ్య రోజులు కాను కాను తగ్గిపోతుంది. కొన్ని ఎముకలు ఒకటితో ఒకటి కలిసిపోయి అతుక్కుపోవడమే దీనికి కారణం.

* తల్లి మాట్లాడే మాటలలో సుమారు వెయ్యి మాటలను బిడ్డ—మూడేళ్ళలో నేర్చుకుంటుంది. ఏడేళ్ళు నిండేటప్పటికి నాలుగువేల మాటలు తెలుసుకుంటుంది.

* పాపాయి నవ్వుతూ, సంతోషంగా వున్నప్పుడే కొత్త కొత్త విషయాలను చాలా సులభంగా చకచకా నేర్చుకోగల్గుతుంది.

గానే ఎలా బెదిరిపోయిందో! జాలిగా చూసిన ఆ చూపు గుండెల్ని కోసేస్తుంది. కానీ కానీ... ఏమిటో తనకే తెలీకుండా తనలో ఏదో విపరీతమైన మార్పు కనిపిస్తోంది. వీటన్నింటికీ కారణం శోభ అనారోగ్యం. ఆలోచిస్తూనే నెమ్మదిగా మెట్లు దిగి తన గదిలో ప్రవేశించిన రావుగారు మళ్ళీ బెడ్ మీద పడిపోయారు. శోభ కోలుకునే లోపల తను మంచమెక్కడు కదా! ఈ మానసిక సంఘర్షణతో ఏ పనీ చేయ బుద్ధికావడంలేదు. దానికి తగ్గట్టు అన్నివేళలా శోభకు బదులు హర్ష కనిపిస్తుంటే తన శోభ స్థానం మరెవరో బలవంతంగా లాగేసుకుంటున్నారనే అర్థంలేని ఆలోచన.

కళ్ళు మూసుకున్న రావుగారి కళ్ళవెంట ధారగా కారిపోతున్నాయి కన్నీళ్లు. ఇన్నాళ్ళు, శోభకు దగ్గరగా వుండి దూరంగా వుండటం ఎప్పుడూ జరగలేదు. ఈ ఆవేదన భరించరానిదిగా వుంది. ఆత్మీయులకు దగ్గరగా వుంటూ వారికి దూరంగా వుండవలసి రావడం కంటె ఘోరం మరొకటి లేదు. ఆలోచనలతో తల దిమ్మెక్కిపోతోంది. ఎంత టైమ్ గడిచిపోయిందో తెలీదు.

చల్లని చేయి నుదుటిమీద పడటంతో కళ్ళు విప్పి చూశారు. ఆ చేతిని అలాగే నుదుట నొక్కిపడుతూ మరో చేత్తో మంచం మీద కూర్చోబెట్టుకున్నారు. వచ్చింది హర్షని తెలుసు. కానీ ఆక్షణంలో తనకు మనశ్శాంతి నివ్వడానికి వచ్చిన దేవతలా కనిపించింది ఆ చిరువెలుగులో. గదిలో లైట్ లేదు.

మంచం మీద కూర్చున్న హర్షను తనే గుండెల మీదకు లాక్కున్నాడో హర్షే వాలిపోయిందో తెలీదు. మండుతున్న నిప్పులా వున్న రావుగారి శరీరం తగలగానే ఘనీభవించిన మంచు కరిగినట్లు కరిగిపోయిన హర్ష ఆయన్ను హత్తుకుపోయింది.

ఏం జరుగుతుందో తెలుసుకునే స్పృహ యిద్దరిలో లేదు. జరిగింది తెలుసుకునేసరికి రావుగారికి తన మీద తనకే అసహ్యం పుట్టింది.

అన్నెం పున్నెం ఎరుగని ఓ కన్నెపిల్ల బ్రతుకును నాశనం చేసిన కిరాతకుడా తను? ఇలా ఎందుకు జరిగింది? దీనికెవరు బాధ్యులు? తను తెలిసి చేసిన పాపానికి పరిష్కారమేమిటి? క్షణికావేశంలో తొందరపడి తప్పు చేసే వయసు కాదు తనది. తన ప్రేమతో, ఆరాధనతో తనని కరగించివేసిందా హర్ష? కొడుకు పెళ్ళీడుకొచ్చిన ఈ వయసులో తను చేసిన ఈ పాపానికి హర్ష బ్రతుకేమౌతుంది? ఈ విషయం తెలిస్తే శోభ తననెంత అసహ్యించుకుంటుంది? ఇన్నాళ్ళూ ఆదర్శమూర్తిగా వెలిగిన తన భర్త అసలు స్వరూపం యిదని తెలుసుకున్న క్షణంలో శోభ బ్రతికి వుంటుందా?

డాక్టరేట్ పుచ్చుకొని ఆనందంగా తిరిగి వస్తున్న కొడుక్కు తను ముఖమెలా చూపించగలడు?

*

రావుగారి రూమ్ నుంచీ పరుగెత్తిన హర్ష తన రూమ్‌లోకెళ్ళి పడింది. శరీరమంతా వింతగా కంపిస్తోంది. హృదయపు చప్పుడు తనకే భయం కలిగిస్తోంది. ఏం జరిగింది? తను రావుగారిని ఆరాధిస్తున్నట్లు మనసుకు తెలుసు. అంతేగానీ ఆయన సమక్షంలో అంత వివశత్వంతో బేలగా మారి సర్వం ఆయన కర్పించే బలహీనత తనలో వుందని ఆ క్షణం వరకూ హర్షకు తెలీదు.

ఓ ప్రక్క ఏదో తెలీని ఆనందం. మరో ప్రక్క అంతులేని ఆవేదన. తన మనసేమిటో తనకే తెలీకుండా పోయింది. రావుగారి సమక్షంలో ఎంత నిశ్చింతగా ప్రశాంతంగా అనిపించింది?

ఆ నిశ్చింత ఏమైంది? ఆ ప్రశాంతత ఎక్కడ దాక్కుంది? తను తప్పు చేసిందా? తను మనస్ఫూర్తిగా ఆరాధించే మూర్తికి సర్వస్వాన్నీ అర్పించడం తప్పెలా అవుతుంది? జరిగిందానికి నేను బాధపడితే నా ప్రేమ పవిత్రమైనదెలా అవుతుంది?

నిజానికి ఆయన తప్పేం లేదు. అనుక్షణం తను కవ్విస్తున్నా తప్పించుకుంటూ తననెంతో అభిమానంగా చూసేవారు. శోభ ఆంటీ అంటే ఆయనకెంత ప్రేమ వుందో తను కళ్ళారా చూసింది. ఆమె ప్రేమలో—ఆవిడ అనారోగ్యంగా వున్నదన్న ఆవేదనలో ఆయన పిచ్చివాడుగా మారడం తను సహించలేకపోయింది.

ఆయనకు శోభ ఆంటీ మీద ప్రేమ ఎంతటిదో తనకు ఆయన మీద ప్రేమ అంతటి గొప్పది. అందుకే ఆయన్ని అనుక్షణం అంటిపెట్టుకొని తిరిగింది. ఆయన విసుక్కున్నా సహించింది. ఇలా సాగుతున్నాయి హర్ష ఆలోచనలు.

*

వాళ్ళలా ఆలోచనల్లో వుండగానే తెల్లవారింది. హర్ష మామూలుగా లేచి శోభ ఆంటీకి పాలు తీసుకెళ్ళి యిచ్చింది. ఆమె ఆప్యాయంగా నవ్వుతూ పాలందుకుంటుంటే హర్ష ఏదోగా ఐపోయి, తల వంచుకుంది.

"హర్షా! మరో నాలుగు రోజులు వోపికపట్టు.... మా దినేష్ వచ్చేస్తే నీకింత అవస్థ వుండదు. తోచకపోవడమూ వుండదు. వాడు ఇరవైనాలుగు గంటలూ కబుర్లు చెప్పమన్నా చెబుతాడు. నీకు మంచి కాలక్షేపం దొరుకుతుంది." అంది శోభాదేవి నవ్వుతూ.

[సశేషం]

# చందన ఒయ్యారంలో ఒలిగే సౌందర్యం

గోకుల్ మీకు ఇచ్చేది చక్కని తాజా సౌందర్యం, నూతనమైనది. మైక్రోఫైన్ పద్ధతితో తయారు చేయబడినది. పరిశుద్ధమైన చందనం, అద్భుతమైన మూలికలు, ఇతర సువాసన ద్రవ్యములు చేకూర్చ బడినది.

గోకుల్ పౌడరు వాడండి
సౌందర్య దేవతగా ఒలగండి!

**గోకుల్**




సాన్‌టాల్ & సాన్‌డల్‌వుడ్ పౌడరు

**టి. యస్. ఆర్. & కంపెనీ, మదరాసు**

ప్రత్యేక తయారింపు

టి. యస్. ఆర్. & కంపెనీ, రామాపురం మదరాసు 600 089



ADWAVE-TSR 692/TEL R

# ఈ తరం భారత నారి

## పరిశీలన

ఒక జాతి జీవన విధానాన్ని ప్రభావితం చేసేది ఆ జాతి జనుల తరతరాల సంప్రదాయాలు. ప్రజల నరనరాలలో జీర్ణించుకుపోయిన సంస్కృతి వారి ఆలోచనా సరళికి మౌనంగా మార్గం చూపుతుంది. మన దేశంలోని స్త్రీల ప్రస్తుత స్థితికి భారతీయ సంస్కృతి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఎంతో కొంత కారణం అయిందనే చెప్పాలి.

ప్రసవానికి ముందు మామూలుగా ప్రతి భారత నారి కోరుకునేది మగబిడ్డనే. ఎందుకంటే— వంశోద్ధారకుడు వాడే గనుక. ఆడపిల్ల పుడితే ఒక వేడి నిట్టూర్పు. పెంచడంలో కూడా ఒకరకమైన పక్షపాతం. ఆరోగ్య పరిరక్షణలో మగపిల్లల పట్ల చూపే జాగ్రత్త ఆడపిల్లల పట్ల కూడా చూపడం చాలా అరుదు. ఏదైనా జబ్బు చేస్తే — డాక్టర్ అందుబాటులో లేనప్పుడు, ముఖ్యంగా పల్లెటూళ్లలో "రెండు రోజులైతే అదే సరిపోతుంది" అన్న నిర్లక్ష్య వైఖరి కనిపిస్తుంది. శిశువుల మరణ జాబితాలో ఆడ పిల్లలే అధిక సంఖ్యలో వుండడం ఈ ఉదాసీన ధోరణికి ఒక నిదర్శనం. దీనివల్లనే— పుట్టడం ఇంచుమించు సమానంగా వున్నప్పటికీ— జనాభాలో పురుషులే ఎక్కువగా వుంటున్నారు.

చదువుకునే ప్రాయంలో ఆడపిల్లల కన్నా మగపిల్లలే ఎక్కువగా విద్యకు అర్హులుగా పరిగణింపబడుతున్నారు. తల్లిదండ్రుల దృష్టిలో మగపిల్లలే ముందు ముందు సంపాదించి కుటుంబాన్ని పోషించే ప్రయోజకులుగా వుండడమే దీనికి కారణం. ఆడ కూతురయితే రజస్వల కాగానే పెళ్ళి ప్రయత్నాలు; పెళ్ళయిన తర్వాత కుటుంబ నియంత్రణ అవసరమో— దానిని పాటించాలనే పరిజ్ఞానమో లేకపోవడం వల్ల, స్తోమతకు మించిన పిల్లల్ని కనడం, వారిని సరిగా పెంచలేక లేమితో కొట్టుమిట్టాడుతూ వయసు నిండీనిండకముందే తనువు చాలించడం- ఇదీ మన పుణ్యభారత భూమిలో నూటికి తొంభై మంది స్త్రీల జీవిత చక్రం పరిభ్రమించే విధానం!

న్యూనతాభావం స్త్రీలలో తోబుట్టువులా పీడిస్తుంది. దానికితోడు వారిపట్ల సమాజం ప్రదర్శించే ఉదాసీనత, తిరోగమన భావాలు వారిని ఏ రంగంలో కాని ముందడుగు వేయనీయక క్రుంగదీస్తున్నాయి.

స్త్రీ గాని, పురుషుడు గాని ఏ రంగంలోనైనా ముందుకు అడుగు వెయ్యాలంటే మొదట ఆర్థిక స్వాతంత్ర్యం కావాలి. జీవన భవనానికి ధనమే పునాది. ఆ పునాది వేయడానికి మనిషి తెలివితేటలు, శక్తిసామర్థ్యాలు చాలా సహకరిస్తాయి. తెలివితేటలు పెంపొందడానికి కొత్త శక్తిసామర్థ్యాలు వికసించడానికి చదువు సంధ్యలు ఎంతో దోహదం చేస్తాయి.

ప్రపంచంలో కల్లా పెద్ద ప్రజాస్వామ్య దేశంగా మన దేశాన్ని చెబుతారు. లెక్కింపలేనన్ని రాజకీయ పక్షాలు, పరస్పర విరుద్ధాలైన లక్ష్యాలు — వాటి కనుగుణంగా సిద్ధాంతాలు. వీటన్నిటినీ ఆకళింపు చేసుకుని మనం వేసే ఓటు మనం భవిష్యత్తుకు వేసే బాట అవుతుంది. అంచేతే ప్రజాస్వామ్యంలో ప్రతి పౌరుడూ భాగస్వామి అంటారు. ఇటువంటి బాధ్యతాయుతమైన పాత్ర సక్రమంగా నిర్వహించాలంటే రాజకీయ అవగాహన, సామాజిక స్పృహ ఎంతైనా అవసరం. అలాంటి అవగాహనకు దోహదం చేసేది విద్య. అందువల్ల విద్యాగంధం గల వనితలు మనలో ఎందరో తెలుసుకుందాం.

1971 సం॥ జనాభా లెక్కల ప్రకారం, మనలో చదువనూ, రాయనూ తెలిసినవారు నూటికి ముప్పై మంది మాత్రమే! అక్షరజ్ఞానం వున్న స్త్రీలు ఇరవై శాతం మంది మాత్రమే. ఇందులోనూ పట్టణ ప్రాంతం వనితలే ఎక్కువ. అప్పటి మొత్తం మూడు వందలా అరవై జిల్లాలలో — నూటఇరవైఅయిదు జిల్లాలలో నూటికి ముగ్గురూ లేక నలుగురు స్త్రీలకు మాత్రమే చదువు పరిమితమయింది. మిగతా నూరు జిల్లాలలో అక్షరాస్యుల సంఖ్య తొమ్మిదిశాతం మాత్రమే. మాతృభాషలో నైతం మూడు ముక్కలు ఉత్తరం రాయడానికి కూడా చేతగాని దైన్యస్థితిలో వున్నవారు — భావిభారత భాగ్యవిధాతలు! మూడు దశాబ్దాల సర్వతంత్ర రాజకీయ స్వాతంత్ర్యానికి తర్వాత కూడా ప్రగతి — ఎక్కడవేసిన గొంగళి అక్కడే — అన్న నానుడికి ఉదాహరణగా నిలిచి వుంది! కదిలించలేని మహా పర్వతంలా ఈ నిరక్షరాస్యత సమస్య వుండడానికి కారణం — చదువుకోవలసిన ప్రాయంలో తల్లిదండ్రులకు ఇంటి పనులలో సాయపడడంలోనూ వాళ్ళు పొలాలకు పనులకు వెళ్ళినప్పుడు తమ్ముళ్ళను, చెల్లెళ్ళను ఆడించుకోవడంలోనూ గడచిపోవడమే. వాడవాడలా విలయ తాండవం చేసే లేమే—ఈ అసహాయస్థితికి కారణం.

అయినా అతిరథ మహారథులుగా కీర్తించబడే మన ప్రజాస్వామ్య రథసారథులు, మన జాతి నేతలు స్త్రీజాతి పురోగతికి అసలు ఏమీ చేయనే లేదా? అంటే—చేశారు. భారత రాజ్యాంగ చట్టంలో పురుషులతోపాటు స్త్రీలకు కూడా అన్ని రంగాలలోనూ సమానమైన హక్కులు, అవకాశాలూ కల్పించారు. కానీ, అవన్నీ కేవలం పుస్తకాల పుటల్లో చట్ట నిర్ణేతల హృదయాలలో మాత్రం విహరించే పావురాలుగా వుంటున్నాయి. నిజ జీవితాలలో నిస్తేజంగా - నిర్వీర్యంగా వుంటున్నాయి.

గత ముప్పై సంవత్సరాలుగా ఏ రంగంలో చూసినా ఏదో ఒక చలనం కనబడుతూనే వుంది. ఉదాహరణకు కుటుంబ నియంత్రణ విషయమే తీసుకుందాం. పల్లెప్రాంతాలలో అంత తీవ్రంగా ప్రచారం చేసి అమలు జరపకపోయినప్పటికీ— ఆ నినాదాలు రోజూ అక్కడక్కడా వింటూనే వుంటాం. కానీ మన అమ్మాయిలు పసి ప్రాయంలోనే పెళ్ళిళ్ళు చేసుకుని పాతికేళ్ళయేసరికల్లా అయిదారు మందిని కనేస్తున్నారు. ప్రస్తుతం మన దేశ జనాభా అరవైకోట్ల ఇరవైఅయిదు లక్షలు. యేటా ఒక కోటి ముప్పైలక్షలు పెరుగుతూంది. ఇదేరీతిలో ఈ పెరుగుదల సాగితే ఈ శతాబ్ది అంతానికి తొంభైకోట్ల ఏభైలక్షలు అవుతుంది. వచ్చే శతాబ్దారంభంలో నూరు కోట్ల జనాభాను అందుకుంటాము. సామాన్య జీవన రీతిని క్లిష్టతరం చేసే ఈ సమస్య పరిష్కారానికి స్త్రీలే ముందుకు రావాలి. ఇద్దరు సంతానం కల్గగానే దానికి కాస్తా వీడ్కోలు పలికి దేశసౌభాగ్యం పెంచడానికి ప్రతి స్త్రీ నడుం కట్టాలి. దానికి కావలసిన వాతావరణం

సృష్టించి మార్గం యేర్పరచ వలసిన బాధ్యత ప్రభుత్వం మీద – ప్రణాళికా కర్తల మీదా, చట్ట నిర్ణేతలమీద, పదవుల్లో వుంటూన్న పెద్దల మీదా ఎంతైనా వుంది.

కుటుంబ నియంత్రణపథకం ద్వారా తల్లీ పిల్లల ఆరోగ్యానికి భద్రత చేకూరడమేకాదు. దీని ద్వారా పసిబాలల రేపటి వసంతానికి రూపురేఖలు దిద్దడం కూడా సాధ్యమవుతుంది.

గర్భనిరోధం, గర్భస్రావం ఒకవైపు చట్టబద్ధం చేయబడింది. మరోవైపు ఎందరో అభాగినులు ఆత్మహత్యలు చేసుకోడం జరుగుతూనే వుంది. ఎందుకంటే ఇటువంటి సదుపాయం వుందనే విషయం సామాన్యస్త్రీలకు తెలియదు. తెలిసినా డాక్టర్‌ను సంప్రదించడానికి, చికిత్స పొందడానికి కావలసిన సామాన్యమైన తెలివితేటలు, తెగింపు కూడా వాళ్ళల్లో కరువవుతూంది.

వరకట్ననిషేధ చట్టం కూడా అమలులో వుంది. కానీ అది నిజజీవితంతో అసలు సంబంధం లేకుండా వుంది.

గట్లుతెగిన దాహాలతో వచ్చేవారిచేత తమ దేహాలను తూట్లు చేసుకునే వ్యభిచారం ఒక ఎత్తైతే – నాగరికత ముసుగులో, మరో రకమైన వ్యభిచారం బాహాటంగా సాగుతూనే వుంది. లైంగిక ఆకర్షణకు సంకేతంగా స్త్రీని, ఆమె బొమ్మలను, ఛాయాచిత్రాలను సినిమాలలో, వ్యాపార రంగాలలో ఉపయోగించుకోవడమే — అది!

కష్టనష్టాలకు ఓర్చుకుని చదివి పట్టాలు సాధించినప్పటికీ స్త్రీలకు అన్ని రంగాలలో పురుషులకు సరిసమానంగా ఉద్యోగావకాశాలు వుండడం లేదు. విద్యావంతులైన వనితలు చాలామంది పంతులమ్మలుగా, నర్సులుగా, లేదా డాక్టర్లుగా వుండడానికే మొగ్గు చూపుతూ వుంటారు. వైద్యవృత్తిలో కూడా గర్భసంబంధమైన చదువులు, కాన్పుకు, ప్రసూతి విషయాలకు, శిశువైద్యం (గైనకాలజీ, ఆబ్స్టటర్‌ట్రిక్స్, పిడియాట్రిక్స్) లాంటి శాఖలకే పరిమితమౌతున్నారు. కానీ ఇంజనీరింగ్, చట్టం, ప్రణాళికా సంఘాలు, వ్యాపారరంగం మొదలైనవాటిలో స్త్రీల ప్రాతినిధ్యం పేరుకుమాత్రమే కనబడుతూ వుంటుంది.

పురుషులకు సమానంగా స్త్రీలకు ఉద్యోగావకాశాలు లేకుండా పోవడానికి కారణం—డబ్బు సంపాయించి కుటుంబభారం మోసేది మగవాడే అన్న భావం మనలో బాగా నాటుకుపోడమే అనవచ్చు. కుటుంబ బాధలతో సతతం సతమతమౌతూండడం వల్ల స్త్రీలు బాధ్యతాయుతమైన, ప్రతిభావంతమైన ఉన్నతోద్యోగాలు సక్రమంగా నిర్వహించలేరనే అపోహ కూడా ఒక కారణంగా చెబుతారు.

మారుతూన్న కాలగతితోపాటు సమాజంలో స్త్రీల స్థానం కూడా మార్పు చెందుతూ వుంది. పెరుగుతూన్న జీవన ప్రమాణంతో పోటీపడి జీవనవ్యయం విపరీతంగా పెరిగిపోతూ వుంది. ఇలాంటి క్లిష్టసమయంలో ఆలుమగలు ఇద్దరూ సంపాయిస్తే తప్ప సంసారశకటాన్ని ముందుకు లాగలేము.

ఇకపోతే, కొందరి విషయాల్లో మగపిల్లల్లా తల్లిదండ్రులను పోషించవలసిన గురుతర బాధ్యత యేర్పడుతున్నది. మరి కొందరు కొన్ని అనివార్య పరిస్థితులవల్ల భర్త నుంచి విడిపోయి తమ బ్రతుకు తామే బ్రతుకవలసి వస్తూ వుంటుంది. అలాంటప్పుడు స్వయం సంపాదన అవసరం చెప్పవలసిందిలేదు. ఇంకా కొందరి పరిస్థితి మరీ దారుణం. భార్య సంపాయించినా భర్త అనుమతి లేకుండా తన సంపాదనను తానే వినియోగించుకోడానికో, తన్ను కని పెంచి పెద్ద చేసిన తల్లిదండ్రులకు ఇవ్వడానికో పెనిమిటి అనుమతి పొందవలసి వుంటుంది. ఇది ఈనాటి స్త్రీలకు యేర్పడ్డ ఒక సామాజిక నిర్బంధం! అయినా ఇది వేరే విషయం! అంచేత స్త్రీలకు సంపాదన అంత ముఖ్యం కాదు అనడం అర్థరహితం. అదేవిధంగా స్త్రీలు స్వతహాగా అంత ప్రతిభావంతులు కారనడం కూడా అబద్ధం!

ఎందుకంటే చదువు సంధ్యలలో తెలివి తేటలు ప్రదర్శించి అమ్మాయిలే అబ్బాయిల కన్నా ఎక్కువ మార్కులు సంపాదిస్తున్నారు.

అంచేత వనితలు కూడా సరియైన విధంగా అన్ని రంగాలలోనూ ప్రవేశించడానికి అవకాశాలు

అమెరికాలోని పామ్‌బీచ్ పట్టణంలో బెర్తా ఆడమ్స్ అనే బిచ్చగత్తె యిటీవల మరణించింది. ఆమె మరణానికి కారణం- ఆమె సరైన ఆహారం భుజించక పోవడం! ఇందులో ఆశ్చర్యమేముందని ఆశ్చర్యపోతున్నారా .... అయితే అసలు సంగతి యిది....

బెర్తా ఆడమ్స్ చనిపోతూ—ఎనిమిది లక్షల డాలర్లు (అంటే దాదాపు డెబ్బైరెండు లక్షల రూపాయలు) ధనరూపంలోనూ, మరో నలభై వేల డాలర్లు, షేర్ల రూపంలోనూ విడిచిపెట్టి వెళ్ళిందిట!

"మా ఇంటి వెనక గుమ్మం దగ్గరకి వచ్చి ముష్టెత్తుకునేది. కాని తను బీదది కాదని చెప్పేది." అని ఒకామె చెప్పింది.

ఇంకో పొరుగింటావిడ – 'ఆడమ్స్‌కి అంత ధనం వుందని తనకు తెలియదని గూడులాంటి యింట్లో చింకి బట్టలు కట్టుకుంటూ వుండేదని, ఆకలితో మాడుతుంది.' కాని పైసా తిండికి ఖర్చు పెట్టేది కాదని తనకు తెలిసింది చెప్పింది.



బెర్తా ఆడమ్స్ బ్యాంకు ఎకౌంట్‌కి వారసుల్ని వెతికే పని రాబర్ట్ లెయిట్ అనే లాయరు పుచ్చుకున్నాడట. ఓ మేనకోడల్ని, మేనల్లుడిని అతను ఇంతవరకు ఆమె వారసులుగా కనిపెట్టగలిగాడట. డెబ్భయిఒక్కఏళ్ళ బెర్తా ఇంత ధనం ఎలా సంపాయించిందన్నది ఒక పెద్ద మాయాజాలంగా వుందంటున్నారు ఈ వింత విన్నవాళ్ళందరూ. ఇంతకీ అదృష్టవంతులెవరూ అంటే – ఆ మేనకోడలూ.... మేనల్లుడూనూ....

కల్పించాలి. ఉన్నత ఉద్యోగాలలో పెద్ద పదవులలో స్త్రీలు రావాలంటే అది వట్టి మాటలతో సాధ్య పడదు. వారికని ప్రతి శాఖలోనూ ప్రత్యేకంగా కొన్ని స్థలాలు కేటాయించాలి.

ఇక్కడ మరో విషయం కూడా గమనించడం అవసరం. గొప్ప చదువులు - వైద్యంలాంటి వృత్తి విద్యలు చదువుకున్న కొందరు - తమ పెనిమిటి సంపాదనే కావలసిన దానికన్నా ఎక్కువగా వుంది, అందువల్ల తాము ఉద్యోగం చేయవలసిన అవసరమో; నిర్బంధమో లేదు - అంటూ వుంటారు. మరి— వారి విద్యకోసం - వృత్తి విద్యా బోధనకు లక్షలాది ప్రజల పైకం ప్రభుత్వం ఖర్చు చేసింది కేవలం బూడిదలో పోసిన పన్నీరా? లేక సముద్రంలో కురిసిన వర్షమా? అన్న సందేహం యేర్పడుతుంది అందువల్ల అటువంటి వారు తమ చేతనైన సాయం, ప్రజాసేవ చేయవలసిన కనీస కర్తవ్యం తమ సామాజిక బాధ్యతగా గుర్తించి మసలుకోడం ఎంతైనా శ్రేయస్కరం!

ఇవాళ ఏ పత్రిక తిరగవేసినా రచయిత్రుల కథా తోరణాలు, వ్యాసపద్మాలు. కవితా లహరులే దర్శనమిస్తున్నాయి. ముఖ్యంగా తెలుగు పత్రికలలో రచయిత్రుల సీరియల్ కథలు ఒక ప్రత్యేకమైన ఆకర్షణ, 'హైలైట్'గా వుంటున్నాయి. ఇది సంతోషించదగ్గ విషయమే. కాని మన రచయిత్రులలో చాలామంది అల్లే కథలు పాఠకులను ఊహా లోకాలలో విహరింపజేసి, నిజ జీవితంలో ఎందుకూ కొరగానివారిగా తయారుచేస్తున్నాయి. ముందు ముందైనా సామాజిక స్పృహతో పాఠకులలో నూతన చైతన్యం, భావ విప్లవం, ఉత్తేజం కల్గింపజేసే ఉత్తమ రచనలు వెలువడాలి!

పట్టణాలలోను, నగరాలలోను నివసించే వారు మాత్రమే కాదు - పల్లెటూళ్ళలో ఉండేవారు కూడా వనితలే. మనదేశంలోని స్త్రీలలో నూటికి ఎనభై అయిదు మంది గ్రామాలలోనే వుంటున్నారు. వారి స్థితి మరీ అధ్వాన్నంగా వుంటోంది. పల్లె ప్రజానీకంలో సుమారు నూటికి ఎనభై మందికి వ్యవసాయమే జీవనోపాధి. అందులో ముఖ్యంగా ఎక్కువమంది వ్యవసాయ కూలీలుగానే వుంటున్నారు. వీరి పరిస్థితి ఏమాత్రం సంతృప్తికరంగా లేదు!

శివకాశి అగ్గిపెట్టెల పరిశ్రమ, బాణాసంచా తయారీ, ఉత్తర భారతదేశంలో లక్నో ప్రాంతంలో జరిగే అల్లికల పరిశ్రమ మొదలైన వాటిలో స్త్రీలే ఎక్కువ సంఖ్యలో వుంటున్నారు. కాని ఇక్కడ కూడా వారికి తగ్గ న్యాయం జరగడం లేదు. మధ్యవర్తుల ద్రోహానికి, వంచనకు దోపిడీకి గురవుతున్నారు. ఉదాహరణకు కర్నూలు, వేలూరు ప్రాంతాలలో జరిగే బీడీల పరిశ్రమనే తీసుకుందాం. మధ్యవర్తులు ప్రత్యేకమైన బళ్ళలో ఇంటింటికి బీడీ ఆకు, పొగాకు సరఫరాచేసి సాయంత్రం వచ్చి చుట్టిన బీడీలను తీసుకు వెళ్తుంటారు. సాయంకాలం వచ్చేప్పుడు మధ్యవర్తులు తాము ఉదయం ఎక్కువ పొగాకును, బీడీ ఆకులను ఇచ్చినట్టు చెప్పి, నోరులేని కూలి జనాన్ని దబాయించడం పరిపాటిగా వుంది. ఈ అన్యాయాన్ని ఎదుర్కోడానికి ఎవరికీ ధైర్యం చాలడం లేదు. అడిగితే అసలు ఇవ్వకుండానే పోతాడేమోనని భయం....

ఇలా పరిశీలిస్తూపోతే లెక్కలేనన్ని సమస్యలు ఎదురౌతూనే వుంటాయి. వీటి పరిష్కారానికి మంచి పథకాలు, ఆ పథకాలు నెరవేరడానికి కార్యదీక్ష, మంచి అవకాశం కావాలి. అధికారం లేకుండా అవకాశాలకోసం అర్రులు చాచడం అమాయికతకు చిహ్నం! ఇది గత చరిత్ర నేర్పిన గుణపాఠం. అందువల్ల పంచాయతీ సభ్యులుగా, మ్యున్సిపాలిటీ మెంబర్లుగా, శాసనసభ, పార్లమెంటు సభ్యులుగా, మంత్రులుగా, అధికారిణులుగా, చట్టనిర్ణేతలుగా వనితలు రావాలి. అప్పుడు జరగవలసిన పని కొంత సులభం అవుతుంది. సన్మానాలకు, పత్రికలలో ఛాయాచిత్రాలకు మాత్రమే స్త్రీ సేవా సమాజ కార్యక్రమాలు పరిమితం కాకుండా నిర్మాణాత్మక మార్గంలో పయనించడానికి ఇలాంటి ప్రయత్నం చెయ్యాలి.

నాణానికి బొమ్మ, బొరుసులాంటి వారు జీవితానికి ఆడ, మగ. అందువల్ల వనితా జనోద్ధరణకు పురుషులు కూడా బద్ధకంకణులు కావాలి. సిరిసంపదలతో జన్మించి, ఐశ్వర్యాల మధ్య అల్లారు ముద్దుగా పెరిగినవారు ఎందరో - పేదరికంలో విలవిలలాడే వారిని చూసి కన్నీళ్ళు కార్చారు. హెచ్చుతగ్గులు లేని సమ సమాజ స్థాపనకోసం ప్రపంచంలో రావలసిన మార్పు కోసం చేయవలసిన కృషిని గురించి ప్రజావళికి వివరించి మార్గదర్శకులయ్యారు. అదే విధంగా స్త్రీ జనోద్ధరణకు పాటుబడిన త్యాగమూర్తులు కూడా ఎందరో వున్నారు. అయినా ఇప్పుడు కావలసిందల్లా ఒక్కటే. అదే—ప్రతి ఒక్కరి సమిష్టి కృషి! ☐

—బాల



## పిల్లల్ని తీర్చిదిద్దటం ఎలా?

☐ పిల్లలతో నవ్వుతూ, సరదాగా వుండండి. వాళ్ళకి ఏ ఇబ్బంది వచ్చినా, మీకు చెప్పేలా చేసుకోండి. మనసు విప్పి చెప్పుకోక పోతే పిల్లల మానసికస్థితి దెబ్బ తింటుంది.

☐ మీ పిల్లలకు ఏదైనా ప్రత్యేకమైన ఆసక్తి, అభిరుచి, హాబీ వంటిది వుంటే వాటిని ప్రోత్సహించండి. వీలున్నప్పుడల్లా మీరూ అందులో పాలు పంచుకోండి.

☐ పిల్లల చేత ఏ పనైనా చేయించుకోవాలంటే బెదిరింపుల కంటె నెమ్మదిగా చెప్పి చేయించండి.

☐ తాము ఫలాన పనులు చేయగలమన్న ఆత్మ విశ్వాసం వారికి కలిగించండి. పిల్లలకు వీలైనంత స్వాతంత్ర్యం ఇవ్వండి. ఇలా చేయడం వల్ల తమ బాగోగులేమిటో వాళ్ళే అనుభవం మీద తెలుసుకుంటారు.

☐ మీరు చెప్పదలచుకున్న వాటిని చేసి చూపండి. పిల్లలు మంచినీ, చెడునీ కూడా తెలియకుండా అనుకరిస్తూ వుంటారు. అంచేత వాళ్ళు మీలోని మంచినే అనుకరించేలా చెయ్యండి.

☐ మీ పిల్లలకి మీ అండ వుందనే ధైర్యం కలిగించండి. పిల్లల్ని తలిదండ్రులే దూరంగా వుంచితే వాళ్ళు ఒక విధమైన 'కాంప్లెక్సు'కు గురై ఎందుకూ పనికి రాకుండా పోతారు.

☐ ఎప్పటికప్పుడు పిల్లల చదువు గురించి, బడిలో పరిస్థితుల గురించీ ఏవైనా సమస్యలుంటే తెలుసుకుంటూ వుండండి.

☐ మీరు, మీ భర్తా కూడా ఒకరినొకరు బాగా అర్థం చేసుకుని, పిల్లల ముందు తిట్టుకోకుండా, పోట్లాడుకోకుండా వుండడం మంచిది. తల్లిదండ్రుల ప్రవర్తనే పిల్లలను తీర్చిదిద్దుతుందన్న విషయం మరచిపోకండి!

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠి | గుజరాతి | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| చ | ச | ಚ | ച | च | ચ | ଚ |
| చా | சா | ಚಾ | ചാ | चा | ચા | ଚା |
| చి | சி | ಚಿ | ചി | चि | ચિ | ଚି |
| చీ | சீ | ಚೀ | ചീ | ची | ચી | ଚୀ |
| చు | சு | ಚು | ചു | चु | ચુ | ଚୁ |
| చూ | சூ | ಚೂ | ചൂ | चू | ચૂ | ଚୂ |
| చృ | — | ಚೃ | — | चृ | ચૃ | ଚୃ |
| చౄ | — | — | — | — | — | — |
| చె | செ | ಚೆ | ചെ | — | — | — |
| చే | சே | ಚೇ | ചേ | चे | ચે | ଚେ |
| చై | சை | ಚೈ | ചൈ | चै | ચૈ | ଚୈ |
| చొ | சொ | ಚೊ | ചൊ | — | — | — |
| చో | சோ | ಚೋ | ചോ | चो | ચો | ଚୋ |
| చౌ | சௌ | ಚೌ | ചൗ | चौ | ચૌ | ଚୌ |
| చం | — | ಚಂ | ചം | चं | ચં | ଚଂ |
| చః | — | ಚಃ | ചഃ | चः | ચઃ | ଚଃ |

[వచ్చే సంచికలో మరికొన్ని]

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు–44' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు ఫిబ్రవరి 25వ తేదీలోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దు బాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1979 ఏప్రెల్ సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచ బడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయం లోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు – అడ్డము

1. 'వనిత'లో వచ్చిన 'టెలివిజన్ అమ్మాయిలు'లో ఒకరు
2. కన్ను చివరలేదు; వున్నదీ తారుమారు.
3. ఈ అవస్థ 'అర్ధమరణం' వంటిదన్నారు పెద్దలు
4. మూడు అక్షరాల్లో విన్నవించుకోవడం
5. పువ్వు పుయ్యకుండా కాసే చెట్టు.
6. తిరిగే చక్రానికి సంబంధించిన మాట
7. దుఃఖం లేదా కష్టం
8. ఆహ్వానం అపసవ్యం అయితే ఇలాగే వుంటుంది
9. 'కాంతికిరణాలు' రచయిత్రి
10. చివర తిరగబడింది
11. ఆహ్వానం లాగే సాగనంపడం కూడా అవకతవకయితే?
12. ఒక ప్రవాహం అడ్డదిడ్డమైతే?

### ఆధారములు – నిలువు

1. వృక్ష సముదాయం.
2. ఈ నది మాత్రం అడ్డదిడ్డంగా లేదు.
6. మీరు 'మాటలకొలువు - 44' ఎప్పుడు చూస్తు న్నారో తెలుసా?
7. గోవర్ధనధారి చెలియలు
9. చిన్న మాటతోనే రక్షించవచ్చు.
13. ఇరవై ఒకటి రాకముందు-
14. చెయ్యడానికి కుదరనిదే అయినా, ఆహ్వానం వున్నప్పుడు చెయ్యగలుగుతాము.
15. 'చిన్న లెక్క-నూర్లో పడిపోతే?
16. ఆదిలో కొత్తగా కనిపించే తిథి
17. తడబడి మాట్లాడడం
18. పోటీ లాంటిదీ; ద్వేషం లాంటిదీ.
19. ఇష్టమైనదైతే ఆనందంగానే వుంటుంది.
20. ఇంద్రుడి సారథి అంతులేకుండా తిరగబడ్డాడు.
21. 'మాతృత్వం' చిత్రకారుడు.
22. అబ్బాయి భార్య తిరుగుబాటు చేసింది!

## వనిత మాటల కొలువు-44
## రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 13 | 14 | ■ | 2 | | 15 |
| | ■ | 3 | | 16 | | ■ | |
| 4 | 17 | | ■ | 5 | | 18 | |
| ■ | | ■ | 6 | | ■ | | ■ |
| 19 | ■ | 7 | | ■ | 20 | ■ | 21 |
| 8 | 22 | | ■ | 9 | | | |
| ■ | 10 | | ■ | | ■ | ■ | |
| 11 | | | | ■ | 12 | | |

పేరు ______________________

చిరునామా ______________________

______________________

______________________

______________________




# "లోధ్ర" టానిక్ వనితలకు మాత్రం!

ప్రకృతి సిద్ధమైన పద్ధతి ద్వారా ఆరోగ్యంగా ఉండడానికి నెలలో ప్రతిరోజూ బాధలేని రోజుగా గడపడానికి "లోధ్ర" టానిక్ తీసుకోండి! ఏ బాధా లేకుండా ఆరోగ్య మయమైన జీవితాన్ని గడపండి.

Sistas

78 సంవత్సరాల నుంచీ స్త్రీల విశ్వాసానికి పాత్రమైన టానిక్.
"లోధ్ర" మందుల షాపులలో దొరుకుతుంది.

ఉచితమైన వైద్య సలహాలకు క్రింది చిరునామాకు ఈ కూపనును పూర్తిచేసి, మీ ఉత్తరంతోబాటు జతచేసి పంపండి.

పేరు : ____________________

చిరునామా : ____________________

____________________

____________________ PIN ____________________

**కేసరి కుటీరం (ప్రై) లిమిటెడ్**

27, వెస్టకాట్ రోడ్, రాయపేట, మద్రాసు-600 014

ఏజంట్లు: శీతారామ జనరల్ స్టోర్స్ ఏజన్సీస్, విజయవాడ, సికింద్రాబాదు.

---

# హెయిర్ స్టయిలు ఏదైనాసరే హెయిర్‌స్ప్రే మాత్రం ఒక్కటే!








ఎంత అందమైన హెయిర్ స్టయిలుతో జుట్టు అలంకరించుకుంటే ఏం లాభమని, అది అలాగే నిలిచి వుండకపోతే. జుట్టు పొట్టిదైనా, పొడుగుదైనా, హెయిర్ స్టయిలు ఏదైనా, పాయిజ్ హెయిర్‌స్ప్రే, జుట్టును అదే తీరులో అట్టే వుంచుతుంది. పాయిజ్, జుట్టును సున్నితంగా, అయినా గట్టిగా పట్టుకుని వుంచి జుట్టులోని సహజ సౌందర్యాన్ని ఆ మెరుపునూ పెంపొందిస్తుంది. సరి సమానంగా స్ప్రే చేస్తుంది. దీనిని బ్రష్‌తో శుభ్రం చేయవచ్చును. జుట్టుకిక జిగట ఉండదు, చుండ్రు పట్టదు.
మీ జుట్టుకిక మరింత సింగారం

**శాంతెల్**
హెయిర్ స్ప్రే

మీ జుట్టుకిక మరింత సింగారం

మార్కెట్ చేసేవారు: రాలిస్ ఇండియా లిమిటెడ్

U-PHS-13 TEL

'పెప్టిక్ అల్సర్'తో బాధపడుతూ, మందులు తీసుకుంటున్నవారికి అరటిపళ్లు తినడంవల్ల మంచి ప్రయోజనం వున్నట్లు వైద్య పరిశోధనలవల్ల తెలిసింది. అరటిపండు 'అల్సర్' నిరోధానికి ఏ విధంగా దోహదమవుతుందో తెలుసుకోడానికి జరిగిన పరిశోధనలు గురించి వివరిస్తూ, శ్రీ ప్రశాంత కుమార్ మిత్రా (బయోకెమిస్ట్రీ శాఖ, ఎన్. బి. యు. మెడికల్ కాలేజి, సిలిగురి, డార్జిలింగ్) ఇటీవల 'సైన్స్ రిపోర్టర్' పత్రికలో ఈ విషయాన్ని వెల్లడి చేశారు. బాగా మగ్గిన అరటిపండు కంటే, కాస్త తక్కువగా మగ్గిన అరటిపండు 'అల్సర్' నివారణకు మరింత ఉపయోగకరమని ఆయన తెలియజేశారు.

*

మాతృత్వాన్ని పొందిన స్త్రీలు - వెనువెంటనే మళ్ళీ సంతానం కలగకుండా వుండడానికి 'పిల్స్' ఉపయోగిస్తూ వుండడం సామాన్యంగా జరుగుతూ వుంది. 'పిల్స్' వల్ల కొంత ప్రయోజనంతో పాటు, కొన్ని ఇతర ఇబ్బందులు కూడా కలుగుతున్నాయన్న విమర్శ వుంది. వీటి గురించి ఇంకా పరిశోధనలు జరుగుతూనే వున్నాయి. ఈవిషయం పై డా॥ జె. జి. గ్రడ్జింకాస్ (లండన్ హాస్పిటల్ మెడికల్ కాలేజ్) సహకారంతో లండన్‌లోని రాయల్ పోస్ట్ గ్రాడ్యుయేట్ మెడికల్ స్కూల్‌కు చెందిన




ఇద్దరు భారతీయ వైద్యులు - ఆర్. ఎన్. సక్సేనా, కె. శ్రీమాన్‌కర్ పరిశోధనలు జరిపి, ఈ 'పిల్స్' వల్ల తల్లిపాలు కలుషితమయ్యే ప్రమాదం వుందని తెలియజేశారు. తల్లి పాలు కలుషితం కావడంవల్ల శిశువుల ఆరోగ్యానికి హాని కలుగుతుందనీ - ఐతే, ఏ కారణంగా తల్లి పాలలో ఆ మార్పు సంభవిస్తున్నదన్న విషయం కచ్చితంగా నిర్ధారణ కాలేదనీ వారు చెప్పారు.

*

మానసిక వ్యాకులత, తీవ్రమైన భావావేశం వంటి కారణాలవల్ల స్త్రీల దేహంపై ఎక్కువగా రోమాలు పెరిగే అవకాశం వుందని ఇటీవల ఢిల్లీలో జరిగిన వైద్యుల సమావేశంలో కొందరు ప్రముఖ వైద్య శాస్త్రజ్ఞులు సూచించారు. ఆ కారణాలవల్లనే కాక, బీజకోశాల వ్యాకోచం, వాటిలో ద్రవాన్ని పుట్టించే 'సిస్ట్స్' (తిత్తివంటి భాగాలు) వల్ల కూడా రోమాలు పెరుగుతాయని, వీటితోపాటు బరువు పెరగడం, సక్రమంగా బహిష్టు కాకపోవడం, సంతానం కలగకపోవడం సంభవిస్తుందనీ వారు ఆ సమావేశంలో తెలియజేశారు. అంచేత-ఎక్కువ రోమాలతో బాధపడే వనితలు ఆవేశాన్ని, ప్రతి చిన్న విషయానికీ ఆందోళనపడే మానసిక స్థితిని అరికట్టుకోవడమే కాక, వెంటనే వైద్య చికిత్సను పొందడం ఎంతైనా శ్రేయస్కరం!

*

ఏదైనా ప్రమాదం జరిగి చేతివ్రేళ్లు కానీ, చేతులు కానీ తెగిపోతే, వాటిని తిరిగి అతికించి, అవి మామూలుగా పనిచేసే పద్ధతిని రూపొందించవచ్చని మద్రాసులోని స్టేన్లీ హాస్పిటల్‌కు చెందిన 'ది హాండ్ ఇంజూరీ సర్వీస్' (ప్లాస్టిక్ సర్జరీ శాఖ)కు సంబంధించిన వైద్య శాస్త్రజ్ఞులు పలు చికిత్సలతో విజయవంతంగా నిరూపించారు. ప్లాస్టిక్ సర్జరీ ప్రొఫెసర్ డాక్టర్ ఆర్. వెంకటస్వామి (స్టేన్లీ హాస్పిటల్ - హాండ్ ఇంజూరీ సర్వీస్ శాఖాధిపతి) తమ ఆస్పత్రిలో జరిగిన అటువంటి చికిత్సలు - వాటికి సంబంధించిన వివరాలు తెలియజేస్తూ, ఈ విషయంలో విశేషంగా కృషి, పరిశోధనలు జరుపుతున్న వైద్య విభాగం మనదేశంలో ఇదొక్కటే అని ఇటీవల ఒక సమావేశంలో చెప్పారు. చేతులు, చేతివ్రేళ్ళతోపాటు రక్తనాళాలు, నరాలు, తెగినా కూడా వాటిని మళ్ళీ సక్రమంగా అమర్చడం సాధ్యమేనని ఆయన అన్నారు.

*

పిల్లలు రకరకాల రంగులు పూసిన బొమ్మలతో ఆడుకుంటూ, వాటిని నోట్లో పెట్టుకుంటే, వెంటనే ఆ అలవాటును మాన్పించాలి. లేకపోతే-ఆ రంగుల్లో మెదడుకు హాని కలుగజేసే పదార్థాలు వుండడం వల్ల అవి శరీరంలో ప్రవేశించి - తద్వారా పిల్లలకు బుద్ధిమాంద్యం సంభవించే ప్రమాదం వుంది! బుద్ధిమాంద్యానికి సంబంధించిన అంశంపై చర్చించడానికి ఇటీవల తిరువనంతపురంలో జరిగిన వైద్యశాస్త్రజ్ఞుల సమావేశంలో డాక్టర్ ఎన్. ఎస్. సుగుణాబాయి (తిరువనంతపురం మెడికల్ కళాశాల ప్రొఫెసర్) ప్రసంగిస్తూ, ఈ విషయాన్ని వెల్లడి చేశారు. తల్లిదండ్రుల మధ్యగల రక్త సంబంధాలు, పరిసరాలకు సంబంధించిన ప్రభావాలు కూడా బుద్ధిమాంద్యానికి దోహదం చేస్తాయని ఆమె తన ప్రసంగంలో చెప్పారు.

## వనిత మాటల కొలువు - 42

సరైన సమాధానం :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 పి | గ్ర | 15 హ | ము | | 16 పో | | 17 అ |
| న | | స్త్రి | | 2 క | ల | 18 క | ల |
| 3 తి | 19 బం | | 20 బ | | 4 తి | వ | స |
| | గా | | 5 ల్లి | 21 త | | 6 న | ట |
| 7 ఎ | ర | వు | | 8 లి | 22 రా | | |
| 9 ద్ద | ము | | 10 సా | వా | సి | | 23 అ |
| డి | | 11 మే | న | కి | | 12 దం | తి |
| | 13 ఈ | త | | 14 లి | గా | డ | వ |

పై సమాధానంతో సరిపోయే సమాధానాలు పంపిన వారు ఇరవైతొమ్మిది మంది. వారు :

1. ఎమ్. హైమవతి, నందిగామ 2. ఎమ్. బి. లక్ష్మీ నాయుడు, కావలి 3. పి. వి. రత్న, భిలాయ్ 4. ఎమ్. ఎల్. రంగనాయకమ్మ, సికింద్రాబాదు 5. ఎం. శశిరేఖ, అనంతపురం 6. పి. అచ్యుతవేణి, కాకినాడ 7. పుణ్యవతి, శ్రీహరికోట 8. వి. పద్మశ్రీ, రాజమండ్రి 9. ఎ. రాజరాజేశ్వరి, మంగళగిరి 10. డి. వసుంధర, కావలి 11. పి. సుశీల, సికింద్రాబాదు 12. ఎమ్. వనజాక్షి, తిరుపతి 13. జి. హేమలత, హైద్రాబాద్ 14. కె. రత్నప్రసాద్, ఆరవెల్లి 15. ఎమ్. కమలా రామలింగం, కొత్తగూడెం 16. జి. గౌరీశ్వరి, శ్రీరంగాపూర్ 17. జె. సునందిని, హైద్రాబాద్ 18. కె. అనూరాధ, హైద్రాబాద్ 19. పి. సుధామణి, పాలకొండ 20. బిందుమాధవీకుమారి, కలికిరి 21. వాసంతీదేవి, నిర్మల్ 22. పి. పద్మజవాణి, కాకినాడ 23. కె. బన్నీ, హైద్రాబాద్ 24. పి. సీతాదేవి, గుంటూరు 25. ఎమ్. లక్ష్మీదేవి, హైద్రాబాద్ 26. పి. ప్రభావతి, మచిలీపట్నం 27. జి. రాజ్యలక్ష్మి, విశాఖపట్నం 28. పి. సరస్వతి, ఇలిసిపురం 29. ఎ. సుభద్ర, కల్పాక్కం.

బహుమతి మొత్తం రూ. 150 లను వారికి అందజేస్తున్నాము.

# ఓ వనితా! నీ పేరున దశాబ్దమా!

— లక్ష్మి ఎమ్.ఎ

“బేగినియ్యవయ్యా కూలిరూకలు. పొద్దుగూకుతున్నది” రాములమ్మ ఆత్రుతగా అడిగింది.

“ఏంటే ఆ తొందర? ఒక్కొక్కరికీ ఇవ్వక్కర్లేదా? వరుసలో నిలబడు.” కసురుకుంటూ ఒక్కొక్కరికీ డబ్బులు పంచుతున్నాడు గుమస్తా.

పొద్దున్నుండి మట్టిపోసి వళ్ళు తీపులు తీస్తున్నా యింటికెళ్ళి పిల్లలకు, మొగుడికి నూకలు కాచి పోయాలని పరుగు పరుగున గుడిసె చేరిందామె.

సందెవేళ....పిల్లలు మురికిలో పొర్లాడి అలసిపోయి కళ్ళల్లో వత్తులేసుకుని వాకిలిలో కూర్చుని యెదురు చూస్తున్నారు తల్లి కోసం.

అది చూసిన రాములమ్మకు గుండెల్లో యెవరో చేయిపెట్టి కెలికినట్టయింది. వళ్ళు తూలుతున్నా లెక్క చేయక గబగబ చుట్టూ తిరిగి నాలుగు పుల్లలేరుకుని పొయ్యి రాజేసి ముందుగా నీళ్ళు కాచి పిల్లలకు పోసింది. ఆకలితో నీరసించి వున్న వాళ్ళు వేడిగా నీళ్ళు పోయడంతో సొమ్మసిల్లి పడిపోయారు. దొంతులన్నీ తడిమి అడుగున రెండు చారలు నూకలుంటే తీసి పొయ్యి మీదేసింది.

నూకలు వుడుకుతున్నాయి. పొయ్యి దగ్గర కూర్చున రాములమ్మ మనసు–రంగడు యింకా రాలేదేమని ఆలోచిస్తూంది. ఈ పూటైనా రూకలు యింటికి తెస్తాడో లేదో అని ఆత్రపడుతూంది. రాత్రి ఒట్టేయించుకుంది. బిడ్డల పెమాణంగా తాగనన్నాడు. ‘ఇక తాగడులే’ అని మనస్సుకు నచ్చచెప్పుకుని నూకలు ఉడికితే దించేసింది.

పిల్లల్ని లేపి వారికి కడుపునిండా తాగించి పడుకోబెట్టింది. మిగిలింది మూతపెట్టి రంగడింకా రాలేదేమిటబ్బా అనుకుంటూ గడపలో కూర్చుంది.

“యేమే ఒళ్ళు కొవ్వెక్కిందా? దోగందానిలా బయట కూకున్నావు” మొగుడి మాటలతో కళ్ళు మూతలు పడుతున్న రాములమ్మ ఉలికిపడుతూ లేచి నుంచుంది.

రంగడి నోటి నుండి సారాయి వాసన వచ్చేసరికి యెక్కడలేని కోపం వచ్చేసింది. “నువ్వు మనిసివేనా? బిడ్డ మీద పెమాణం చేసి మళ్ళీ తాగొచ్చేవా? సచ్చినోడా, రెండు రూకలైనా యింట్లో యివ్వవ్. నీకు తిండెట్టా వస్తాది? యెల్లు” కోపంతో కాళి అయింది రాములమ్మ.

“ధు లంజాముండా, రెండు రూకలు తెచ్చావని మిడిసి పడ్తున్నావా? నిన్నెవరెల్లమన్నారే కూలికి? రేపుండి గుడిసె కదులు. కాళ్ళిరగొడ్తాను. నా యిట్టం. తాగుతాను. తందనాలాడుతాను. నువ్వు, నీ బిడ్డలు యేట్లోపడి సావండి” అంటూ జుట్టుపట్టి వంచి, గొడ్డును బాదినట్టు బాదుతున్నాడు రంగడు. అసలే నీరసంతో, కడుపులో బాధతో వున్న ఆమె ఈ దెబ్బలు ఓర్చుకోలేక పోయింది. ఆ అబలశరీరం సొమ్మసిల్లి పోయింది.

ఈడ్చి పక్కకు శవాన్ని తోసినట్టు తోసి కుండలపైపడి మిగిలివున్న గంజిని త్రాగుతున్నాడు రంగడు.

ఓ మరబొమ్మా! నీ పేరునా దశాబ్దం?

*

ఆకాశమంత పందిరి, భూదేవంత అరుగు అన్నట్టు అట్టహాసంగా జరుగుతూంది పెండ్లి సంబరం. రంగురంగుల కరెంటు బల్బుల వెలుగులో దేవలోకమా అన్పించుతూంది పెళ్ళి పందిరి. పెండ్లి కొడుకు విలాసంగా కూర్చుని అటు యిటు చూస్తున్నాడు.

“ఆ, ముహూర్తం దగ్గర పడ్తూంది. పెండ్లి కుమార్తెను తీసుకురండి” మంత్రాలు చదువుతూ అయ్యవారు అరుస్తున్నాడు.

పెండ్లికుమార్తె తల్లి వడివడిగా లోపలికెళ్ళి కూతురి స్నేహితురాళ్ళతో “అమ్మాయిని తీసుకు రండమ్మా” అంటూ బయట కొచ్చేసింది.

సుగుణ సిగ్గుగా స్నేహితురాళ్ళ ఛలోక్తులతో మెల్లగా వచ్చి వరుని ప్రక్క కూర్చుంది.

పెండ్లి కొడుకు పసుపుతాడు చేతిలోనికి తీసుకుని పెండ్లి కూతురి వైపు తిరిగాడు.

“ఆగండి” గంభీరంగా గర్జించిందొక స్వరం. మంత్రించినట్టు ఆగిపోయాడు వరుడు.

చటుక్కున తలెత్తి చూసింది సుగుణ.

“కట్నం తాలూకు మిగిలిన పదివేలూ తాంబూలంలో పెట్టి యిక్కడ పెట్టండి. ఆ తర్వాతే సూత్రధారణ.” కరకుగా మ్రోగింది పెండ్లి కుమారుని తండ్రి కంఠం.

వధువు తండ్రి గుండెల్లో రైళ్ళు పరిగెడుతున్నాయి. ఏదైతే జరగకూడదనుకుంటున్నాడో ఆ ఉపద్రవం ముంచుకొచ్చింది. యెలాగో గొంతు పెగల్చుకుని “బావగారూ, తొందరపడకండి. సూత్రధారణ కానీయండి. పది రోజుల్లో పదివేలూ పువ్వుల్లోపెట్టి యిస్తాను. యిల్లు బేరానికి రాలేదు. ఈ అవకాశాన్ని ఉపయోగించుకుని చాలా తక్కువ ధర కడుగుతున్నారు అందరూ. ఈ మారు యెంతైనా అమ్మి డబ్బిస్తాను. దానికోసం పెండ్లి ఆపుజేసి నా బిడ్డ గొంతుకోయకండి. మీరు కోరినట్టు వివాహం ఘనంగానే జరిపిస్తున్నాను. నా మీద నమ్మకం లేకపోతే ఇల్లు – యిప్పుడే మీ పేర రాసిస్తాను. దయచేసి వొప్పుకోండి.” అంటూ చేతులు పట్టుకున్నాడు.

“ఇదేనయ్యా నీ పెద్దమనిషితనం? నిశ్చితార్థం రోజున ఈ రోజిస్తానన్నావు? ఈ రోజిలా అంటున్నావు. ఇక పది రోజుల తర్వాత మరో

నాటకం. బాగుంది భాగవతం. నాకింకేం పని లేనట్టు నీ యిల్లు రాయించుకోవాలా? యింకా నయం. సూత్రధారణ జరగలేదు. ఎంచక, ఎంచక యిలాంటి దరిద్ర సంబంధాన్నే యెంచుకున్నాం. కోటిమంది లక్షలిస్తామన్నా వాడిష్టపడ్డాడని ఊం అన్నాం—సరైన శాస్తి జరిగింది. యింకా అలా చూస్తావేం? అబ్బాయిని తీసుకుని బయలుదేరండి'' వాన కురిసినట్టు ఏకధారగా మాట్లాడుతూ భార్య వైపు ఉరిమి చూశాడు పెండ్లి కుమారుని తండ్రి.

''వదినగారూ! అన్నగారికి నచ్చ చెప్పండి. మీకూ కూతుళ్ళున్నారు. నా బిడ్డ ముఖం చూడండి. ఇప్పుడు మీరు వెళ్ళిపోతే దానికిక జన్మలో పెళ్ళి కాదు. నా బిడ్డ జీవితం నాశనం చేయకండి.'' అంటూ భోరున ఏడుస్తూ పెళ్ళికొడుకు తల్లి రెండు చేతులు పట్టుకుంది వధువు తల్లి.

ప్రేక్షకురాలిలా యిదంతా చూస్తున్న సుగుణ హృదయం అవమానాగ్నిలో భగ్గుమంది. అసహాయత కన్నీటి రూపంలో జారి భూమిలో యింకిపోతూంది.

''యింకా ఆలోచిస్తారేం. నడవండి.'' తండ్రి ఆజ్ఞకు శిరసావహించే శ్రీరామచంద్రునిలా పసుపుతాడు వదిలేసి అలాగే నడిచాడు తండ్రి వెనుక అతను.

గంటక్రితం ఇంద్రలోకంలా వున్న పెండ్లి పందిరి యిప్పుడు శ్మశాన వాటికలా అయింది. తల్లి, తండ్రి తన దురదృష్టానికి కుళ్ళి కుళ్ళి యేడుస్తున్నా, తన మనసులో చెలరేగుతున్న సుడిగుండాలను పైకి పొంగనీయక, సుగుణ చలించక రాయిలాగా అలాగే కూర్చుండిపోయింది.

ఓ భగ్న హృదయినీ! నీ పేరునా దశాబ్దం??

*

పెండ్లినాటి చీరకట్టి, తలనిండా పూలు, పసుపు కుంకుమ, మోచేతుల వరకూ గాజులూ తొడిగి అలంకరించారు శారదను.

యేడ్చి యేడ్చి అలసిపోయిన శారద తనని కాదన్నట్టు మౌనంగా వుండిపోయింది. బలవంతంగా లేపి అందరూ కలసి ఆ వూరి చెరువు దగ్గరకు తీసుకెళ్తున్నారు ఆమెను.

కంట్లో ఒక చుక్కైనా నీరు రావడం లేదు. ''శారదా! నీవెంత నష్టజాతకురాలివే? ఇంత చిన్న వయసులో పసుపు కుంకుమ దూరం చేసుకోవలసి వచ్చింది.''

''మళ్ళీ యెప్పుడేసుకుంటావ్. చేతినిండా గాజులేసుకో.''

''శారదా! యిదిగోనే మా దొడ్లో పూసిన మల్లెలు. మళ్ళీ పెట్టుకునే అదృష్టం లేదుగా. పెట్టుకో.''

''దాని ముఖాన మరింత పెద్ద బొట్టు పెట్టండి. ఈ రోజేగా.''

భర్త చనిపోయాడని ఓదార్చడానికొచ్చిన తోటి స్త్రీల మాటలు రంపపుకోతల్లా-నిజం చెప్పాలంటే భర్త చావుకన్నా యెక్కువ బాధించాయి.

తన దైవం, తన ప్రాణం పోయి తాను యేడుస్తుంటే. ఈ అలంకారాలన్నీ చేసి ఈ పదకొండు



రోజులూ దిష్టిబొమ్మను చేశారు. యిప్పుడు జరగబోయేదేంటి? ఆ తలంపుతో ఒళ్ళంతా ఒణుకు పుట్టడంతో అలాగే కళ్ళుమూసుకుని తూలిపడబోయింది శారద.

అలాగే ఆమెను పట్టుకొచ్చి చెరువుగట్టు మీద కూర్చోబెట్టి పూలన్నీ తీసేశారు. చేతులనిండా వేసినవారే నిర్భయంగా గాజులన్నీ ఫెళఫెళ పగులగొట్టారు. అందంగా తీర్చి దిద్దిన చేతులతోనే కుంకుమను తుడిచేశారు.

"లేదు. లేదు. నేను భరించలేను. వద్దు. దీనికన్నా నన్ను చంపేయండి. హాయిగా వుంటుంది." హృదయ విదారకంగా యేడుస్తూంది శారద.

ఇకమీదట తను నిద్రలేస్తూనే యెవరికీ కనబడకూడదు. పెండ్లి జరుగుతున్నా అక్షతలు వేయకూడదు. "అమ్మాయ్, శారదా! ఓమారిలా యెదురు రామ్మా. పని సవ్యంగా జరుగుతుంద"ని యెక్కడున్నా తనని పిలిచే మామయ్య "ఛీ, దరిద్రురాలా. ఎదురొచ్చావూ? ఇక పని అయినట్టే" అంటూ పొరపాటున యెదురొచ్చిన తనని చూసి మళ్ళీ లోపలికెళ్తాడు మామయ్య.

"మా కోడలు లక్ష్మీదేవి. అది నట్టింట వుంటేనే చాలు." అని మురిసిపోయే అత్తగారు తన ముఖం చూస్తూనే "దరిద్రపు దానా, నిన్ను కట్టుకున్నందుకేగా నా బిడ్డ చనిపోయాడు" అని చీదరించుకుంటుంది.

భవిష్యత్తులో తన స్థానాన్ని తలచుకుని కుమిలి కుమిలి రోదిస్తూంది శారద — అక్కడే చెరువు దగ్గరే కూర్చుని.

ఓ బలిపశువా? నీ పేరునా దశాబ్దం???

*

సాయంకాల సమయం. సంధ్య వెలుగులు మెల్లమెల్లగా జారుకుంటున్నాయి. చీకటి అల్లనల్లన అంతటా పరచుకుంటూ వుంది. ఆ పట్టణానికంతా యిరుకైన వీధి అది. రోడ్డు మీదే పారే మురికి కాలువలు, చెత్త చెదారాలు, అడుగు పెడితే పాప పంకిలమవుతుందేమోనన్నంత అసహ్యంగా వుంది. ఆ వీధిలో ఇంటింట వాకిటా ఓ అంగన నిలబడి వుంది. ఉడిగిపోయే వయసు-అందాల్ని, వంపుల్ని కరిగిస్తున్నా అలంకారాల్తో దాన్ని కప్పి పుచ్చుకుంటూ పొట్టకూటికి గడుపుకుంటున్నారు వారు. మామూలుగా రోజూ బేరం కుదిర్చి తీసుకొచ్చే రిక్షా గణగణమంటూ ఒక వాకిలి ముందు ఆగింది. అందులోనుండి ఓ వ్యక్తి దిగాడు. యెవరికైనా కనపడితే నేరం అన్నట్టు తొందరగా లోపలికెళ్ళాడు. ఈనాటి భాగ్యం అనుకుంటూ ఆమె వెంటనే తలుపేసేసింది.

అదే సమయంలో యెదురింట్లో తలుపు తెరుచుకుంది. వడలిన కాడలా వుందామె. అతనితోపాటే వాకిలిలో కొచ్చి అతనిచ్చిన కట్టలు లెక్కపెట్టుకోకనే జాకెట్లో దోపేసి వాకిలిదాకా వచ్చి సాగనంపింది ఆనాటి ప్రియుణ్ణి.

మరో యింట్లో "వీల్లేదు, ఈ రోజు నీవే వెళ్ళాలి. నేను మాటిచ్చేసి అడ్వాన్సు కూడా తీసుకున్నాను. తలనొప్పికే రెస్టు కావాలా? తొందరగా వెళ్ళి రెడీకా. అతనొచ్చే వేళయింది. వెళ్ళు." ఆ కంపెనీ హెడ్ మాటలకు బదులు చెప్పలేక తల బాధతో ఒళ్ళు తూలిపోతున్నా ఒక కాముంధుడి దాహాన్ని తీర్చడానికి తయారయింది ఓ అబల.

విధి వంచితులారా! మీ పేరునా దశాబ్దం????

## కనక్ రెలే

భాషాభేదాలు కాని ప్రాంతీయ ఎల్లలు గాని కళకు అడ్డురావు. వీటినన్నిటినీ అధిగమించే శక్తి కళకు వుంది-అంటారు విజ్ఞులు. ఈ మాటకు అర్థంగా, ప్రత్యక్ష తార్కాణంగా చెప్పదగిన వనిత—డాక్టర్ కనక్ రేలె.

నలందా నాట్య పరిశోధనా కేంద్రానికి డైరక్టర్‌గా వుంటూ నాట్యకళకు ఇతోధికమైన సేవలు చేస్తున్న శ్రీమతి కనక్ రేలె పుట్టింది గుజరాత్‌లో. పెళ్ళాడింది ఒక మహారాష్ట్రుని. దక్షిణభారత దేశంలోని కేరళ ప్రాంతానికి చెందిన కథకళి నాట్యం పట్ల అభిరుచి కనబరచి, అందులో శిక్షణ పొంది— ఆ కళలో నిష్ణాతురాలు అన్న ప్రశంస కూడా పొందారామె.

పేరుమాసి రూపుమారి కొన ఊపిరితో అవసాన దశను చేరుకుంటున్న కథకళి నృత్యానికి, ముఖ్యంగా 'మోహిని ఆట్టం' అనే నాట్య ప్రక్రియకు — తన నిర్విరామ కృషితో, దీక్షాదక్షతలతో, పునర్జన్మ ప్రసాదించి పెద్ద పీట వేయించిన ఘనత శ్రీమతి



### సమయస్ఫూర్తి

వసంత జిడ్డులా పట్టుకుంటే వదలదని అందుకని ఆమెకు కనిపించాలంటేనే— ఫ్రెండ్సందరికీ తగని భయం. ఒక రోజు వసంత తమ ఇంటికి రావడం కళ్యాణి దూరం నుండే చూచి. త్వరత్వరగా తల్లి దగ్గరకు వచ్చి "ఆ జిడ్డు వస్తోంది నేను లేనని చెప్పమ్మా" అని చెప్పి మేడపై కెళ్ళి కూచుంది. కళ్యాణి లేదని చెప్పినా వెళ్ళకుండా వాళ్ళమ్మ. బొమ్మలను ఓ గంటసేపు బోర్ కొట్టించి కాని లేవలేదు వసంత. పనివేళలో వసంతను పొమ్మని చెప్పలేక సతమతమయ్యారు వాళ్ళు.

ఇంతలో కళ్యాణి పైనుండి "అమ్మా! ఆ శని జిడ్డు వెళ్ళింది కదా?" అంటూ ఓ కేక పెట్టింది. ఆ మాట వసంత విన్నది! అయితే — వాళ్ళమ్మగారేమీ కంగారు పడకుండా "ఆ.... ఆ శని వెళ్ళిందమ్మా. ఇప్పుడు వచ్చి మాట్లాడుతుందేది మీ ఫ్రెండు వసంత" అని సమయస్ఫూర్తిగా జవాబిచ్చింది!

విజయలత



కనక్ రేలెకు చెందుతుంది :

మామూలుగా పురుషులకు మాత్రమే పరిమితమైన కళగా కథకళిని పేర్కొంటారు. ఈ నాట్యంలో ఈమె కరుణాకర పణిక్కర్ శిష్యరికంలో శిక్షణ పొందారు. 'కథకళి' లోనే 'మోహిని ఆట్టం' అన్న విభాగంలో విశేషమైన కృషి చేస్తున్నారు. దీనిని గురించి వివరిస్తూ ఆమె — 'మోహిని ఆట్టం గురించిన వివరాలు సేకరించడానికి నేను ఎన్నో యేళ్ళు కృషి చేశాను. కేరళరాష్ట్రం మారుమూల పల్లె పట్టులన్నీ తిరిగి-ఆ కళతో పరిచయమున్న ప్రతివారి నుంచీ విషయం సేకరించాను. కొన్ని నాట్యాలను చిత్రాలుగా కూడా తీశాను. ఇలా చాలా యేళ్ళు కృషి చేసి ఈ నాట్యం అభ్యసిస్తూనే, గురువుల సహాయ సహకారాలతో ఈ నాట్య ప్రక్రియను మరింత సృజనాత్మకంగా, కళాత్మకంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నించి, కొంతవరకు విజయం కూడా సాధించాను' అన్నారు.

'మోహిని ఆట్టం' విషయంగా ఆమె రచించిన పరిశోధనా వ్యాసానికి బొంబాయి విశ్వ విద్యాలయం డాక్టరేట్ ప్రదానం చేసింది. నాట్య విభాగం నుంచి డాక్టరేట్ సంపాదించిన ఏకైక వనిత కనక్. ఈ పరిశోధనా వ్యాసానికి ప్రతిష్ఠాకరమైన ఫోర్డ్ ఫౌండేషన్ అవార్డ్ లభించడం విశేషం :

వివిధ 'ముద్రలు' అభినయిస్తూ రకరకాలైన విరుద్ధ భావాలను ముఖ కవళికలలో సునాయాసంగా ప్రదర్శించగల కనక్ రెలే దేశ విదేశాలలో అనేకసార్లు పర్యటించి ప్రముఖుల ప్రశంసలు, మన్ననలు అందుకున్నారు.

నాట్యరంగంలోనే కాకుండా, విద్యారంగంలో కూడా తన ప్రతిభను చూపిన కనక్, న్యాయశాస్త్ర పట్టభద్రురాలు. అంతర్జాతీయ చట్టం ముఖ్య పాఠ్యాంశంగా, మాంచెస్టర్ విశ్వ విద్యాలయం నుంచి ప్రథమ శ్రేణిలో ప్రథమురాలిగా ఆమె ఉత్తీర్ణురాలయ్యారు.

కనక్ రెలే మంచి వక్త. అందువల్ల శాస్త్రీయ నాట్యం గురించిన సాంకేతిక విషయాల నుంచి సౌందర్య సిద్ధాంతాలవరకు అనర్గళంగా ఉపన్యసించగలరు. తనకున్న శక్తి సామర్థ్యాలనన్నింటిని సమీకరించి — విద్యారంగంలో అంటే విశ్వ విద్యాలయ ప్రాంగణంలో కూడా గజ్జెల గలగలలు వినబడడానికి ఈమె వేదిక యేర్పాటు చేయగలిగారు.

బొంబాయి విశ్వ విద్యాలయంలో శాస్త్రీయ నాట్యం పాఠ్యాంశంగా నాలుగేళ్ళ డిగ్రీ కోర్సు ప్రవేశపెట్టడానికి ఆమె ఎంతో కృషి చేశారు. ఈ విశ్వ విద్యాలయానికి అనుబంధంగా వున్న నలందా నాట్య పరిశోధన కేంద్రానికి ఆమె డైరక్టర్‌గా వుంటున్నారు. ఇక్కడ బి.ఏ., యం.ఏ. కోర్సులలో శాస్త్రీయ భరతనాట్యం, కథకళి నృత్య రీతులలో శిక్షణ ఇవ్వబడుతున్నది. "నాట్యం అంటే మంచి అభిరుచి గల నలభైమంది విద్యార్థినులు ఇక్కడ శిక్షణ పొందుతున్నారు. మా వద్ద దుస్తులు, ప్రదర్శనకు కావలసిన అలంకరణ, ఆభరణాలు అన్నీ ఉన్నాయి. శిక్షణా సమయంలోనే మా కేంద్రం తరఫున ప్రదర్శనలు ఇవ్వడానికి మా విద్యార్థినులను ప్రోత్సహిస్తాము. ఇలా చేయడం వల్ల ఇది విద్యార్థినులు శిక్షణ పూర్తిచేసి బయటపడిన తర్వాత — వారు నాట్య కళాకారిణులుగానో, ఉపాధ్యాయినులుగానో వుండడానికి అనుభవం సమకూరుతుంది. అన్నిటికన్నా ముఖ్య విషయం ఏమిటంటే-చేసే వృత్తి మీద భక్తిశ్రద్ధలు గల సమర్థులైన ఉపాధ్యాయినులు మా కేంద్రంలో వున్నారు. మా కేంద్ర ప్రగతికి వారే ముఖ్య కారకులు." అని ఆ నాట్య కళాకేంద్రం గురించి వివరించారామె. □

# చూడండి...
# సర్వోత్తమ తెలుపు కోసం రానిపాల్®









బట్టలను ఆఖరుసారి జాడించునపుడు కొంచెము రానిపాల్ వేయండి. అపుడు చూడండి... బట్టలపై మెరిసే తెలుపు! రానిపాల్ తెలుపు! తెల్లటి బట్టలు ఏవైనా కాని— నూలు, సింథెటిక్ మరియు మిశ్రమ బట్టలు రానిపాల్‌తో మెరుస్తూ వుంటాయి.

**నియమానుసారంగా రానిపాల్‌ను వేయండి...తెలుపు చూడండి, చూపండి!**

నూలు దుస్తులకు **రానిపాల్®**
సింథెటిక్ మరియు మిశ్రమ దుస్తులకు **రానిపాల్®-ఎస్.**

Shilpi SG-2A/78 Tel






సహ విద్యార్థినులకు నాయకురాలుగా వుంటూ ఆట పాటలలో ఎప్పుడూ ఏదో ఒకటి చేస్తూ, చలాకీగా తిరిగే అమ్మాయి ఐడా.

చదువు పూర్తి కాగానే అమెరికాలో ఒక సంపన్నుని పెళ్ళి చేసుకుని హాయిగా విందులతో వినోదాలతో గడపాలనే కలల అలల మీద తేలియాడే అమెరికా అమ్మాయి. అదే తన లక్ష్యంగా తోటి స్నేహితురాండ్రతో తరచూ చెబుతూ వుండేది కూడా.

ఆమె తల్లిదండ్రులు మిషనరీస్ ద్వారా భారత దేశంలో స్థిరపడి ప్రజాసేవ చేసేవారు. ఆమె తండ్రి ఒక డాక్టర్.

తల్లికి సుస్తీ చేసిందని తెలిసి చూచి వద్దామని ఓసారి భారతదేశం వచ్చింది ఐడా. కళాశాలకు సెలవులు కావడంవల్ల ఇక్కడే కొన్నాళ్ళు గడిపి పోదామని నిశ్చయించింది.

తన స్నేహితులకు ఈ విషయం రాయడానికి కూర్చుంది ఐడా. అర్ధరాత్రి అయి వుంటుంది. "అమ్మా! అమ్మా" అనే ఒక కంఠస్వరం వినిపించింది. తలుపు తీసుకుని బయటికి వచ్చి చూసింది. చేతులు జోడించి మొక్కుతూ ఒక బ్రాహ్మణుడు–'ఏమిటి విషయం' అని అడగడానికి ముందే "అమ్మా దయచేసి నా భార్యను కాపాడండమ్మా. ప్రసవ వేదనతో బాధపడుతూ వుంది. మంత్రసానివల్ల సాధ్యం కాలేదు. దయచేసి రండమ్మా. వయసులో మీకన్నా చిన్నదమ్మా. కాపాడండమ్మా" అంటూ గోల చేయ సాగాడు.

ఐడాకు మొదట ఏమీ అంతుబట్టలేదు. విషయం గ్రహించిన తర్వాత "బాబూ ప్రసవ సమాచారం నాకేమాత్రం తెలియదు. మా నాన్నగారే డాక్టర్. ఆయన్ను పిలుస్తానుండు" అంది. అంతే బ్రాహ్మణుడికి కోపం ముంచుకొచ్చింది. "బలే వారండి మీరు. మీ నాన్నగారిని పిలుస్తారా? ఒక మగవాడా నా భార్య కాన్పు చూసేది? ఛ ఛ–దీనికన్నా అది చనిపోవడమే నయం. ఋణం తీరిపోయిందనుకుంటాను" అంటూ – ఐడా, ఆమె తండ్రి–ఎంత వివరించి చెప్పినా వినకుండా వెళ్ళిపోయాడా ఛాందస బ్రాహ్మణుడు.

విచారం నిండిన హృదయంతో అదే తలచుకుంటూ వుండడంవల్ల రాసే ఉత్తరం పూర్తి చేయలేక సతమతమవుతూన్న ఐడాకు మళ్ళీ అదే పిలుపు వినిపించింది. ఫరవాలేదు తిరిగి వచ్చాడు అనుకుని వెలుపలికి వచ్చి చూస్తే.... అక్కడ బ్రాహ్మణ యువకుడు లేడు. ఒక ముస్లిం ఆందోళనతో నిల్చుని వున్నాడు.

"మీ కరుణ కోసం వచ్చానమ్మా. కనికరించాలి. నా భార్య వేదన చూడలేకుండా వున్నాను. విలవిల్లాడిపోతూంది." అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు. ప్రాధేయపడ్డాడు.

తన స్థితిని వివరించి తండ్రిని తీసుకుని వెళ్ళమంది ఐడా.

"ఎంత సులభంగా చెప్పారమ్మా మీరు. ఇంతవరకు ఏ పరాయిమగవాడూ నా పెళ్ళాం ముఖం చూసింది లేదు. మీరు స్త్రీ కావడం వల్ల మీ సహాయం కోసం వచ్చాను. మీ నాన్నగారి సహాయం మాకొద్దు." అంటూ ఆమె ఏమి చెబుతుందో కూడా చెవిలో వేసుకోకుండా వెళ్ళిపోయాడా ముస్లిమ్.

ఐడా మనసు మనసులో లేదు. లెక్కలేనన్ని ఆలోచనలు సుడులు తిరుగుతూ అల్లకల్లోలం చేస్తున్నాయి. ప్రసవవేదన పడే తల్లులకు ఏదైనా అపాయం జరిగితే....అన్న అనుమానం ఆమెను ఒకచోట కూర్చోనీయలేదు. అటూ ఇటూ పచార్లు చేస్తూనే వుంది. వెళ్ళిన వాళ్ళు మనసుమారి మళ్ళీ వచ్చి తన తండ్రిని తీసుకు వెళ్తారనే ఆశ ఆమె హృదయంలో ఎక్కడో మిణుకు మిణుకుమంటూంది.

మళ్ళీ అదే శబ్దం. ఎంతో ఉత్కంఠతో ఒక్క క్షణంలో బయటికి వచ్చింది.

"రక్షించండమ్మగారూ రక్షించండి." అంటూ కాళ్ళు పట్టుకున్నాడు ఒక ముసలాయన. పరిస్థితిని అర్థం చేసుకుని "మీ భార్యకు ఆరోగ్యం బాగోలేదనే కదా నన్ను పిలవడానికి వచ్చారు?" అంది ఐడా.

"ఔనమ్మా ఔను. ఇది మీకెలా తెలుసు తల్లీ?"

"అంతా నాకు తెలుసు. అయినా నేను డాక్టర్ని కాను బాబూ. మా నాన్నగార్ని తీసుకెళ్ళండి. తప్పకుండా ఆయన నయం చేస్తారు. మీ భార్యకు సుఖ ప్రసవమవుతుంది."

"వద్దు తల్లీ వద్దు. మగవాళ్ళు పురుడు చూసే దరిద్రం మా భార్యకొద్దు. దాని రాత ఎలాగుంటే అలా తెల్లారుతుంది." అంటూ ఎంత బ్రతిమాలినా వినిపించుకోకుండా వెళ్ళిపోయాడాయన.

ఒక లేడీ డాక్టర్ లేకపోవడంవల్ల తనకన్నా చిన్నవారు కూడా ప్రాణాలు కోల్పోయే ఆ దైన్య స్థితికి–ఐడా హృదయం పరితపించింది. రాత్రంతా ఆమెకు కంటి మీద రెప్ప పడలేదు. ఉదయం ఎక్కడ నుంచో డప్పుల చప్పుడు వినబడింది. ముగ్గురు స్త్రీలు కూడా ప్రసవ వేదననుంచి తేరుకోకుండానే కళ్ళు మూసారని తెలియవచ్చింది!!

సిద్ధార్థునికి ఎదురైన మూడు దృశ్యాలు ఆయన్ను బుద్ధునిగా మార్చాయట.

ఒకరాత్రి ఎదురైన ఆ మూడు సంఘటనలు ఐడా జీవితంలో అనుకోని మలుపు త్రిప్పి – నూతన జీవిత పథానికి తలుపులు తీశాయి. నిన్నటి వరకు కన్న కలలను, ఆశలను మనసులోనే సమాధి చేసింది. సరికొత్త ఆశయం కోసం అంకురార్పణ చేసింది.

"నేను అమెరికావెళ్ళి వైద్యం చదువుకుని డిగ్రీ సంపాయించి భారతదేశానికే తిరిగి వచ్చి ఇక్కడే స్థిరపడి ప్రజాసేవ చెయ్యాలనుకుంటున్నాను." అన్నది తల్లితండ్రులతో.

కన్నవాళ్ళు ఆనంద బాష్పాలతో ఆశీర్వదించి పంపారు.

అనుకున్న ప్రకారం అమెరికా వెళ్ళి చదువు పూర్తిచేసి వచ్చింది ఐడా. ఆమె కన్న కలకు రూపకల్పన జరిగింది. ఆమె వేసిన అంకురం మొలిచి పెరిగి పెద్దదై ఇవాళ వటవృక్షంలా వెలుగొందుతున్నది. అదే వేలూరులో క్రైస్తవ మిషన్ ఆధ్వర్యంలో నడిచే సి. యం. సి. వైద్యశాల.

—విజి



పువ్వులను ఫ్లవర్‌వాజ్‌లో గుచ్చడం అందరికీ తెలిసిన విద్యే. అందుకు పెద్దగా నేర్పరితనం కూడా అవసరం లేదు. కాని వాటిని కళాత్మకంగా, చూడ ముచ్చటగా అమర్చడమన్నదే కాస్త క్లిష్టమైన విద్య. ఇలా కళాత్మకంగా అమర్చిన పుష్పాలలో కొన్ని భావయుక్తమైన గీతాలకు తగ్గట్టుగా కూడా అమర్చడం అన్నది వుంది!

ఏవో నాలుగైదు గులాబీలు, కనకాంబరాలు కలిపి ఫ్లవర్‌వాజ్‌లో గుచ్చాం అని కాకుండా పువ్వులను వాటి వాటి రంగులనుబట్టి అమర్చడంలో అందమూ, ఆనందమూ వున్నాయి.

మనం అలంకరించుకున్నప్పుడు ఈ చీరె మీదకి ఈ జాకెట్టు మ్యాచ్ అవుతుందా లేదా అని చూసుకుంటూ వుంటాం. ఆ విధంగానే పువ్వులను ఒక చోట జతపరచి కూర్చేటప్పుడు కూడా అవి కంటికి ఇంపుగా వున్నాయా లేదా అన్నది చూడాలి.

వర్ణచిత్రాలు : దిలీప్ బెనర్జీ

పుష్పాలంకరణ : ఉమా బాసు

# పుష్పాలంకరణ

మనం ఏ డిజైనులో పుష్పాలను కూర్చదలచుకుంటామో ముందుగా మనస్సులో వూహించుకోవాలి. ఆ వూహకి రూపకల్పన చేసుకునే ముందు ఒక స్కెచ్ గీసుకుంటే మంచిది. ఆ స్కెచ్ ప్రకారం పువ్వులను అమర్చుకుంటే బాగుంటుంది.

పుష్పాలంకరణలో పాటించవలసిన ముఖ్య విషయాలు - డిజైను, పొందిక, వరుసక్రమంలో కూర్చడం, వర్ణము, అల్లిక.

ఈ ఐదు పద్దతులను అనుసరించి ఏర్చికూర్చడంలోనే వుంది విశేషమంతా. ఇటువంటి వనితనాన్నే జపాన్‌వారు 'ఇకబెనా' అని అంటారు. ఆ విద్యలో మనదేశంలో పేరుగాంచిన వ్యక్తి– బెంగాల్‌కి చెందిన శ్రీమతి ఉమా బాసు.



ఉమా బాసు

ఉమాబాసు తూర్పు బెంగాల్‌కి చెందిన సుసంపన్న కుటుంబంలో జన్మించారు. ఆమె యింటి చుట్టూ చక్కని పచ్చిక బయళ్ళు, రకరకాల పూల చెట్లు, పూ పొదలూ వుండేవి. ఆ పరిసరాలలో పెరిగిన ఉమకి ప్రకృతి ప్రసాదించిన ఆ సౌందర్యం మీద సహజంగానే మక్కువ, కుతూహలం ఏర్పడ్డాయి. అందుకు తోడు పుష్పాలంకరణలో ఆమె తండ్రికి, బాబాయికి గల నేర్పరితనం ఆమెకి అబ్బింది.

చిన్నతనంలోనే దీపావళి, దసరా పండుగలప్పుడు ఉమ రకరకాలుగా పువ్వులను కూర్చుతూ ప్రత్యేక అలంకరణలు చేస్తూ వుండేవారు. దరిమిలా అది ఆమె కొత్త కొత్త పద్ధతులలో పుష్పాలను కూర్చడానికి తోడ్పడింది. ఆమెలోని ఈ సృజనాత్మక శక్తి ఆమెను ఉన్నత శిఖరాలకు చేర్చింది. మనదేశంలోనే కాక విదేశాలలో కూడా పేరు పొందేటట్లు చేసింది. 'ఇకబెనా' జన్మ స్థలమైన జపాన్‌లోనే ఆమె ప్రత్యేక ప్రశంసలు పొందారు!

'ఇల్లు చూసి ఇల్లాలిని చూడు' అంటారు. నిజమే. మన కుటుంబాల్లో సాధారణంగా గృహాలంకరణ కోసం స్త్రీలే పాటుబడుతూ వుంటారు. ఇల్లు పెద్దదా, చిన్నదా అన్నది కాదు ముఖ్యం. ఆ యిల్లు పరిశుభ్రంగా వుందా లేదా అన్నదే ముఖ్యం. చక్కగా, అందంగా తీర్చిదిద్దిన యిల్లు కళకళలాడుతూ వుంటుంది. ఎటువంటి చికాకు లేకుండా మనస్సుకి ఆహ్లాదాన్ని కలగజేస్తుంది. ఐతే గృహాలంకరణకి ఖరీదైన సామగ్రి మాత్రమే కావాలని అనుకోవడం పొరపాటు.

"మనం పనికి రావనుకుని పారేసే వస్తువులే చక్కటి అలంకరణ సామగ్రిగా తోడ్పడతాయి. ఎండిపోయిన చెట్టుకొమ్మలు, చిన్న చిన్న రెమ్మలు, ఉపయోగం లేని ప్లాస్టిక్, వెదురు బాస్కెట్లు, రంగురంగుల గులకరాళ్ళు - వీటన్నటితో కూడా చక్కటి అలంకరణ సామగ్రి చేసుకోవచ్చును. అలా చేసుకున్న వాటిని చూసి చాలామంది 'అవి ఎక్కడినుంచి తెప్పించారు?' అని ఆశ్చర్యపోతూ వుంటారు కూడా. ఈ వనితనాన్నే జపాన్‌వారు 'ఇకబెనా' అని అంటారు. అయితే దీనికి ఎటొచ్చీ ఓర్పు, నేర్పు వుండాలి. అంతే" అంటారు ఉమ.

శ్రీమతి ఉమాబాసు తన ప్రథమ ప్రదర్శనను 1963లో ఏర్పాటు చేశారు. ఆ ప్రదర్శన చూసిన వారందరూ ఆమెను అభినందించారు. ఆ ఉత్సాహంతో ఆమె, ఆ తరువాత స్వదేశంలోనూ, విదేశాలలోనూ కూడా అనేక ప్రదర్శనలు ఏర్పాటు చేశారు.

అయితే ఆమెకు మరపురాని ప్రదర్శన— 1970లో జపాన్‌లో ఏర్పాటు చేసిన ప్రదర్శన. ఆమె పుష్పాలంకరణా పాటవాన్ని తిలకించిన జపాన్‌వారు మంత్రముగ్ధులయ్యారు, 'సంకై షింబన్' అనే జపాన్ దినపత్రిక ఆ ప్రదర్శన గురించి ఈ విధంగా రాసింది - "పుష్పాలంకరణ అనేది ఒక్క జపాన్‌వారికే పరిమితం, అనితర సాధ్యం అనేది బూజు పట్టిన భావన అని నిరూపించింది ఒక భారతదేశపు వనిత. ఆమె భారతదేశపు దౌత్య కార్యాలయంలో ఏర్పాటు చేసిన పుష్పాలంకరణ ప్రదర్శన భారతీయతను ప్రతిబింబింపచేస్తూ ఎంతో ఆకర్షణీయంగా వుంది...."

"ఇకబెనా పద్ధతిలో రూపొందించే పుష్పాలంకరణ అంటే కేవలం కనులకి ఇంపుగా వివిధ రకాల పువ్వులను కూర్చడమే కాదు. అందులో ఎన్నో గాథలు వున్నాయి. ఒక్కొక్క పద్ధతి ... ఒక్కొక్క పువ్వు .... ఒక్కొక్క కథ చెబుతున్నట్లుగా మనకి అనిపిస్తుంది. ఇకబెనా కూడా ఒక పాఠ్యాంశమే. అందులో వేదాంతం కూడా మిళితమైవుంది" అంటారు ఉమ.

'ఇకబెనా' పద్ధతిలో పరిశోధనలు జరిపిన వారిలో ఉమా బాసుకి ప్రత్యేక స్థానముంది. మన 'పూర్ణకుంభాని'కి 'ఇకబెనా'కి గల పోలికలపై ఆమె పరిశోధనలు జరిపారు. తన పరిశోధనల ద్వారా మన పూర్ణకుంభం పద్ధతిని మహాయాన మతానికి చెందిన బౌద్ధమత ప్రచారకులు చైనా, కొరియా దేశాల మీదుగా జపాన్‌కి చేరవేసి వుంటారన్న విషయాన్ని ఆమె వెల్లడించారు. శాస్త్రీయమైన ఇకబెనా పద్ధతిలో మన ఆచార వ్యవహారాలు కూడా కొంతవరకు ద్యోతకమవుతూ వుండడానికి కారణం యిదే కావచ్చునని' అంటారు ఆమె.

ఉమా బాసు అమెరికా, జపాన్ వంటి విదేశాలు ఐదారు సార్లు పర్యటించారు. అక్కడ ఆమె పుష్పాలంకరణకు సంబంధించిన ప్రదర్శనలలోనూ, సదస్సులలోనూ పాల్గొన్నారు. భారతీయ సంస్కృతిని ప్రతిబింబింపజేసే విధంగా కథాంశాలను ఎన్నుకుని అందుకు తగ్గట్టుగా పువ్వులను అమర్చడంలో ఆమెది అందెవేసిన చేయి.

శ్రీమతి ఉమా బాసు తన సృజనాత్మక శక్తిని కేవలం పుష్పాలంకరణకే పరిమితం చెయ్యలేదు. చిత్రలేఖనంలోనూ, ఛాయా చిత్రాలు తీయడంలోనూ కూడా ఆమె కృషిచేస్తున్నారు. □

సశేష నవల

# కృష్ణవేణి

విమలారామం

"నిన్ను చదివించనని ఎవరన్నారురా! చెప్పు" అనడిగింది నిర్మల ఆవేశపడుతూ.

"ఎవ్వరూ అనలేదు చిన్నవదిన ప్రవేట్లు చెపుతోంది. నాన్నగారు లాయరుగారి దగ్గర పని చేస్తున్నారు. నువ్వు ఓవర్టయిము చేస్తున్నావు.... ఇంట్లో ఇబ్బందిగా ఉండబట్టే కదా మీరంతా ఎక్కువ కష్టపడుతున్నారు!.. నేను కాలేజీలో చేరితే ఇంకా ఖర్చులు పెరుగుతాయి. మళ్ళీ వదిన యేదోటి చేస్తుంది....ఇంక వదిన్ని బాధ పెట్టటం నాకిష్టంలేదు. అందుకనే, నేనే ఏదయినా పని చేద్దామని!"

నిర్మలకి కన్నీళ్ళాగలేదు. గబుక్కున తమ్ముడ్ని దగ్గరకి తీసుకొని గుండెలకి హత్తుకుంది. "ఒరేయ్!...ఇప్పట్నించీ నీకీ బరువు బాధ్యత లెందుకురా!" అని గుండె చెరువు చేసుకుంది.

"ఊర్కో నిర్మలా! ఊర్కో!.. మంచి మనసున్నవాడు—మంచి ఆలోచనలే చేస్తాడు. తను చదువుకోనన్నా మనం మాన్పించేస్తామా?" అంది కృష్ణవేణి ఉజ్జగింపుగా యిద్దర్నీ దగ్గరికి తీసుకుంటూ.

"లేదు వదినా! నేను చదువుకోను...." అన్నాడు రవి.

"నువ్వు చదువుకోనన్నా నేనూర్కోనురా! నిన్ను నేను చదివిస్తాను." అంది నిర్మల కళ్ళొత్తుకుంటూ.

"నువ్వా?"

"అవునురా! నాన్నగారు పెద్దన్నయ్యని, విశ్వం అన్నయ్యనీ చదివించారు. విశ్వమన్నయ్య చిన్నన్నయ్యని అక్కయ్యని, నన్నూ చదివించాడు. నిన్ను చిన్నన్నయ్య నేనూ చదివిస్తాములా!...."

ఆ మాటలు నిర్మల మాటవరసకనలేదు. చిత్తశుద్ధితో తమ్ముడ్ని చదివించాలనుకునే అంది.

కాని పదిరోజులు తిరక్కుండా పురుగుమీద పుట్రలా ఆమెకో సమస్య వచ్చిపడింది!

అంతక్రితం రోజునే నిర్మల బియ్యే పరీక్ష ఫలితాలు తెలిసాయి. ఆమె పాసయినందుకు అంతా సంతోషపడ్డారు. "నా మాటా షణ్ముఖరావుగారి మాటా దక్కించావు. ఇంక మీ కంపెనీ మేనేజరు కాని ప్రొప్రయిటరు కాని అడిగితే నిర్మల బి. ఏ. అని ధైర్యంగా డిగ్రీ చూపించవచ్చు!" అని ఎంతో సంబరపడింది మాధవి.



ఆ వేళ నిర్మల ఎంతో సంతోషంగా ఆ శుభ వార్త చెబుతూ ఆఫీసులో అందర్కీ స్వీట్సు పంచిపెట్టింది. కాని అరగంట తిరక్కుండా ఆమెకో 'షాక్ న్యూస్' అందచేసాడు మేనేజరు!

నిర్మలని హైద్రాబాద్‌లో ఆ కంపెనీ హెడ్డాఫీసుకి బదిలీ చేయమని చెప్పాడుట ప్రొప్రయిటరు. ఆమెకు జీతం పెరుగుతుందని అదొక చిన్న ప్రమోషను క్రిందే ఆమె భావించవచ్చని ప్రోత్సాహకరంగా చెప్పాడు. కాని,



ఉన్న వూళ్ళో అయినవాళ్ళ దగ్గర తక్కువ జీతంతో ఉండటమే తనకు యిష్టమని ఆమె చెప్పింది. షణ్ముఖరావుకే సంగతి చెప్పి ఆయన చేత కూడా చెప్పించింది.

కాని, ఆమెకు బదిలీ అవటానికి ముఖ్య కారణమేమిటో ఆమెకా మరునాడే తెల్సిపోయింది!

నిర్మల స్థానంలోకి వస్తున్న అమ్మాయికి మినిష్టరుగారి రికమండేషను వుందిట! పెద్ద గొరల మాటకి ఎదురు చెప్పలేకపోయారు కంపెనీ మేనేజిమెంటు వారు!....నిర్మలకి ట్రాన్స్‌ఫర్ తప్పనిసరయింది!

"ఇది అన్యాయం! నువ్వు ప్రొటెస్ట్ చెయ్యి!...." అంది మాధవి.

నిర్మల పెదవి విరిచింది. "లాభంలేదు వదినా! మనకి రికమెండ్ చేసే మినిష్టర్లు లేరు. కాదు కూడదంటే ఉద్యోగం వదులుకు పొమ్మంటారే కాని దయతలచరు. మా ప్రొప్రయిటరు యింకా నయం...నన్నుద్యోగంలోంచి పీకెయ్యలేదు. జీతం పెంచుతామన్నారు. కావాలంటే ఒకటి రెండేళ్ళ తర్వాత మళ్ళీ యిక్కడికి బదిలీ చేయిస్తాను – ప్రస్తుతానికి వెళ్ళమన్నారు నాకిక వెళ్ళక తప్పదు!"

అప్పుడే ఆమె అంత దూరం ఆలోచించడం.... ఒక నిర్ణయానికి రావటం జరిగిపోయినందుకు అంతా ఆశ్చర్యపోయారు.

"పెళ్ళికింకా ప్రయత్నాలు చేయటం లేదని నా మీద కోపం వచ్చిందామ్మా!" అన్నాడు సత్యనారాయణగారు ఎర్రబడిన ముఖంతో.

"బలేవారే నాన్నా! నా పెళ్ళికిప్పుడేం తొందర వచ్చిందని! చిన్నన్నయ్యని ట్రయినింగుకి పిలిచారు. మరి వెళ్ళలేదా? అలాగే ట్రాన్సఫర్ అయినందుకు నేనూ వెళ్ళాలి. నేనే మీ కొడుకునయితే యింతసేపు ఆలోచించేవారేనా? నాకు ధైర్యం చెప్పటం పోయి నన్ను నిరుత్సాహపరుస్తారేమిటి?"

ఆయనింకేమనగలడు? కూతురి మీద మమకారంతో ఆయన గుండె నిండిపోయింది. 'నువ్వింకా మా కళ్ళకి చిన్నపిల్లలాగునే కనిపిస్తావు. కాని లోకానుభవంతో చాలా యెదిగావమ్మా! చాలా యెదిగావు! అని తనలో గొణుక్కున్నాడు.

రాఘవరావు కూడా ఎంతో ప్రోత్సాహకరంగా చెప్పాడు. ఆమె రామచంద్రం వాళ్ళింట్లో వుంటుందని – ఆమె గురించి ఎవ్వరూ బెంగ పెట్టుకోనక్కర్లేదని ధైర్యం చెప్పాడు.

విశ్వనాధంతో ఈ సంగతి చెప్పింది కృష్ణవేణి.

"నాతో చెప్పటం దేనికి?....ఈ యింట్లో నా పెత్తనం చెల్లుతోందా? ఎవరిష్టం వచ్చినట్టు వాళ్ళు చేస్తున్నారు!....వెళ్ళనీ!...." అన్నాడు పెడసరంగా.

చెల్లెలు వెళ్ళేటప్పుడు–చెప్పటానికి వచ్చినప్పుడయినా అతను ప్రసన్న భావంతో వీడ్కోలు చెప్పలేదు.

"నాకెంతో బాధగా వుంది నిర్మలా!.... పోనీ, మరొక్కసారి ఆలోచించు...." అంది కృష్ణవేణి ప్రాధేయపడుతూ.

నిర్మల తడికళ్ళు తళుక్కుమన్నాయి. బలవంతంగా నవ్వు తెచ్చుకుంది. "మిమ్మల్నందర్నీ వదిలి వెళ్ళటం నాకు మాత్రం బాధగా లేదా వదినా! కాని, మనకీ ఎడబాటు కొన్నాళ్ళపాటు తప్పదు. మరి రవిని చదివిస్తానని మాటిచ్చాను....మాట మాటెలావున్నా వాడి భవిష్యత్తుకోసమయినా నేనిప్పుడు వెళ్ళక తప్పదు."

"మీ అన్నయ్యే సవ్యంగా వుండుంటే...."

కృష్ణవేణి గొంతు దుఃఖంతో పూడిపోయింది.

"నువ్విలా బాధపడుతుంటే నాకొక్క అడుగు కూడా ముందుకు పడదు. నువ్వు సంతోషంగా సాగనంపితేనే నేను వెళ్ళేది! వీలయినప్పుడల్లా వచ్చి చూస్తుంటాను. నువ్వు మాత్రం దిగులు పడకు...." అని ఎంతో యిదిగా వదినగారికి ధైర్యం చెప్పింది నిర్మల.

ఈలోగా మాధవి ఉత్తరం అందుకొని నిర్మలని తప్పకుండా పంపమని రామచంద్రం వ్రాసిన జవాబు కూడా అందింది. రవిని కూడా పంపమని అక్కడ కాలేజీలో చేర్పిస్తానని - వాళ్ళక్కకి తోడుగా కూడా ఉంటాడని వ్రాసాడతను!

అతను వ్రాసిన సలహా నిర్మలకి బాగా నచ్చింది. "ఈ అయిడియా యిచ్చినందుకు మీ అన్నయ్యకి చాలా థేంక్సు చెప్పాలి వదినా!" అంది మాధవితో.

కూతురితోపాటు కొడుకు కూడా సాయం వెడుతున్నందుకు సుభద్రమ్మ సమాధాన పడింది. తమ్ముడి బాధ్యత కూడా తనమీద పెట్టుకొని వెడుతున్న కూతుర్ని చూసి ఉప్పొంగిపోయాడు సత్యనారాయణగారు.

'మాటలతో సరిపెట్టకుండ చేతలలో చూపించే

నవయువతకు ప్రతీక నిర్మల !' అని మురిసిపోయింది మాధవి.

కాని, తన కళ్ళముందున్న దివ్వె నెవరో దూరంగా తీసుకుపోతున్నారని తనను చీకటిలో వదిలిపేస్తున్నారని గిలగిలలాడిపోయింది కృష్ణవేణి !

## 50

మొదట్లో క్రొత్తగా అనిపించినా హైద్రాబాదు వాతావరణానికి ఇట్టే అలవాటు పడిపోయాడు రవి.

"నీ బాధ్యత నీకు తెలుసు. అయినా పెద్దదాన్ని కనుక నీ మంచి కోరి చెపుతున్నాను. కాలేజీలో చదివేవాళ్ళల్లో బాగా డబ్బున్నవాళ్ళుంటారు. మనలా ఇబ్బందులతో ఉన్నవాళ్ళుంటారు. వాళ్ళకి కాలేజీలో చేరటం సరదా. కాని మనకిది బ్రతుకుతెరువు. అందుకని వాళ్ళతో పోల్చుకుని దిగజారిపోకుండ ఉన్నంతలో సర్దుకుపోతూ చదువే ప్రధాన లక్ష్యంగా పెట్టుకోవాలి ! అందులో మనం మనింట్లోలేము. బావగారెంతమంచివారయినా వాళ్ళింట్లో ఉన్నప్పుడు ఏ లోటుపాట్లున్నా సర్దుకుపోవాలి!" అని హైద్రాబాదులో అడుగుపెట్టటానికిముందే ఎంతో వివరంగా చెప్పింది నిర్మల. అక్క చెప్పినట్టే నడుచుకుంటానన్నాడు. అలాగే నడుచుకున్నాడు రవి !

కాని, రామచంద్రం వాళ్ళింట్లో నిర్మలే ఆట్టే కాలం ఉండలేకపోయింది.

తమ వూళ్ళో వున్నప్పుడు జీతం తక్కువయినా తెచ్చినదంతా వదినగారి కిచ్చేది. అక్కడెలా ఖర్చయినా తనకు పట్టేదికాదు.

కాని, ఇక్కడ జీతం ఎక్కువ వస్తున్నా ఇదివరకు వదినగారికిచ్చేదాంట్లో సగం కూడా యిప్పుడు ఇంటికి పంపలేకపోతోంది. తమ్ముడి పుస్తకాలకి, జీతానికి, బట్టలకి - దీనికీ దానికీ ఖర్చుపెట్టాలి ! రామచంద్రం వాళ్ళింట్లో వున్నందుకు వాళ్ళు అడక్కపోయినా కొంత యివ్వాలి ! ఆమె చాలా తక్కువ యిస్తున్నట్లు సుజాత ముఖంలో కనిపించటమే కాదు నిర్మలకే అలా అనిపించింది ! అందుకనే ఆదాయం పెంచుకోటానికి ఆమె మరో దారి చూసుకోవల్సి వచ్చింది !

ఆ ఉద్దేశ్యంతోనే కథలు ఎక్కువ వ్రాయటం మొదలుపెట్టింది నిర్మల. ఇదివరకు ఏ కథయినా వ్రాస్తే వెంటనే కాపీ తీసి పత్రికకి పంపేది కాదు. కొన్నాళ్ళపాటు ఉంచి మళ్ళీ తిరిగి చదివి, చేర్పులు మార్పులు చేసి బాగా సంతృప్తి కలిగితేనే ప్రచురణకి పంపేది. కాని, ఇప్పుడంత నిదానించలేకపోతోంది. కథ వ్రాసిన మర్నాడే ఫెయిర్ కాపీ తీసి పంపేస్తోంది. ఒక్కొక్కప్పుడు రవిచేత కాపీ తీయిస్తోంది. కొన్ని కథలు త్వరగా అచ్చవుతున్నాయి. కొన్ని తిరిగి వస్తున్నాయి. అలా వెనక్కి రావటం మొదట్లో బాధ కలిగించినా అవి మరో పత్రికకి పంపితే అక్కడ అచ్చవుతున్నాయి. ఈ ఒడిదుడుకులు కూడా జీవితంలో ఒక భాగంగా పరిగణించుకుంటోంది. అచ్చయిన కథలు కొన్ని చూసుకుంటుంటే - 'ఛ, యిలాకాదు అలా వ్రాయాల్సిందేమో' అని అప్పుడప్పుడు అనిపించేది. కాని, ఆ తర్వాత అదంతా ఆలోచించే వ్యవధి కూడా ఆమెకు లేకపోయింది, పత్రికల్లో కథలు విరివిగానే ప్రచురింపబడుతున్నాయి. ఆదాయమూ పెరిగింది. వదినగారికి మరికొంత పంపగలుగుతున్నానన్న సంతృప్తి కలిగింది !

కాని, ఆమె శ్రమకి వెనకనున్న పరమార్థం సుజాతకి తెలియదు. విశ్వనాథం వ్యసనం గురించి రాఘవరావు రామచంద్రానికి చెప్పలేదు - ఉత్తరాల్లో వ్రాయలేదు. వాళ్ళేదేనా నోరుజారి మాధవితో అంటే ఇప్పటికే తన మీద కోపంగా వున్న కూతురు తననే తప్పట్టుకుంటుందని ఆ సంగతి వాళ్ళకి తెలియజేయలేదు.

రచయిత్రిగా పేరు సంపాదించాలని నిర్మల తాపత్రయ పడుతోందని అపార్థం చేసుకుంది సుజాత.

"ఎప్పుడూ ఏదో వ్రాసుకుంటుంటుంది. ఆడపిల్లన్నాక ఆమాత్రం యింట్లో పనికి చేయి అందివ్వకపోతే ఎలాగండీ !" అని ఒకటి రెండుసార్లు భర్త దగ్గర ఆమె ఆరోపించటం నిర్మల చెవుల్లో పడింది.

అతను నిర్మలని సమర్థించటంతో సుజాతకి కోపం కూడా వచ్చింది. అందువల్లనే మొదట్లో ఆమె చూపించిన ఆదరణ ఆ తర్వాత తరిగిపోయింది ! నిర్మలతో ముభావంగా వుంటోంది. అవసరం వస్తేకాని మాట్లాడటంలేదు. నిర్మల ఏదయినా పని చేయబోతే "నీకెందుకు నేనున్నానుగా!" అనేది. ఆ అనటంలో వ్యంగ్యమే ఎక్కువ కనిపించేది.

తను కథలు వ్రాయక తప్పదు. సుజాతకి తన సహాయం ఎప్పుడవసరమో చూసి మరీ వ్రాసుకోటానికి తనకు వీలుండదు. తనకు మనసు కుదిరి వ్రాసుకుంటున్నప్పుడు ఆమెకు తన సహాయం అవసరం కావచ్చు. తనకు ఖాళీ అయినప్పుడు వ్రాయబుద్ధికాదు. ఈ సంకెళ్ళతో అక్కడ వుండటం ఆమెకు మనస్కరించలేదు.

తనూ తమ్ముడూ విడిగావుండి తమ కష్టసుఖాలు తామే అనుభవించటంలోనే ఎక్కువ తృప్తి వుంటుందని ఆమెకు అనిపించింది. ఓ రోజున మనసులోని మాట రామచంద్రం దగ్గర బయట పెట్టింది. అతను నిర్ఘాంతపోయాడు.

"ఎందుకు వేరేవెళ్ళిపోతానంటున్నావు? మీ అక్కయ్య ఏమయినా అందా?" అన్నాడు అతను భార్యవైపు కోపంగా చూస్తూ.

సుజాత భయపడింది. "నేనేమీ అనలేదండీ! ఏమ్మా నిర్మలా? నేనేమన్నాను?" అంది కంగారుగా.

"అబ్బే, అక్కయ్య ఏమీ అనలేదు బావగారూ! ఇన్నాళ్ళు మీరిద్దరూ మమ్మల్నెంతో ఆదరంగా చూసారు. మాకే యింట్లో ఏలోటూ జరగలేదు. మిమ్మల్నింక శ్రమపెట్టకూడదనే విడిగా వుందామనుకుంటున్నాను."

"మాకు శ్రమేముంది! ఒక్కదానివీ యింటి పనీ ఆఫీసుపనీ చూసుకోలేవని" అన్నాడతను.

"ఆ జీవితం ఎలా వుంటుందో కొన్నాళ్ళపాటు చూడనివ్వండి. అంతగా చేసుకోలేకపోతే అప్పుడే వచ్చేస్తాను." అంది నిర్మల నవ్వుతూ.

"నిన్నిలా దూరంగా పంపినట్టు తెలిస్తే మీవాళ్ళంతా బాధపడతారు. నన్ను తప్పుపడతారు. మాధవికి నామీద కోపం వస్తుంది కూడా!" అంది సుజాత.

"నేనెక్కడికీ దూరంగా వెళ్ళటం లేదక్కయ్యా! ఇక్కడే మీ యింటికి దగ్గర్లోనే గది తీసుకుంటాను. వీలున్నప్పుడల్లా వస్తూ పోతూంటాను. మీరూ వచ్చి మమ్మల్ని చూడచ్చు. మీ మీద కోపంతోకాని, అసంతృప్తితో కాని నేనిలా వెడుతున్నానని భావించకండి ! మీ ఆదరణే లేకపోతే నేనిక్కడ యింతకాలం ఉండేదాన్ని కాదు" ఆమె మాటల్లో ఎక్కడా కల్పించి చెప్పుతున్నట్టు లేదు. అయినా దీనికి తన భార్య కొంతవరకు కారకురాలయిందని నిర్మల వెళ్ళిపోవటానికే నిశ్చయించుకుందని యింక బ్రతిమాలినా ప్రయోజనం లేదని వూరుకున్నాడు రామచంద్రం.

## 51

నిర్మల కథలన్నీ రామచంద్రం చదువుతుంటాడు. వాటిలోని లోపాలు ఎత్తి చూపిస్తుంటాడు. ప్రతీదీ విమర్శిస్తున్నాడని అతని మీద కోపంగా వుండేది.

కాని, ఆ విమర్శలన్నీ ఆమె మంచికే జరిగాయి. అతని మెప్పు కోసం ఎంతో మెలుకువతో కథలు వ్రాసేది. అనుభవంతో భాషకి పదును వచ్చింది. భావానికి పుష్టి వచ్చింది. ఇతివృత్తానికి వైవిధ్యం వచ్చింది. విరివిగా కథలు వ్రాస్తోంది. అచ్చవుతూనే వున్నాయి. కాని పంపిన కథలు ఒక పత్రిక వాళ్లు గబగబా అచ్చు వేస్తారు. మరో పత్రిక వాళ్ళు నెలల తరబడి ఆలశ్యం చేస్తారు. ఒకరు అచ్చయిన వెంటనే పారితోషికం పంపిస్తారు. మరొకరు చాలా ఆలశ్యం చేస్తుంటారు!

ఈ కారణాలచేత నిర్మలకి వచ్చే ఆదాయం ప్రతినెలా ఒక్కలా వుండేది కాదు. అందుకనే, కృష్ణవేణికి పంపే డబ్బు కూడా ఒక్కలా వుండేది కాదు! అందులో వేరే గదిలో ఉండటం వచ్చాక నిర్మల ముందు పంపినంత కూడా పంపలేకపోయేది.

ఆమె ఎక్కువ పంపినప్పుడు కొంచెం యిబ్బంది తగ్గినట్టుండేది. లేకపోతే, అత్యవసరాలకి కూడా ఒక్కోసారి వాయిదా వేసుకోవాల్సి వచ్చేది. మురళి పంపిస్తున్నాడు. సత్యనారాయణగారు కొద్దో గొప్పో తెచ్చిస్తున్నాడు. మాధవి సరేసరి. ఇంటి భారాన్ని ఆమే ఎక్కువగా మోస్తోంది.

ఇదంతా తెలిసినా విశ్వనాథం సిగ్గుపడటం లేదు సరికదా - అసలా విషయాలు ఎవరికో పరాయి వాళ్ళకి సంబంధించినట్లు పట్టనట్టుంటున్నాడు. కృష్ణవేణి సమయం చూసి ఎంత యిదిగా చెప్పినా అతను జవాబివ్వటం లేదు. భార్య మీద కోపం వస్తే విసుక్కొని బయిటికి పోతున్నాడు. ఎటొచ్చీ చెయ్యి చేసుకోవటం లేదు. తనచేత దెబ్బలు తిని ఆమె స్పృహ తప్పి పడిపోయిన ఆ రోజు అతని కింకా గుర్తుంది. అదొక్కటే సుగుణం!

కృష్ణవేణి బాధకి అంతంటూ కనిపించడం లేదు. ఇంట్లో ఏది కావల్సి వచ్చినా ఏరోజుకారోజు ఆమె నడిగి తెస్తూనే వుంది మాధవి. అత్యవసరం అయితే తప్ప ఏదీ తెమ్మని చెప్పటం లేదు ఆమె. మాధవి బాధల్లా అక్కయ్య తనతో కూర్చుని ఆ నాల్గు ముద్దలూ తినదని. ప్రొద్దున్న సయించదంటుంది. రాత్రి బావగారొచ్చి తింటేకాని తినదు. ఒక్క శలవు రోజున తనతో కూర్చుని తింటుంది. ఆ మాత్రానికే సంతృప్తి పడుతుంది మాధవి!

మురళి, నిర్మల వున్నప్పుడు ఇప్పుడున్నంత బాధ లేకపోయేది కృష్ణవేణికి. పండగ పేరు చెప్పి అందరికీ బట్టలు కొనేది. ఒకవేళ మాధవి కిష్టమయిందని ఒక చీర కొన్నా - ఆమెతోపాటు




## ఇంద్రధనుస్సు

(నవల)

[రచన: మోచర్ల జయశ్యామల; ప్రచురణ: జయంతి పబ్లికేషన్స్, ఏలూరురోడ్, విజయవాడ-2; వెల: రూ. 6-00; పేజీలు : 192.]

ఈ నవల చదివిన తరువాత ఏదో ఒక సబ్జెక్ట్ తీసుకుని దాన్ని నవలగా మలిచారు రచయిత్రి అనిపిస్తుంది. ఆమె మనసులోని కొన్ని పాత్రలు ముందు రూపొందించుకుని, ఆ పాత్రల గుణగణాలు విచారించి, మరీ అక్షర రూపంలో పెట్టారనిపిస్తుంది. ఈ విషయంలో ఆమె శ్రద్ధ వహించారు.

చక్కదనం, చదువు సంధ్య, గుణగణాలు, బాధ పెట్టే సవతి తల్లి ఉన్న భవాని ఈ నవల హీరోయిన్. ఆమె శంకరం అనే అందమైన యువకుణ్ణి బిందు మాధవస్వామి ఆలయంలో కలుసుకోవడంతో ప్రారంభమయ్యే ఈ నవల అనేక మలుపులు తిరుగుతుంది. భవాని, సుజన సవతి పిల్లలైనా, ఒకరంటే ఒకరు చాలా ఆప్యాయంగా ఉంటారు. ఇది భవాని సవితి తల్లికి కన్నెర్రగా ఉంటుంది. శంకరం తల్లి సుభద్రమ్మగారికి కూడా భవాని అంటే చాలా ప్రేమ. కాని, దురదృష్టవశాత్తూ శంకరం అజాగ్రత్త వల్ల కళ్ళు పోతాయి భవానికి. దానికి తనే కారణమని విపరీతంగా బాధపడతాడు శంకరం. ఆమెను ఎలాగైనా వివాహం చేసుకోవాలనుకుంటాడు. కానీ, అతని తల్లికి ఈ వివాహం ఇష్టం ఉండదు. రెండు కుటుంబాలకు ఇష్టం లేకపోయినా, ఆ అంధురాలిని అనాథగా వదిలిపెట్టలేక సుజన సహాయంతో ఇంట్లో నుంచి తీసుకు వెళ్ళి స్నేహితుల సహాయంతో వివాహం చేసుకుంటాడు. అతడు ఫారిన్ వెళ్ళవలసి రావడంతో, తన భవానిని స్నేహితుడు మూర్తికి అతని భార్య సరోజకు అప్పచెప్పి వెళతాడు. మొదట్లో ఆమెను ఎంతో ఆప్యాయంగా చూసే సరోజ తన వాళ్ళ మాట విని, ఆమెను, భర్తను అనుమానిస్తుంది. మనసు బాధపడ్డ భవాని ఒంటరిగా ఇంట్లో నుంచి బైటకు వచ్చేసి, కారు ఏక్సిడెంటుకు గురి అవుతుంది. కానీ, ఆ కారు ఓనర్ చాలా హృదయ విశాలం కల మనిషి. వారింట్లో ఆమెకు సమున్నత స్థానం దొరుకుంది. అక్కడే ఆమె భర్తను కలుసుకుంటుంది. చాలా సినిమాటిక్‌గా ఉన్న ఈ నవల చివరివరకూ ఎలాగో చదివించేస్తుంది!

## భావన

(కవితాసంపుటి)

[రచన : జ్యోతిర్మయి; ప్రచురణ : ప్రతిభా ఆర్ట్ ప్రింటర్స్, హైద్రాబాద్: వెల : రూ. 3-00]

"ప్రపంచం ఎంత అభివృద్ధి చెందినా, కవిత్వం అక్కరలేని రోజు రాదు." అన్నారు శ్రీ దాశరథి "భావనకు దీవన"లో.

ఈ 'భావన'లో ఏముందా అని కుతూహలం కలగించేటంతటి మంచి పీఠికలున్నాయి ఈ కవితా సంపుటిలో. 'నా మొదటి కవితలు ఇవి' అని రచయిత్రి భయపడనక్కర్లేదు. చక్కటి, చిక్కటి కవిత్వం కాకపోవచ్చు. కానీ హాయిగా హృదయస్పందనను ఆలంబనంగా అందమైన చిన్న పదాలతో అల్లిన చక్కటి కవితా కుటీరమిది.

"కథలేని జీవన గ్రంథంలో
స్థిరపడలేని అక్షరమాలను."

"కోరికలు చిగురించనీ
బేల మనసా!
ఆశతో ఆయుష్షు పెరిగెను చూడు."

"ఆర్తిని తిలకిస్తున్నా
కీర్తి కిరీటాలలో" —

ఇలా అక్షరమాలను సృష్టించగల రచయిత్రి కవిత్వంలో మనకు ఏదో అంతుతెలియని నిరీక్షణ, యవ్వనపు తొలి సంధ్యలో ఉండే ఆర్తి, ప్రేమైక మూర్తికై అర్పణ అనుభవంలోకి వస్తాయి. రచన కన్న స్పందన గొప్పదనిపించింది "భావన" చదివిన తరవాత.

వదినగారికీ, చెల్లెలికీ కూడ తెచ్చేవాడు మురళి. అతను వెళ్ళిపోయాక దాదాపు ఆ యింట్లో ఎవరికీ క్రొత్త బట్టలే లేకపోయాయి.

పిల్లల బట్టలు చిరిగి పాతవయిపోయాయి. వాళ్ళు పేచీలుపెట్టి 'పిన్ని'తో చెప్పుకున్నారు. వాళ్ళ పిన్ని వాళ్ళకి క్రొత్త బట్టలు తెచ్చి తనే కుట్టింది.

కాని, తన బట్టలు కూడ అదే స్థితిలో వున్నాయని ఎలా చెప్పగలదు? 'నా మొగుడుకి నా మాన మర్యాదలు కాపాడేందుకు ఒకటి రెండు చీరలు కొనాలని కూడా తోచటం లేదే చెల్లీ!' అని ఎలా చెప్పుకోగలదు?

మాధవికి మధ్య అక్కగారితో కాసేపు కూర్చుని మాట్లాడే వ్యవధే దొరకటం లేదు. ఇంట్లో వుంటే ఇంటి పని; బయిట కాలేజీ - ప్రవేట్లు - బజారు పని! ఏ మగవాడూ పడనంత శ్రమ పడుతోంది! ఒక యంత్రంలా అయిపోయింది!

అంతకష్టపడుతున్న చెల్లెలికి యింట్లో వున్నంత సేపయినా సుఖసంతోషాలివ్వాలని కృష్ణవేణి అనేక విధాల తాపత్రయపడుతోంది. ఏవయినా ఏమార్చ వచ్చు కాని ఒంటి మీద చిరిగే బట్టల్ని ఎలా దాచుకోగలదు?

ఓ రోజున చిరిగిన చీరలు, జాకెట్లు కుట్టుకుంటున్న కోడల్ని చూసి ఆమె బట్టల గురించి ఆరా తీసింది సుభద్రమ్మ. అప్పుడయితే ఏవో కాస్త చిరిగాయని - ఇంకా గట్టివి చాలా వున్నాయని కృష్ణవేణి మభ్యపెట్టగలిగింది కాని మరో రోజున ఆమె పరిస్థితి ఆవిడకి బహిరంగంగా తెల్సిపోయింది.

పొరుగింటావిడ వచ్చి కబుర్లు చెపుతుంటే మంచినీళ్ళు తెద్దామని లేవబోయింది ఆమె. బియ్యం చేట చివర చిక్కుకున్న చీర అంచు పర్రున చిరిగిపోయింది. గబుక్కున వంగి ఆ చిక్కునుంచి తప్పించుకోబోతుంటే అంతసేపు భుజం చుట్టూ కప్పుకున్న పమిట తొలగిపోయి అతుకుల జాకెట్టు కొట్టవచ్చినట్టు కనపడింది.

సిగ్గుపడి తల త్రిప్పుకుని వెళ్ళిపోయిన కోడల్ని చూసేసరికి సుభద్రమ్మకి కడుపులో బాధ మెలి తిరిగింది. పొరుగింటావిడ వెళ్ళి పోయే వరకు ఆవిడకు ముళ్ళమీదున్నట్టనిపించింది.

"నీకో గుడ్డ ముక్క కొనాలని నీ మొగుడికి పట్టకపోతేపోయె! నీ చెల్లెలికయినా చెప్పుకోక పోతే ఎలాగమ్మా!" అంది ఆవిడ.

ఎర్రబడిన ముఖాన్ని త్రిప్పుకుని "ఆ చీర చిరిగిపోయింది కాని....తక్కినవన్నీ బాగానే వున్నాయి అత్తయ్యా!" అంది కృష్ణవేణి.

"నువ్వింక నాతో అబద్దాలాడకే తల్లీ! నేనంతా చూస్తూనే వున్నాను. ఇవేళ ఏవయినాసరే మాధవితో చెప్పేస్తాను. రేపే నీకు బట్టలు తీసుకురమ్మని."

"వద్దత్తయ్యా! ఈ సంగతి చెప్పితే తను చాలా బాధపడుతుంది. వచ్చేది చాలక తానెంతో కష్టపడుతోంది. ఇంటి ఖర్చులన్నీ తనే భరిస్తోంది! నా బరువు కూడా ఎక్కడ పెట్టను!...."

సుభద్రమ్మ తెల్లబోయింది. "మరి, యిలాగే చిరుగుల గుడ్డలతో వుంటావా?"

కృష్ణవేణి తల దించుకుంది. "లేదు. కొత్తవి కొనుక్కుంటాను. మీరు ఒప్పుకుంటే...."

"మళ్ళీ వాళ్ళవీ వీళ్ళవీ బట్టలు కుడదామనా? చచ్చినా ఒప్పుకోను. నువ్వు మళ్ళీ ఏదయినా పని చేస్తే నా మీద ఒట్టే!" అంది సుభద్రమ్మ ఆవేశపడుతూ.

"అంతమాట అనకండత్తయ్యా!" అంటూ ఆవిడ చేతులు పట్టుకుని బావురుమంది కృష్ణవేణి.

"నాకు తెలుసునమ్మా! .. నీదెంత మంచి మనసో నాకు తెలుసు! నీలాంటి బంగారు తల్లిని నా కన్నకొడుకే కష్టపెడుతుంటే నా కడుపు తరుక్కుపోతోంది! ఏ ఇబ్బందులయినా కళ్ళు మూసుకుని గడిపేస్తావు. కాని, ఈ బట్టలతో యిలా నలుగురి ముందుకి ఎలా వస్తావు? ఇవయినా ఎంతకాలం నిలబడతాయి? ..."

"అందుకే .... నలుగురు పిల్లల్కి సంగీతం చెప్పుదామనుకుంటున్నాను...."

సుభద్రమ్మ ఆశ్చర్యపోయింది. "సంగీతమా! వద్దమ్మా! వద్దు, పగలంతా యింట్లో చాకిరీ! ఆ తర్వాత ఆ పిల్లల్ని పెట్టుకుంటే గొంతు ఆర్చుకుపోతుంది. మళ్ళీ నీ ఆరోగ్యం పాడయిపోతుంది. నేనేమయి పోయినా ఫర్వాలేదు. నా బిడ్డలకి రెక్కలు వచ్చాయి. కాని, నీ బిడ్డలింకా పసివాళ్ళమ్మా! వాళ్ళకి నువ్వు కావాలి! నీ మొగుడి కక్కర్లేకపోయినా-వాళ్ళ బాధ్యత నీకుంది. వాళ్ళ కోసం నిన్ను నువ్వు కాపాడుకోవాలి! ..."

"ఏం ఫర్వాలేదు అత్తయ్యా! నాకేమీ కాదు. కాసేపు చెప్పుతాను. ఎన్నడో నేర్చుకున్న సంగీతం వృధా అయిపోయిందని బాధ పడకుండా యిలా నలుగురుకి చెప్పుకుంటే బావుంటుందని! .."

"ఏమోనమ్మా! నాకు .... మనస్సొప్పుకోవటం లేదు....పోనీ, మాధవిని అడుగు. నీ చెల్లెలు ఒప్పుకుంటే నాకు అభ్యంతరం లేదు!" మాధవి ఎలాగా ఒప్పుకోదని తెల్సుండే సుభద్రమ్మ అలాగంది.

"వద్దు అత్తయ్యా! మాధవికి సంగతి అసలే చెప్పద్దు.... పాపం తనింత కష్టపడుతోందే! ఈ మాత్రమయినా బాధ్యత పంచుకోకపోతే నేనెందుకు? ... మళ్ళీ పాటలు పాడుకునే అవకాశం నాకు ఇవ్వండి. నాకు వచ్చిన విద్య ఇదొక్కటే! నలుగురి పిల్లలకి అది పంచి పెట్టానన్న తృప్తయినా దక్కుతుంది!...."

సుభద్రమ్మ మనసు ద్రవించిపోయింది. కోడలి కోరిక కాదనేశక్తి ఆవిడ కిక లేకపోయింది!....

రోజూ ఇంట్లో చాలామంది పిల్లలు చేరి సంగీతం నేర్చుకుంటున్నారని మాధవికి తెలియదు. సత్యనారాయణగారికి తెలియదు. విశ్వనాథానికి అసలే తెలియదు!

కోడలి కమ్మని కంఠం నిత్యం వింటున్నందుకు ఆనందం — ఆమె శ్రమ పడుతున్నందుకు బాధ— రెంటి మధ్యా ఆసులో కండెలా తిరగాడుతోంది సుభద్రమ్మ!

## 52

నిర్మల కొక్కోసారి తమ వూరికి వెళ్ళి అందర్నీ చూడాలనిపిస్తుంది. తనకే యింత బెంగగా వుంటే తమ్ముడికి మాత్రం వుండదూ? ఇద్దరూ వెళ్ళాలంటే కనీసం వందరూపాయిలయినా కావాలి. అంత డబ్బేది? ఉన్నంతలో ఖర్చుపెట్టుకు వెళ్ళాలంటే వదినకి పంపేది తరిగిపోతుంది. అలా జరగటం తనకసలు యిష్టం లేదు. అందుకనే, తన కోరికని ఎంతో కష్టం మీద అణచుకుంది! తమ్ముడితో పైకి చెప్పనేనా చెప్పదు - లేనిపోని ఆలోచనలు కలిగించినట్టవుతుందని!

ఒంటరితనం బాధ ఆమెకు ఎప్పుడో కాని కలగదు. ఇంటి పనితో ఆఫీసు పనితో తీరికే దొరకదు. ఒకవేళ దొరికినా ఆమెకు కథారచన ఉండనే వుంది. లేకపోతే, రామచంద్రం వాళ్ళింటికి వెడుతుంది. వాళ్ళు కూడా తరచు వస్తుంటారు. సుజాత ఇప్పుడు చాలా ఆప్యాయంగా మాట్లాడుతోంది. నిర్మల వేరే వెళ్ళిపోయిన విషయం మాధవికి తెల్సిందని - ఆమె తననే తప్పుపట్టి

నిష్ఠురంగా ఉత్తరం వ్రాసిందని ఎంతో బాధపడుతూ చెప్పింది.

ఆమెదేమీ తప్పులేదని....తనకే వాళ్ళనిబ్బంది పెట్టటం యిష్టం లేక అలా వెళ్ళిపోయానని, 'వెళ్ళానన్న పేరేకాని అక్కయ్యగారు రోజూ వచ్చి చూసిపోతూనే వున్నార'ని, వారానికోసారి వాళ్ళింట్లో తాము భోజనం చేస్తున్నామని, తమకే లోటూ వాళ్ళు రానివ్వటం లేదని, ఎంతో వివరంగా చిన్న వదినకి ఉత్తరం వ్రాసింది నిర్మల!

ఆ తర్వాత రామచంద్రానికి ప్రమోషను వచ్చిందని సత్యనారాయణ వ్రతం చేసుకుంటున్నామని మాధవిని మరీమరీ రమ్మని ఉత్తరం వ్రాసింది సుజాత. నిర్మలచేత కూడా వ్రాయించింది.

ఏ ఆర్థిక సమస్య నిర్మల కాళ్ళకి బంధాలు వేసిందో - అదే బాధ మాధవిని కదలకుండా కట్టేసింది.

'అన్ని ఖర్చులతోపాటే ఇదీను' అంటూ ఆమెను వెళ్ళిరమ్మంది సుభద్రమ్మ. 'ఒకసారి నిర్మలనీ, రవినీ చూసినట్టుంటుంది. మీ అన్నయ్యా వదినా సంతోషిస్తారు. రెండూ కలిసివస్తాయి.' అని ప్రోత్సహించింది కృష్ణవేణి.

వెళ్ళాలా-మానాలా అన్న సందిగ్ధంలో మాధవి వుండగా తనే వెంట తీసుకువెడదామని వచ్చాడు రాఘవరావు. తండ్రి మాట కాదనలేక ప్రయాణమైంది మాధవి.

హైదరాబాదులో వున్న రెండు రోజులూ నిర్మలా రవీ-రామచంద్రం వాళ్ళింట్లోనే వున్నారు. సుజాతా నిర్మలా ఎంతో కలివిడిగా మాట్లాడుకుంటూ యింటి పనులు చేసుకున్నారు. వాళ్ళ మధ్య మనస్పర్థలేవీ లేవని స్పష్టమవుతూనే వుంది. మరయితే నిర్మల విడిగా వుండటానికి కారణమేమిటి? సందేహం తీరక నిర్మల ఒంటరిగా వున్నప్పుడు తరచితరచి అడిగింది మాధవి.

"పానకంలో పుడకలా నేనెందుకని!" అని ఏవో కమ్మని కబుర్లు చెప్పి మాట తప్పించేసింది నిర్మల. అక్కడ వూళ్ళో అంతా ఎలా వున్నారని-'అన్నయ్య ఏమయినా మారాడా?' అని ఎదురుప్రశ్న వేసింది!

ఈమాటు మభ్యపెట్టే మాటలు చెప్పటం మాధవి వంతయింది. ఆమె బయలుదేరే ముందు 'వాళ్ళనే ఇబ్బందులూ పడి పంపవద్దని చెప్పు.' అంది కృష్ణవేణి. పైకి చెప్పింది అంతే అయినా అక్కయ్య యేం చెప్పాలని చెప్పలేక బాధపడుతోందో గ్రహించి - 'ఇక్కడ సంగతులేవీ నిర్మలతో చెప్పనే చెప్పను అక్కా!' అంది మాధవి. సిగ్గుపడిపోయిన అక్కగారి ముఖం చూడలేక మాట మార్చివేసింది. అదే పని నిర్మల దగ్గరా చేసింది. "ఇన్నాళ్ళయింది హైదరాబాదు వచ్చి! ఇంకా నీ వలలో ఎవరూ పడలేదూ?" అని పరిహాసం చేసింది.

"వల కూడా యెందుకు వదినా! దండుగ.... సినిమాలకి, షికార్లకి రమ్మని ఒకటే ఇన్విటేషన్లు! అందర్నీ ఒబ్లయిజ్ చేయటం మహా కష్టంగా వుందనుకో! మరి పెళ్ళికాని చేసుకుంటావా అని అడిగితే స్పీడుగా పరిగెత్తేసేడు ఒకడు. పెళ్ళికి రెడీ అన్నాడు కదాని కట్నం అడగవుకదా అంటే-మళ్ళీ ముఖమే చూపించాడు కాదు మరొకడు. అప్పట్నించి ఎవడయినా పెళ్ళికి లిస్తే చాలు, 'మా బావగారి దగ్గరికి వెళ్ళు' అని మీ అన్నయ్య దగ్గరకి తోలేస్తున్నాను. అదీ కథ!" అని నిర్మల పకపక నవ్వింది.

మాధవి నవ్వలేక నవ్వలేక కడుపు పట్టుకుంది. కలిసి వున్న రెండు రోజులూ ఒకర్ని సంతోషపెట్టాలని ఇంకొకరు పడే ప్రయత్నంలో ఇద్దరికీ కాలం వేగంగానే గడిచిపోయింది.

కాని, మాధవి బయలుదేరే ముందు ఇద్దర్కీ కన్నీళ్ళు ఆగలేదు.

"నిన్నింకాఅడిగి ఎన్నో విషయాలు తెల్సుకుందామనుకున్నాను." అంది నిర్మల.

"నిన్ను యిబ్బందిపడి పంపద్దని అక్కయ్య చెప్పమంది. అక్కయ్య మాటే కాదు. నా మాట కూడా అదే!" అంది మాధవి.

"అవును వదినా! మీ యిద్దరి మాట ఎప్పుడూ ఒక్కటే! కనుకనే ఆ యిల్లింకా అలా నిలబడి వుంది. ఒక తల్లికి పుట్టిన బిడ్డలు కూడా మీలా అన్యోన్యంగా వుండరు. ఎక్కడిదాకానో ఎందుకు? మా అన్నయ్యలనే చూడు. మా అక్కనీ, నన్నే చూడు! ఒకరు తూర్పు మరొకరు పడమర!"

మాధవి నవ్వి వూరుకుంది.

"అందుకే నాకప్పుడప్పుడూ అనిపిస్తూంటుంది- మీ యిద్దర్నీ ఒకే మూసలో పోసి బ్రహ్మదేవుడు సృష్టించాడేమోనని!"

"కాని, నీలాంటి కేరక్టరు మీద కథ వ్రాయాలంటే చాల కష్టం సుమా!"



కె. పద్మ

కొందరికి లలిత కళల పట్ల వుత్సాహం బాల్యంలోనే ఏర్పడుతుంది. మరి కొందరు సరదాకి నేర్చుకోవడం ప్రారంభించి ఆ తరువాత అందులో ఆసక్తి పెంపొందించుకుంటారు. కుమారి పద్మ ఈ రెండవ కోవకి చెందుతుంది. ప్రముఖ వీణా విద్వాంసుల కచ్చేరీలు విని విని, వీణ పట్ల అభిరుచి ఏర్పరచుకుంది పద్మ.

ఆ విధంగా సరదాకి వీణ నేర్చుకోవడం ప్రారంభించినా ఇవాళ ఆ విద్యలో పలువురి మన్ననలు పొందింది. కుమారి పద్మ చేసిన కచ్చేరీలు తక్కువే అయినా పొందిన బహుమతులు మాత్రం ఎక్కువే.

వాటిలో పేర్కొన దగినవి—సంగీత కళాశాల నిర్వహించిన పోటీలలో ప్రథమ బహుమతి, ఆమధ్య విజయవాడ ఎగ్జిబిషన్‌లో జరిగిన పోటీలలో ద్వితీయ బహుమతి, హైద్రాబాదులో అఖిలభారత స్థాయిలో జరిగిన పోటీలలో ద్వితీయ బహుమతి పొందింది.

పద్మ వి. నాగరత్నం వద్ద వీణ నేర్చుకోవడం ప్రారంభించింది. ప్రస్తుతం అయ్యగారి శ్యాంసుందర్ వద్ద తన విద్యకు మెరుగులు దిద్దుకుంటున్నది; ఆరేళ్ళ డిప్లొమా కోర్సులో చివరి సంవత్సరానికి వచ్చింది.

కుమారి పద్మ ప్రస్తుతం విజయవాడ శారదా జూనియర్ కళాశాలలో సీనియర్ ఇంటర్ విద్యార్థిని. ఆమె అభిమాన వీణా విద్వాంసులు ఈమని శంకరశాస్త్రి.

"ఇంటర్‌తో చదువుకి స్వస్తి చెప్పి సంగీత విద్వాన్ కోర్సులో చేరాలని వుంది" అన్నది పద్మ.

"ఏం? అంత కాంప్లెక్సు కేరక్టరా నాది!" అని నవ్వింది మాధవి.

రామాయణంలో సీత పాత్ర గొప్పదా? మాండవి పాత్ర గొప్పదా? చదువుకొనే రోజుల్లో మొదలైన ఆ సందేహం ఈనాటికీ తీరలేదు నిర్మలకి. మాధవి అత్తవారింటికి వచ్చాక ఆమెను నిత్యం చూస్తుంటే 'ఇద్దరు వదినల్లో ఎవరెక్కువ మంచివారు' అన్న ప్రశ్న తరచు ఉదయించేది. చిన్నతనంనుంచి తను ఆరాధించుకుంటున్న దేవత ఆ వదిన! మంచికి మారుపేరు ఆ వదిన! కాని, తనకవసరం లేకపోయినా, తను తప్పించుకోటానికి అవకాశం వున్నా కుటుంబ బాధ్యతని తనంతట తను కోరి తలకెత్తుకుంది ఈ వదిన! పొరపాటున కూడా తనకిది భారమని కష్టమని పైకి చెప్పుకోనిది ఈ వదిన! మంచితనంలో ఎవరు ఎవరికంటె ఎక్కువ? ఇదీ జవాబు దొరకని ప్రశ్నే అయింది నిర్మలకి!

"ఏమిటబ్బా అలా కళ్ళతో తినేస్తున్నావు?"

"పాలకోవాలా ఉన్నావని!"

మాధవి ముసిముసిగా నవ్వింది. "అదిసరే, నేనన్నది వినపడిందా?"

"ఆఁ! వినపడింది. మా వదినల్లో ఎవరెక్కువ మంచా అని ఆలోచిస్తున్నాను!" అని నవ్వింది నిర్మల.

మాధవి ముఖం మందారపువ్వులా ఎర్రనయింది. "బలేదానివి నాతో అక్కయ్యకి పోలికేమిటి? నాలో మంచితనమేదయినా ఉంటే అది అక్కయ్యని చూసి నేర్చుకున్నదే!"

నిర్మల తడికళ్ళు తళుక్కుమనేలా నవ్వింది. "అవును. నువ్వలా అనక ఎలాగంటావు? అందుకే, నేనన్నది - నీమీద కథ వ్రాయటం నాతరంకాదని!"

మాధవి గలగల నవ్వింది. "బ్రతికించావ్! నన్ను పత్రికల కెక్కిస్తావేమోనని కంగారు పడిపోయాను!"

మాధవి వచ్చి వెళ్ళాక నిర్మల కింటిమీద కొంత బెంగ తీరింది. అందర్నీ చూసినంత తృప్తి కలిగింది!

## 53

ఇంట్లో జరిగే పనులు ఒకరికి తెలియకుండ ఇంకొకరు ఎల్లకాలం చేయలేరు. ఎప్పుడో ఒకప్పుడు ఎవరి కంటనో చటుక్కున పడక మానవు. సంగతులు తెలియకనూ పోవు!

బహిరంగంగా పేకాట ఆడే విశ్వనాథం విషయం ఇంట్లో దాచిపెట్టటానికి కృష్ణవేణి చాలాకాలం శ్రమపడింది. కాని తానింట్లో పడే శ్రమని మాత్రం అట్టేకాలం దాచిపెట్టుకోలేకపోయింది! ఇదివరలో బట్టలు కుట్టినప్పుడూ అంతే అయింది – ఇప్పుడు పిల్లలకి సంగీతం చెప్పటంలోనూ అంతే జరిగింది.

ఒకనాడు సత్యనారాయణగారు ఒంట్లో కులాసాగా లేక పనికి వెళ్ళలేదు. సంగీతం చెప్పించుకొనే పిల్లలు వేళకి వచ్చేసారు! సుభద్రమ్మ పడిన అవస్థే ఆయనా పడాల్సివచ్చింది. మళ్ళీ ఆమె తియ్యని పాటలు వింటున్నందుకు పరమానందం, ఆమె పడుతున్న శ్రమకి అంతులేని బాధ. ఆయన మనస్సు ద్రవించిపోయింది. అత్తగారికి చెప్పిన మాటే ఆయనకీ చెప్పి సమాధాన పరిచింది కృష్ణవేణి.

ఇంకోనాడు ఈ సంగతి మాధవికీ తెల్సిపోయింది. తల నెప్పిగా ఉండి ప్రవేట్లకి వెళ్ళక పెందరాళే ఇంటికి వచ్చింది ఆమె. అక్కగారు పిల్లలకి సంగీతం పాఠాలు చెప్పటం చూసింది. కళ్ళు మూసుకొని వింటుంటే చెవులకి విందుచేసే కమ్మని ఆ కంఠం అవలీలగా పాడుతున్నట్టు అనిపిస్తోంది. కాని, కళ్ళారా చూస్తుంటే సన్నని ఆ కంఠం మీద పొంగే నరాలు శక్తికి మించి ఆమె శ్రమ పడుతోందని చెపుతున్నాయి!

తనకు తెలియకుండ ఆ పని చేస్తున్నందుకు అక్కగారి మీద, ఆమెను వారించకుండ అక్కడే కూర్చుని ఆ పాటలు వింటున్నందుకు అత్తమామల మీద మాధవికి కోపం వచ్చింది. తల త్రిప్పుకొని విసురుగా తన గదిలోకి వెళ్ళిపోయింది!

తెల్లబోయి చూస్తున్న అత్తమామల్ని చూసి బలవంతంగా నవ్వు తెచ్చుకుంది కృష్ణవేణి. "నేను చెపుతానులెండి!" అంది నెమ్మదిగా.

పిల్లల్ని పంపేసి చెల్లెలి గదిలోకి వెళ్ళింది. తల త్రిప్పుకొని గోడవైపు తిరిగిన చెల్లెలి భుజం మీద చెయ్యి వేసి "మధూ! నీతో ఓ సంగతి చెప్పాలి!" అంది.

"నాతో నీకేం పని? అసలు నేన్నీకేమవుతాను?" అంది మాధవి ఆవేశపడుతూ.

కృష్ణవేణి నవ్వింది. "అబ్బా, నామీద బాగానే కోపం వచ్చిందన్నమాట!"

మాధవి మాట్లాడలేదు. ఇటు తిరగలేదు.

"సరే, కోపంవస్తే నువ్వేం శిక్షవేస్తే అదే భరిస్తాను కాని మొన్న నిర్మల వ్రాసి పంపిన పాటకి ఇవేళే వరస కట్టాను. అది ముందు విను!" అని పాడటం మొదలుపెట్టింది కృష్ణవేణి.

అక్కా చెల్లెళ్ళ ప్రేమానుబంధాన్ని చక్కని మాటల్లో వర్ణించింది నిర్మల. తామిద్దర్నే దృష్టిలో పెట్టుకొని ఆమె రచించిందని కృష్ణవేణికీ తెలుసు, మాధవికీ తెలుసు! అది చదివినప్పుడు ఇద్దరి మనస్సులూ పులకరించాయి.

"ఎలా వుంది?" అని కృష్ణవేణి నవ్వుతూ అడిగేవరకూ అలా కళ్ళప్పగించి చూస్తూనే ఉండిపోయింది మాధవి.

మూతి ముడుచుకొని "నీ వరస నాకు నచ్చలేదు!" అంది మాధవి.

"అయితే, ఈపాటికి మరో వరస కూడా కట్టాను పాడనా?" అని నవ్వింది కృష్ణవేణి.

"నాకు నచ్చనిది నీ పాట వరస కాదు.... నీ వరస! నాతో చెప్పకుండ ఈ సంగీతం పాఠాలెందుకు మొదలుపెట్టావ్? ఇప్పటి కింటి పనులు చాలకనా? కాస్తంతయినా రెస్టు ఉండద్దా? నువ్వెంత చిక్కిపోయావో నీకు తెలుసా?"

"చిక్కింది నేను కాదు. నువ్వు! అందుకనే, మురళినోసారి రమ్మని నిన్ననే ఉత్తరం వ్రాసాను!" అని పరిహాసంగా నవ్వింది కృష్ణవేణి.

మాధవి బుగ్గలు కెంపులయ్యాయి. "ఊఁ! మాట మార్చకు నువ్విలా శ్రమపడటం నాకిష్టంలేదు. మరి అత్తయ్య చూస్తూ ఎలా వూరుకున్నారో!"

"అత్తయ్యనీ మామగార్నీ నేనే ఒప్పించాను. నీతో చెపితే నామీద కోప్పడతావని! నువ్వు మా అమ్మవికదా! మా అమ్మంటే నాకంత భయం!" అని చిన్నపిల్లలా భయం నటించి నవ్వింది కృష్ణవేణి.

మాధవి కళ్ళు చెమర్చాయి. "నువ్వింత తేలిగ్గా చెప్పేస్తున్నావు కాని....ఈ సంగతి తెలిస్తే మీ మరిది నన్నే తిడతారు!"

చెల్లెలి చేతులు తన బుగ్గలకి ఒత్తుకుంది కృష్ణవేణి. "మీరంతా భయపడేంతగా నేనేం కష్టపడటంలేదు. సంగీత్తం చెప్పమని ఎన్నాళ్ళనుంచో వాళ్ళడుగుతున్నారు. వాళ్ళకి సంతోషం పంచిపెట్టి నేనూ పంచిపుచ్చుకుందామని. పాట పాడుకోవటంలో ఎంత ఆనందముంటుందో నీకు తెలియదూ!"

"నీకు తోచినప్పుడు నీకోపిక వున్నప్పుడు పాడుకోవటం దారి వేరు. కంపల్సరీగా రోజూ ఒకళ్ళకి పాట చెప్పటం వేరు."

"ఈ నెల రోజుల్లో నాకలవాటయిపోయింది. నాకిప్పుడేమీ శ్రమ అనిపించటంలేదు. నిజం!"

"ఏమయినా, నిన్ను మాటల్లో గెలవటం నా తరంకాదు" అంది మాధవి జంగమూతితో.

"నీ దగ్గర ఇలా కూర్చుని కబుర్లు చెపుతుంటే ఎంత బాధయినా ఎగిరిపోతుంది మధూ! నీలాంటి చెల్లెలు దొరకటం కేవలం నా అదృష్టం!"

అక్కగారి ఆర్ద్ర కంఠానికి మాధవి మనస్సు పులకరించింది. తన అనుభూతి చెప్పుకోటానికి మాటలే దొరకలేదు. ఉద్వేగంతో ఆమెను గట్టిగా కౌగలించుకుంది!

'మధూ నీ గురించి బెంగ పెట్టుకుంది. ఒక్కసారి వచ్చి చూడు' అని వదినగారు వ్రాసిన ఉత్తరం చదువుకొని మురళీమోహన్ శలవు పెట్టి వచ్చాడు.

అతను వున్న రోజులూ అతన్ని సంతోష పెట్టటానికి అంతా తలోవైపునా తాపత్రయపడ్డారు. కృష్ణవేణి పిల్లల్ని సంగీతం పాఠాలకి రావద్దని చెప్పింది. సత్యనారాయణగారు లాయరుగారి దగ్గరకి వెళ్ళలేదు. మాధవి సరేసరి కాలేజికి శలవు పెట్టేసింది! చివరికి విశ్వనాథం కూడ ఇంటికి పెందరాళే వచ్చాడు. ఏ కళనున్నాడో కృష్ణవేణి మాట ధిక్కరించాడు!

చిన్న కొడుక్కి ఇంటి విషయాలు చెప్పనూలేక చెప్పకుండా ఉండనూలేక గుడుసుళ్ళు పడిపోయింది సుభద్రమ్మ. ఆవిడకా అవకాశం ఇవ్వకుండ అస్తమానం మాధవి అతని ప్రక్కనే ఉండిపోయింది. పోనీలే, దూరాన వున్నవాడు ఇవన్నీ తెల్సుకొని బాధపడటం తప్ప చేయగలిగేదేముంది అని ఆవిడే ఊరుకుంది.

భార్య.వదినగారుతరచు తనకు ఉత్తరాలలో వ్రాస్తున్నవన్నీ కల్పనలు కావని, నిజంగానే అన్నయ్య మారాడని - యింటి పరిస్థితులు చక్కబడ్డాయని - నమ్మి ఆ నాల్గు రోజులు సంతోషంగా గడిపి వెళ్ళిపోయాడు మురళీమోహన్!

ఆ మర్నాటినుంచి మళ్ళీ అందరి జీవితాలు యంత్రాలుగా మారిపోయాయి!

## 54

చదువుకునే రోజుల్లో నిర్మల సినిమాలు ఎక్కువగానే చూసేది. ఆ తర్వాత కుటుంబ పరిస్థితులు కుంటుపడటంతో ఆ అలవాటు తగ్గించుకుంది. కొంత బాధ్యత తనమీద పెట్టుకున్నాక సినిమాలనిమేమిటి - తన కనీసపు ఖర్చులే ఎన్నో తగ్గించుకుంటూ వచ్చింది! ఆమె ప్రతిదానికీ గడుపుకోవటం చూసి 'ఈ వయసులో నాకు తీరని కోరిక అంటూ ఏదీ ఉండేదికాదు-పాపిష్టిదాన్ని నీ ముచ్చటేదీ తీర్చలేకపోతున్నాను' అని ఎంతో బాధపడేది కృష్ణవేణి. అవేమంత ముఖ్యంకాదన్నట్టు త్రోసిపారేసేది నిర్మల.

హైదరాబాదు వచ్చి ఆరు నెలలయినా ఒక్క సినిమాకి కూడా వెళ్ళలేదు నిర్మల. రామచంద్రం రెండు మూడుసార్లు బలవంతం చేసాడు. ఏదో పని వుందని ఓసారి, చూడాలని లేదని మరోసారి తప్పించుకుంది. అయితే, తమ్ముడ్ని మాత్రం ఆమె అడ్డుపెట్టలేదు. పైగా పదిహేను రోజులకోసారి 'అస్తమానం చదువేనటరా! కాసేపు సరదాగా బయట తిరిగిరావాలి!' అని ప్రోత్సహించి పంపిస్తూంటుంది. అక్కను కూడా రమ్మంటుంటాడు రవి. కాని, ఆమె వెళ్ళదు.

"ఎప్పుడూ ఏదో ఒక పని చేసుకుంటూనే ఉంటావు! నీకు మాత్రం రిక్రియేషన్ అక్కర్లేదా? నువ్వు రాకపోతే నేనూ వెళ్ళను" అని ఆవేళ తమ్ముడు బలవంతం చేయటంతో నిర్మలకి తప్పలేదు.

తీరా సినిమాకని బయలుదేరి వెళుతుంటే హఠాత్తుగా బజార్లో కనిపించింది ఆమె స్నేహితురాలు విజయ. చాలా రోజుల తర్వాత కల్సుకున్నందుకు పరమానందంతో రోడ్డు మీద కౌగలించుకున్నంత పని చేసింది. ఎవరో చుట్టాలింటికి పెళ్ళికి వచ్చామని....వచ్చేటప్పుడు నిర్మల అడ్రసు తెచ్చుకోవటం మర్చిపోయానని ఎలా కలవాలా అని ఆలోచిస్తుండగా అదృష్టవశాత్తూ తనే కల్సిందని చెప్పింది విజయ. ఎన్ని కబుర్లు చెప్పినా ఆమెలో ఇదివరకటి ఉత్సాహం కనిపించలేదు నిర్మలకు.

సినిమాకి వేళయిపోతోందోనని నచ్చ చెప్పి తమ్ముడ్ని పంపేసింది నిర్మల. విజయ వెంట బజారుకి వచ్చిన బంధువులతో తాను వచ్చి ఆమెను పెళ్ళివారింట దిగపెడతానని భరోసా యిచ్చి ఆమెను తన గదికి తీసుకు వెళ్ళింది నిర్మల.

ఆమె తరచి తరచి అడిగితే మనసులోని బాధ వెళ్ళబోసుకుంది విజయ. "....నువ్వావేళ అన్నది నిజమే అయింది నిర్మలా! కట్నం పుచ్చుకోలేదు. కట్నం పుచ్చుకోలేదు...అని రోజు కొక్కసారయినా ఆయనా మాట అనకుండా ఉండరు! నిజంగా ప్రాణం చచ్చిపోతోందనుకో!"

అంతే కాదు. తనది చపలచిత్తమట! షోకు చేసుకుని వీధి గుమ్మంలో నుంచుని వచ్చేవాళ్ళని పోయేవాళ్ళని చూస్తూంటుందట! ఇంత లూజు కేరక్టరని తెలిస్తే అతను పెళ్ళాడేవాడే కాదట!

"ఆయన్ని పెళ్ళాడే అర్హత నాకు లేదుట! ఆయనంతటి త్యాగధనులు ఎక్కడోకాని ఉండరుట! తను కాబట్టే నాలాటి దాన్ని భరిస్తూ ఉన్నారుట! లేకపోతే, ఎప్పుడో తన్ని తగిలేసే వారుట!"

ఆమెనెలా ఓదార్చాలో నిర్మలకి తోచలేదు. కలగిన మనస్సుతో కళ్లు పెట్టుకుని చూస్తూండి పోయింది.

"ఒక్కోసారి ఈ బాధ భరించలేక ఏ కిరసనాయిలో మీద పోసుకుని అంటించుకు చద్దామని పిస్తుంది!...." అంటూ బావురుమంది విజయ.

నిర్మల చటుక్కున ఆమె చేతులు పట్టుకుంది. "అలాంటి పిచ్చిపని చేయకు విజ్జీ! మగవాడితోటిదే ఆడదాని జీవితమనుకోవటం మూర్ఖత్వం! నిన్న మొన్న నీ జీవితంలో అడుగుపెట్టిన వాడతను. అతను ఆదరిస్తే ముడి వేసుకుని దగ్గరికి చేరాలి కాని, నిన్ను బాధపెడుతుంటే భరిస్తూ ఉండమని ఎక్కడా రూలులేదు. నీ జీవితం నువ్వనుభవించటం నీ హక్కు! అల్పుడయిన ఓ మనిషి కోసం దేవుడిచ్చిన నీ జీవితాన్ని అంతం చేసుకోవటం నీ తెలివి తక్కువ!"

"ఏదయినా జవాబు చెపితే ఎదురు సమాధానం చెపుతావా అని కొడుతుంటే ఏం చేసేది?...." అంది విజయ నిస్పృహగా.

పెళ్ళయి రెండేళ్ళయినా కాలేదు. అప్పుడే 'విజ్జీ' బ్రతుకు యిలా తెల్లవారిందా! నిర్మలకేమని చెప్పాలో పాలుపోలేదు.

"ఒక్క మాట మాత్రం గుర్తుంచుకో విజ్జీ! తెగేదాకా తీగ లాగమని నేను సలహా యివ్వను కాని....అతని కక్కర్లేని ప్రేమ, అనుబంధం నీక



బొబ్బట్లు చేసేటప్పుడు ఒక్కోసారి అల్లరి పెడతాయి. సరిగ్గా రావు. అలాంటప్పుడు మైదాపిండిలో కాస్త గోధుమ రవ కలపండి. అప్పుడు బొబ్బట్లు చిరిగిపోకుండా వస్తాయి.

—వరహాలమ్మ

కావాలని ప్రాకులాడటంలో అర్థం లేదు. జవాబు చెప్పి సాధించలేకపోతే మౌనంతో సాధించు. దగ్గరుండి మార్చలేకపోతే దూరంగా వెళ్ళి ప్రయత్నించు.... అప్పటికీ అతను నిన్నాదరించకపోతే– నీ కాళ్ళ మీద నువ్వు నిలబడి బ్రతకటం నేర్చుకో! బానిసలా బ్రతకటం భరించలేనని బ్రతుకు అంతం చేసుకోవటం పిరికివాళ్ళ లక్షణం! .... ఏడ్చేవాళ్ళని ఏడిపించటం ఈ లోకానికి అలవాటు .... అణగిమణగి వున్న ఆడదాన్ని మరింత అణగద్రొక్కటం మగవాడికి పరిపాటు! ..."

పెళ్ళివారింట దిగ విడిచి వచ్చిన విజయ గుండెల్లోని దిగులు తానెంతవరకు తగ్గించగల్గిందో తెలియదు కాని, తిరిగి వచ్చిన నిర్మల మనసు పూర్తిగా చెదిరిపోయింది .... సమస్య లేకుండా ఏ ఆడదాని బ్రతుకూ ఉండదా? ఎంతమంది ఆడవాళ్ళకి తమ కాళ్ళ మీద తాము నిలబడగలిగే శక్తి దొరుకుతుంది? అసలు ఎంతమందికా ఆత్మ విశ్వాసం ఉంటుంది?

ఆలోచనలతో జ్వర వేడెక్కిపోయి ఇంట్లో కూర్చోలేక రామచంద్రం వాళ్ళింటికి వెళ్ళింది నిర్మల.

"నీకు నూరేళ్ళాయుష్షు! నీ మాటే యిప్పుడనుకుంటున్నాము. ఈమేనండి మహా రచయిత్రి– మా మరదలు నిర్మల బి. ఏ. ఈయన రంగారావుగారని నా ఫ్రెండు. విజయవాడలో ఓ పెద్ద పబ్లిషరు..." అంటూ అక్కడున్న వ్యక్తితో పరిచయాలు చేశాడు రామచంద్రం.

నిర్మల ముఖం కందిపోయింది. "అబ్బే, తోచక ఏదో కాగితాలు నలుపు చేస్తుంటాను. మా బావగారి మాటలు నమ్మకండి!" అంది బిడియంగా.

"అవునవును. తోచక పత్రికలవాళ్ళు అచ్చేస్తున్నారు." అని నవ్వి ఆమె కథల గురించి పొగుడుతూ చెప్పాడు రామచంద్రం. 'కావాలంటే చూడండి!' అంటూ ఆ మధ్య ఆమె కథలు పడిన రెండు మూడు పత్రికలు తమ అల్మారాలోవి తెచ్చి చూపించాడు.

"నవలలేవేనా వ్రాస్తున్నారా?" అని అడిగాడు రంగారావు.

"లేదండీ! అసలింతవరకు ఏ నవలా వ్రాయలేదు...."

నిర్మల మాటల కడ్డు వచ్చాడు రామచంద్రం. "మీరు అచ్చు వేస్తానంటే ఎంత సేపు. ఓ నెలలో వ్రాసిపంపేస్తుంది! మరి రెమ్యూనరేషన్ మాట?" అని గోరు మీటాడు రామచంద్రం.

"రామచంద్రం గార సాధ్యులు!...."

"అహ! అలాగనకండి. మనదంతా నిక్కచ్చి వ్యవహారం!"

"అందర్కీ యిచ్చేదానికన్నా ఆవిడకెక్కువే యిస్తాం. సరేనా!"

అప్పటికేవో స్నేహితుల మధ్య సరదా కబుర్లని సరిపెట్టుకుని విజయ కథతో బరువెక్కిన మనస్సుని తేలిక పరచుకోటానికా కాలక్షేపం పనికి వచ్చిందని ఆ సంగతి అప్పుడే మర్చిపోయింది నిర్మల!

కాని, పది రోజులు తిరక్కుండా, రంగారావు పంపిన చెక్కు పుచ్చుకొని "ఇప్పటికెన్ని పేజీలు వ్రాసావు?" అంటూ రామచంద్రం సుడిగాలిలా వచ్చిపడ్డాడు.

నిర్మల నిర్ఘాంతపోయింది." ఎంత పని చేసారు బావగారూ! నేనావేళ యేదో వేళాకోళాని కనుకున్నాను!"

"చంపావ్! నీ గురించి ఆకాశానికెత్తితే.... నన్ను భూమిలోకి దించేస్తావా?"

"చాల్లెండి! ఆ కథలో యిది బాగాలేదు ఈ కథలో అది బాగాలేదు–అని నన్ను క్రిటిసైజ్ చేస్తుంటారుగా! ఆయనతో నా గురించి గొప్ప చెప్పింది మీ గొప్ప కనుకున్నాను!"

"పిచ్చిదానా! నీ కథలన్నీ బావున్నాయని నేనన్నాననుకో! నువ్వు సంతృప్తిపడిపోయి ఆ లెవెల్‌లోనే ఉండిపోయేదానివి. నువ్వింకా పైకి రావాలనే నిన్ను విమర్శిస్తుంటాను! ఇప్పుడు నీకు తెలియకుండా నువ్వెంతో చక్కగా కథలు వ్రాస్తున్నావు! మా నిర్మల గొప్ప రచయిత్రి అంటూ నేను గర్వంగా చెప్పుకుంటున్నాను!"

ఈ మెప్పుకోసమే ఆమె యిన్నాళ్ళూ ఎదురు చూసింది. ఆనందంతో కళ్ళనీళ్ళు వచ్చాయి. గాలిలో తేలిపోతున్నంత సంతోషం కలిగింది. "ఏమయినా నవల వ్రాయటం కష్టం బావగారూ!" అంది నెర్వస్‌గా నవ్వుతూ.

"మీ బావగారి పరువు కాపాడు చెల్లెలా!" అంది సుజాత.

"ఇవేళే నవల సగం పూర్తయిపోయిందని రంగారావుకి వ్రాసేసాను. ఇక నువ్వేం రాస్తావో నాకు తెలియదు! ఈ నెలాఖరికి మేన్యుస్క్రిప్ట్ యిచ్చేయాలి!" అన్నాడు రామచంద్రం జుంగ మాతిపెట్టి.

ఆ రోజుల్లా ఆలోచించినా ఆమెకు వ్రాయగల నన్న విశ్వాసమూ కలగలేదు. మంచి యితివృత్తమూ తట్టలేదు. మర్నాడు సాయింత్రం తీరిగ్గా కూర్చున్న రామచంద్రం దగ్గరికి వెళ్ళి "నా నెత్తి మీద అంత బరువు పెట్టి హాయిగా వేరుశనగపప్పులు తింటూ కూర్చున్నారా?" అంది చిరుకోపంతో.

రామచంద్రం వేరుశనగపప్పులు ఆమె చేతుల్లో పోస్తూ నవ్వాడు.

"చూడు నిర్మలా! కథకీ నవలకీ తేడా యేమిటి? ఒక సంఘటన మీద ఆధారపడింది కథ. ఒక సమస్య నాధారంగా చేసుకొని అనేక సంఘటనలతో కలిపి వ్రాసేది నవల. మన చుట్టూ అనేక మంది మనుషులున్నారు. వాళ్ళకనేక సమస్యలున్నాయి. ఏదో ఒకటి తీసుకొని ప్రారంభించు. తర్వాత నీ కలమే నిన్ను నడిపిస్తుంది! ఉదాహరణకి మా ఆఫీసులో చక్రధరం అనే క్లర్కు ఉన్నాడు. అతనికి రేసులు పిచ్చి! అస్తమానా తగలబెట్టేసాడు. పెళ్ళాం మెళ్ళో పుస్తెలతాడు కూడా లేదు. ఇంట్లో గంపెడుమంది పిల్లలు వాళ్ళాకలితో మాడిపోతున్నారని చెప్పి అప్పులు చేస్తాడు. మళ్ళీ ఆ డబ్బు రేసుల్లో పెట్టేస్తాడు. ఆ యిల్లాలి బ్రతుకు నరకం చేసేసాడు. మలకపేట రేస్‌కోర్స్ దగ్గరికి వెళ్ళి చూస్తే యిలాంటి చక్రధరాలు వందలకి వందలు కనిపిస్తారు. మరోచోట మరోరకం దౌర్భాగ్యుడు వాడికి తాగుడు అలవాటు. ఇంకోచోట ఇంకొకడికి పేకాట జబ్బు."

నిర్మల గుండెలు దడదడలాడాయి. రామచంద్రం చెప్పుకుపోతూనే ఉన్నాడు. లోకంలో ఎంతమంది వ్యసనపరులవల్ల ఎలాటి వ్యసనాలవల్ల సంసారాలు నాశనమయిపోతున్నాయో వివరంగా చెపుతూనే ఉన్నాడు. "ఇలాంటి సమస్యేదో ఒకటి తీసుకొని వ్రాయి. వీళ్ళవల్ల పిల్లల భవిష్యత్తు, కుటుంబ మర్యాద, ఆర్థిక పరిస్థితి ఇవన్నీ ఎంత అస్తవ్యస్తమవుతున్నాయో ఒక దుర్మార్గుడి కథ తీసుకొని చిత్రించు. ఒక అభాగ్యురాలి కథకి రూపం కల్పించు. నీ నవల చదివితే కొందరయినా కళ్ళు తెరుచుకొంటారేమో! తప్పటడుగు వేయబోయే వాళ్ళేనా తప్పించుకుంటారేమో!"

తన గదికి తిరిగి వచ్చినా అతని మాటలు ఆమె చెవుల్లో గ్రింగురుమంటూనే ఉన్నాయి. తను కథలు వ్రాసే క్రొత్తలో "నామీదో కథ వ్రాయి నిర్మలా!" అంటుండేది వదిన. "నీమీద కథేమిటి? ఏదోనాడు ఒక పెద్ద నవలే వ్రాసేస్తాను వదినా!" అంటుండేది తను. ఇప్పుడవన్నీ గుర్తుకు వచ్చాయి.

'అవును! వదినమీదే కథ వ్రాయాలి! వదిన సమస్య మీదే ఈ కథ వ్రాయాలి!' అనుకుని ఆ రాత్రే తన నవలకి శ్రీకారం చుట్టింది నిర్మల!

# 55

తన నవలలో కథా సౌలభ్యానికి నిర్మల ఎక్కువ పాత్రల్ని ఎన్నుకోలేదు. కృష్ణవేణిలాంటి దొడ్డ యిల్లాల్ని విశ్వనాధంలాంటి పేకాట వ్యసనపరుడు కష్టాలుపాలు చేయటం యితివృత్తం!

రెండు రోజులకోసారి వచ్చి నిర్మల వ్రాసినంత వరకు చదివి చేర్పులకి మార్పులకి సలహా యిస్తున్నాడు రామచంద్రం! మధ్య మధ్య కొన్ని సంఘటనలు చదివితే అతని హృదయం కదలి పోయేది. "అబ్బ ఈ సంఘటన కళ్ళతో చూసినట్లు ఎంత బాగా వర్ణించావు నిర్మలా!" అని పొగిడే వాడతను.

నిర్మల ఉలిక్కిపడేది. ఛ! తొందరపాటుతో అన్నా వదినలని కథలో కెక్కిస్తున్నానేమోనని బాధపడేది. ఇటీవల అన్నగారు మారి మంచిదారిన పడినట్టు చిన్న వదిన చెప్పిందికదా - ఇప్పుడిలా వ్రాయటం తనకు భావ్యమేనా అని తనలో తను గుడుసుళ్ళు పడేది.

ఆ సందిగ్ధావస్తలో ఆమె రెండు రోజులు వ్రాయకపోతే రామచంద్రం వచ్చి తొందర బెట్టేశాడు.

'స్వానుభవాలు లేకుండా కథలెలా వుంటాయి! ఇటువంటి సమస్య వదినకనియేమిటి - ఎందరో ఆడవాళ్ళకి వుంది. ఇందులో ఎందరిదో కథ వుంది. అందరి బాధా వుంది!' అని సరిపెట్టుకొని మళ్ళీ పైకథ వ్రాసేది నిర్మల.

పుట్టింటినుంచి డబ్బు తెచ్చి యివ్వనందుకు కథానాయకిని చివరికి శారీరికంగా హింసిస్తాడు భర్త. అప్పటికే మానసికంగా క్రుంగిపోయిన ఆమెకు ఆరోగ్యం పూర్తిగా పాడయిపోతుంది. ఆమె చావు బ్రతుకుల మధ్య ఉన్నప్పుడు కాని అతని కళ్ళు తెరచుకోవు. అతను అహోరాత్రాలు ఆమె మంచం ప్రక్కన ఉండి సేవ చేస్తాడు.

నవల చివరి భాగం చదివి "ముగింపు బాగా లేదు. ఇలాంటి నవల విషాదాంతం అయినప్పుడు కాని ఈ సమస్య యెంత దారుణమయిందో పాఠకుల హృదయాలకి హత్తుకోదు" అన్నాడు రామచంద్రం.

నిర్మల మనస్సు చెదిరిపోయింది. "వద్దు. అలాంటి మాట లింకెప్పుడూ అనకండి. నేను భరించలేను." అంది చేతులతో ముఖం కప్పుకుంటూ.

రామచంద్రం తెల్లబోయాడు. "పిచ్చిదానా! ఎందుకంత బాధపడతావు? ఇది కేవలం కథ. నువ్వు సృష్టించిన కథ."

"నా కథానాయకి చావదు. చావటానికి వీల్లేదు." అంది ఆమె ఆవేశంగా.

అతను చిత్రంగా చూసాడు. "నువ్వీ నవల వ్రాసింది నీ కథానాయకిలాంటి మనిషి మీద జాలి చేతనేకదా!"

"అంతేకాదు. ప్రేమచేత కూడా!" అందామె దృఢస్వరంతో.

"మరీ మంచిది. ఆ సమస్య ఎంత విపరీతానికి దారి తీస్తుందో వివరించి చెప్పాలంటే ముగింపు పాఠకుల హృదయాలకి హత్తుకొనేదిగానే ఉండాలి!"

"లేదు. నాకు మనుషులమీద నమ్మకముంది. అందుకనే, ఆమె భర్త చివరకి మారాడని వ్రాసాను."

"అది కరక్టే! ఆ మనిషి మారకపోతే అసలీ కథకి అర్థమేలేదు. కాని, ఇది వాస్తవం కాదు. కథ కనుక నువ్వా ట్విస్ట్ యిస్తేనే దానికి ఎఫెక్ట్ ఎక్కువ! అయ్యో కొన్నాళ్ళకి ముందే ఈ బుద్ధి నాకు వచ్చుంటే నా భార్యని దక్కించుకునేవాడిని సుమా - అని అతను అనుకోవాలి. అలాంటి ముగింపు యిచ్చినప్పుడే నీ కథ చదివినవాళ్ళు ఆలోచిస్తారు! ముందు జాగ్రత్త పడతారు!"

రామచంద్రం ఎంత చెప్పినా నిర్మల సమాధాన పడలేకపోయింది. అది తన అన్నా వదినల కథేనని పైకి చెప్పుకోనూ లేకపోయింది.

ఇక చేసేదిలేక "సరే, నీ యిష్టం!" అని వూరుకున్నాడు రామచంద్రం.

---

ఇటీవల 'శాన్‌ఫ్రాన్‌సిస్కో క్రానికల్' అనే పత్రికలో చర్చికి సంబంధించిన ఒక పాఠశాల ఉపాధ్యాయుడు ఒక ప్రకటన చేస్తూ 'కృత్రిమ గర్భధారణ ద్వారా ఏ స్త్రీ అయినా ఒక శిశువును ప్రసాదిస్తే ఆమెకు పదివేల డాలర్లు (దాదాపు తొంభై వేల రూపాయలు) వరకు ముట్ట జెప్పుతానని' అన్నాడట. దాంతో ఆ నగరంలోని స్త్రీలు చాలామంది ఆ పత్రికకు దరఖాస్తులు పంపడమే కాక కొందరు ఫోన్‌కాల్స్ కూడా చేశారట. వారిలో ఒకామె 'పిల్లల్ని కనడం తనకి సరదా' అందిట. మరో యువతి 'ఆ డబ్బు నాకెంతో అవసరం' అనీ, మూడో ఆమె 'ఒక పెన్నీ కూడా నాకు అవసరం లేదు' అనీ అన్నారట. అలా అన్న మూడో యువతి వయస్సు 29 సంవత్సరాలు. ఆమెకు అంతకు ముందే వివాహమవడం, విడాకులు పుచ్చుకోవడం జరిగాయిట. ముగ్గురు పిల్లలు కూడానూ. ఇంతకీ ఆ ప్రకటన జారీ చేసిన ఉపాధ్యాయుడికి వివాహమయింది. కాని అతని భార్యకు సంతానం కలగదని వైద్యులు చెప్పారట. అందుకనే టెస్ట్-ట్యూబ్ బేబీ కోసం ప్రయత్నిస్తున్నాడు. వచ్చిన దరఖాస్తులు అవీ చూసి 'బాబోయ్.... ఇంతమంది దరఖాస్తుదారులు వుంటారని నేననుకోలేదే" అని ఆశ్చర్యపోయాడతను!



# క్రొత్త

సాటిలేని

# కేమలిన్

పిస్టన్ పెన్నులు

మీ సమయం వృథా కాదు.
సిరా వేసేటపుడు ఏమాత్రం
ఇబ్బంది వుండదు. కేమలిన్ పిస్టన్
పెన్ను యొక్క నిర్మాణపు తీరు మీ
పనిని ఎంతో సులభం చేస్తుంది.
ఒకసారి నింపండి. తేడా
గమనించండి.



నింపటం
ఎంతో సులభం
పిస్టన్ క్రిందికి
తోయండి.
సిరాలో
ముంచండి.
పిస్టన్‌ను పైకి
లాగండి.
అంతే— పెన్ను
నిండింది!

**ఇంజక్షన్
పిస్టన్ పెన్ను 48**



ఎడమ వైపు
త్రిప్పండి—గాలి
బయటికి
వస్తుంది.
కుడి వైపు
త్రిప్పండి.
సిరా పూర్తిగా
నిండుకొంటుంది



**పిస్టన్
ఫిల్లింగ్ పెన్ను 47**

Vision 782 Tel.



# ఫెవికాల్ గనుక ఉంటే క్షణంలో బొమ్మలు తయారుచేయవచ్చు

ఆల్ ఇండియా హాండీక్రాఫ్ట్స్ టీచర్స్ ట్రైనింగ్ కాలేజీ మరియు ఇతర హాండీక్రాఫ్ట్స్ ఇన్‌స్టిట్యూట్స్ ఫెవికాల్‌ను చాలా అధికంగా వాడుతారు. ఫెవికాల్‌తో ఆర్ట్ పేపర్, క్రాఫ్ట్ పేపర్, థర్మకోల్, మట్టి పదార్థం, టింబర్, పూసలు—ఇంకా అనేక వస్తువులను అంటించవచ్చును.

ఫెవికాల్ త్వరగా అతుకుతుంది. మరకలు చేయదు.

ఫెవికాల్‌తో ఎలాంటి చేతి వస్తువులనైనా సునాయాసంగా నైపుణ్యతతో చేయవచ్చు. అందుకనే ఫెవికాల్‌ను వాడండి— ఎలాంటి చేతి పనులకైనా సరే.




Courtesy: HTTC, Bombay

అతికించడంలో
ఉత్తమమైంది.

## ఫెవికాల్®

నిపుణులువాడే ఎడ్హెసివ్

® పిడిలైట్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్, పో.బా. నం. 11084,
బొంబాయి 400 020 వారి రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్క్.

PIDILITE

**శిశు సంరక్షణ :**

"అప్పుడే పుట్టిన పసికందుని, బాలింత రాలైన తల్లిని పరిశీలించి చూడండి. స్వచ్ఛమైన ప్రేమానురాగాలకు, అనుబంధానికిగల నిజమైన అర్థం మీకు బోధపడుతుంది." అంటారు ప్రఖ్యాత విజ్ఞానవేత్త ఎష్లీ మాంటేగు. ఈయన మానవ పరిణామ శాస్త్రంలో పలు పరిశోధనలు చేసి పేరు గడించారు.

"ఏ శిశువుకైనా ముఖ్యంగా కావలసింది ప్రేమ. మనిషికి ఆహారం, విసర్జనము, విశ్రాంతి, వ్యాపకమూ ముఖ్యమైనవే. కాని వీటన్నిటి కన్నా ముఖ్యంగా కావల్సింది - ఆప్యాయత! భూమికి సూర్యుడు ఎంత ముఖ్యమో శిశువుకి ప్రేమ కూడా అంతే ముఖ్యం." అంటారాయన.

అంతేకాదు. తల్లిపాలు తాగడం వల్ల చిన్నపిల్లలలో బాల్యంలోనే ఆప్యాయత, ఆదరణ చోటు చేసుకుంటాయనీ, ఇతరులను ప్రేమించగల గుణం కూడా అబ్బుతుందనీ, పరిపక్వమైన ప్రేమ వున్నప్పుడే మామూలు మనిషిగా జీవించడం సాధ్యమవుతుందనీ-ఎష్లీ తన పరిశోధనల ద్వారా తెలియజేశారు.

'అయితే అమెరికాలో 95 శాతం స్త్రీలు, పురుషులు కూడా తల్లి పాలకి, నోచుకోని వాళ్ళే. తల్లిపాలు చవిచూడని వ్యక్తుల జీవితం అగాధంతో సమానం. ముఖ్యంగా పురుషులకి యిది వర్తిస్తుంది. స్త్రీలైతే మాతృత్వం సిద్ధించాక ఆ లోటు తీర్చుకోగలరు' అంటారు ఆయన.

మరో విషయం కూడా ఎష్లీ తన పరిశోధనల ద్వారా బయటపెట్టాడు. సాధారణంగా తలిదండ్రులు బాల్యంలో ఆడపిల్లల మీద చూపే ప్రేమాభిమానాలు, శ్రద్ధ-మగపిల్లల మీద చూపరట.

అఫ్‌కోర్స్....ఆయన చేసిన పరిశోధనలన్నీ అమెరికా వారి మీదనే అనుకోండి!

## 56

రాఘవరావు రిటైరవటం రోజుల్లోకి వచ్చేసింది. అందుకని శలవు పెట్టేసాడు. ఖాళీగా వుండటంతో ఏం తోచక తరచు సత్యనారాయణగారింటికి వస్తున్నాడు.

శక్తిలేని సత్యనారాయణగారు శ్రమపడటం గమనిస్తున్నాడు. శక్తికి మించి కృష్ణవేణి శ్రమపడటం గుర్తిస్తున్నాడు. అది చూసాక తన కూతురి కష్టం పెద్దదని అతని కనిపించలేదు!

ఒకరి కష్టంలో పాలుపంచుకోవాలని యింకొకరు తను కష్టపడినాసరే, మరొకరి బాధని తగ్గించాలని ఇంకొకరు ఇటువంటి మంచివాళ్ళకి సమస్యేమిటి?

తన కూతురు అన్నట్లు - మనసులు విరక్కుండా సమస్య పరిష్కారమయ్యే మార్గం చెప్పవల్సిందే కాని అన్నదమ్ము లిద్దర్నీ వేరుచేయటంవల్ల ప్రయోజనమేమీ వుండదు.

ఇదివరకు తను విశ్వనాథం మీద కోపంతో అన్నమాట ఇప్పుడు దానంతట అదే నిజమయ్యేలా వుంది! త్వరలోనే మురళికి ట్రయినింగు అయిపోతుంది. ఎక్కడో పోస్టింగు చేస్తారు. అప్పుడయినా మాధవి అతని దగ్గరికి వెళ్ళిపోక తప్పదు. విశ్వనాథం యిలాగే వుంటే ఇంక కృష్ణవేణి జీవితం ఏమవుతుంది?

అది తట్టుకొనేసరికి ఇదివరకు కృష్ణవేణి మీదున్న కోపమంతా పోయి ఆమె మీద జాలితో అతని హృదయం నిండిపోయింది. తన కూతురికే అంత కష్టం వచ్చినట్టు అతను బాధపడిపోయాడు.

ఓ రోజున సత్యనారాయణగారితోపాటు లాయరు గారింటికి వెళుతూ దారిలో ఈ ప్రస్తావన ఎత్తాడు. "మనమిలా వూరుక్కుంటే ఎలా బావగారూ!"

"ఊరుక్కున్నామటండీ! ఎన్నోవిధాల చెప్పాను. వాళ్ళమ్మ చేత చెప్పించాను. మేమేమన్నా మాట్లాడడు. మమ్మల్నేమీ అనలేక కృష్ణ మీద విరుచుకు పడుతుంటాడు. పూర్తిగా మూర్ఖుడయిపోయాడు. నేనింక విసుగెత్తిపోయాను! ఓపికున్నంతకాలం ఈ పని చేస్తాను. ఆ తర్వాత మాయోగం ఎలా వుంటే అలా అవుతుంది!" అన్నాడు సత్యనారాయణగారు ఉస్సూరుమంటూ.

ఇక తను కూడా ఓ ప్రయత్నం చేద్దామని ఓ రోజు సాయింత్రం ఆఫీసు దగ్గరే విశ్వనాథాన్ని కల్పుకున్నాడు రాఘవరావు. ఏదో పని వుందని తమ యింటికి తీసుకువెళ్ళాడు.

రాఘవరావు చెప్పినదంతా మౌనంగా విన్నాడు విశ్వనాథం. ముఖం జేవురించింది. "ఇదంతా నాతో చెప్పమని మీకెవరు చెప్పారు? కృష్ణ చెప్పిందా?" అన్నాడు గట్టిగా.

"లేదులేదు. అమ్మాయికే పాపమూ తెలియదు. నేనే, మీ అందరి మేలుకోరీ చెప్పాను."

"అయితే, మీరు చెప్పేదింకా ఏమయినా వుందా? అయిపోయిందా?"

రాఘవరావు నివ్వెరపోయాడు. "నన్నపార్థం చేసుకోకు విశ్వం! ఉన్న పరిస్థితి చెపుతున్నాను. ఇంతకాలం యిక్కడ మాధవి వుంది కనుక ఫర్వాలేకపోయింది. రేపు మీ తమ్ముడి కెక్కడ పోస్టింగయితే అక్కడికి వెళ్ళిపోతుంది."

"ఎవరిసాయం నాకక్కరలేదు. చేయమని నేనడగనూలేదు. ఇంతవరకు మీ అమ్మాయికి నేనెంత బాకీ వున్నానో లెక్క వేసుకోమనండి. ఇంకా చాలకపోతే మీ అల్లుడ్ని కూడా లెక్కలు వ్రాసుకోమనండి! నేనెవ్వరి బాకీ వుంచుకోను. అందరిదీ అణాపైసలతో తీర్చేస్తాను. మీరాభయమేమీ పెట్టుకోనక్కర్లేదు. కావాలంటే నోటు రాసిస్తాను. నా మంచి చెడ్డలు నాకు తెల్సు. ఇంకొకళ్ళు చెప్పవల్సిన అవసరం లేదు." అంటూ విసవిసనడుస్తూ వెళ్ళిపోయాడు విశ్వనాథం.

రాఘవరావు హతాశుడైపోయాడు. అప్పుడు కాని భర్త వ్యసనం వల్ల కృష్ణవేణి ఎన్ని అవస్థలు పడుతోందో అతనికి పూర్తిగా అర్థం కాలేదు.

ముందు కాలక్షేపానికి వాళ్ళింటికి వెళ్ళేవాడు. తర్వాత వాళ్ళుపడే బాధలు చూడలేక వెళ్ళటం మానుకున్నాడు!

ఓనాడు ప్రొద్దున్న కృష్ణవేణి హడావిడిగా యింటికి వచ్చేసరికి రాఘవరావు తెల్లబోయాడు. ఎన్నాళ్ళకో యిల్లు కదలి వచ్చింది. అంటే, ఏదో సమస్యే వచ్చుంటుంది! "ఏమిటమ్మా!" అని అడిగాడు కంగారుగా.

కృష్ణవేణి ముఖం పుచ్చపువ్వులా విచ్చుకునుంది. "మీకో శుభవార్త చెపుదామని వచ్చాను బాబయ్యగారూ! చెల్లాయి తల్లి కాబోతూంది."

[సశేషం]

### చిత్ర కథ పోటీ:

# చిట్టిబుర్రలో చిన్న ఆలోచన

## వై. రేణుకాదేవి

> గత సంచికలో ఇచ్చిన 'చిత్ర కథ పోటీ'కి వచ్చిన కథల్లో 'చిట్టి బుర్రలో చిన్న ఆలోచన' అన్న కథ బాగున్నదనిపించింది. ఈ కథను వై. రేణుకాదేవి రాశారు. ప్రకటించిన ప్రకారం ఇస్తామన్న 'బహుమతి'ని ఆమెకు పంపుతాము.

"అక్కా! అక్కా!" అని పిలుస్తూ ఇంటి ముందర గార్డెన్‌లో పచార్లు చేస్తున్న లత దగ్గరకు పరుగెత్తుకొచ్చాడు పదేళ్ళ రాము. వాడి కోసమే కాచుకునున్నట్లుగా ఎగిరి గంతేసింది లత వాడి పిలుపు విని.

"అక్కా! ఎదురింటి బాబూరావుగారు నీకీ ఉత్తరం ఇమ్మన్నారు" అన్నాడు రాము.

ఉత్తరాన్ని గబుక్కున వాడి చేతిలోంచి లాక్కుని జాకెట్టు లోపలికి దోపుకుంటూ చుట్టూ చూసిందొకమారు లత. ఎవ్వరూ ఉన్నట్లు లేరు. రహస్యంగా రాము నడిగింది లత. "రామూ! నీవీ ఉత్తరం తేవడం ఎవరికంటా పడలేదు కదా!" లేదన్నట్లుగా వాడు తలూపాడు.

సంతోషంగా వాడి వీపుతట్టి "నీకు డబ్బు లిస్తానుగాని సాయంత్రం సినిమా కెళ్లు. కానీ ఈ ఉత్తరం మాట ఎవరిదగ్గరా బయటపెట్టకూడదు సుమా!" కళ్ళలోనే వాడికి జాగ్రత్త అని చెప్తూ మేడ మీదకి పరుగెట్టింది లత.

పదేళ్ళ రాముకు లత సంగతి ఏమీ అర్థం కాలేదు. ఉత్తరానికి, లతకూ వున్న సంబంధ మేమిటో వాడి చిన్న బుర్రకు అంతుబట్టలేదు. ఎవరితోనూ ఉత్తరం సంగతి చెప్పగూడదంటుందే లతక్క....ఎందుకు? ఈ ఉత్తరాన్ని ఆమేం చేస్తుందో చూద్దాం అనుకుంటూ వాడు కూడా మెల్లిగా అడుగులో అడుగేసుకుంటూ మేడ ఎక్కి లత గది ముందు ఓరగా వేసిన తలుపువద్ద ఆగి లోపలికి చూసాడు. లత పక్కమీద బోర్లా పడుకుని కాళ్లు ఆడిస్తూ, సిగ్గుని పెదాలమాటున అదిమిపట్టి, తన పెద్ద కళ్ళను అర్ధనిమీలితంచేసి, ఉత్తరాన్ని ఎడమ చేతిలో పట్టుకుని, కుడిచేత వేలి గోళ్లు కొరుకుతూ మనసులో చదువుకుంటూంది.

ఆ దృశ్యం చూసిన రాముకు వెంటనే మెదడులో ఒక దృశ్యం మెదిలింది. ఇలాగే నాలుగు రోజుల క్రితం ఉత్తరం తెచ్చినందుకు లత వాడికి సినిమా చూడమని డబ్బులిచ్చింది. ఆ రోజు రాము ఒక సినిమా చూసాడు. అందులో ఒక అమ్మాయి ఇలాగే ఒక ఉత్తరాన్ని తన లాంటి అబ్బాయి తెచ్చివ్వగా చదువుతుంది. ఆ ఉత్తరాన్ని చదివిన రాత్రే ఆ అమ్మాయి ఉత్తరం వ్రాసినతనితో వెళ్ళిపోతుంది. ఆ అమ్మాయి వెళ్ళిపోయిన తరువాత, ఆ అమ్మాయి తలిదండ్రుల దుఃఖం చూచి తను కూడా సినిమా హాల్లో ఏడ్చాడు. తరువాత ఆ అబ్బాయి ఆ అమ్మాయిని ఎక్కడికో తీసికెళతాడు. కొద్ది రోజులు బాగానే వున్నట్లు చూపారు సినిమాలో. తరువాత ఏమయిందో తెలీదు. ఆ అమ్మాయి చాలామంది ఆడవాళ్ళున్న ఇంటిలో ఏడుస్తూ కనిపిస్తుంది. అతడు ఆ తర్వాత కన్పించనే



కనిపించదు. ఆ అమ్మాయి వున్న యింట్లో ఒక లావుపాటి ముసిల్ది వుంటుంది. అది ఆ అమ్మాయిని ఒక గదిలోకి వెళ్ళమంటే ఆ అమ్మాయి వెళ్ళదు. అప్పుడా ముసిల్ది ఒక గూండాలాంటి వాడిచేత ఆమెను కొట్టించి ఆ రోజంతా ఆమెకు అన్నం పెట్టదు. ప్రతిరోజూ ఆ అమ్మాయి అలా దెబ్బలు తింటూ ఏడుస్తూ వుంటుంది. ఆ దృశ్యం గుర్తుకు వచ్చేసరికి చిన్నారి రాము శరీరం మీద చెమటలు పోసాయి. అమ్మో! ఇంకేమయినా వుందా! తన అక్కకు కూడా అలాగే అవుతుందా? సినిమాలో మాదిరే అక్క కూడా ఉత్తరం చదివి అతనితో వెళ్ళిపోదు కదా? అప్పుడు తను అక్కా! అని ఎవర్ని పిలుస్తాడు. అక్క వెళ్ళిపోతే పెద్దమ్మగారు, పెదబాబుగారు ఎంతగా ఏడుస్తారో? తను అది చూసి భరించగలడా? ఎక్కడో అడుక్కు తింటూ పడివున్న తనను ఆదరించి తీసుకొచ్చి దగ్గర పెట్టుకున్న ఆ పుణ్య దంపతులు ఏడుస్తూవుంటే తాను సహించగలడా? ఇదంతా తనే ఉత్తరం తెచ్చివ్వడం మూలానకదా జరిగింది. ఈ సంగతి తెలిస్తే పెదబాబుగారు ఊరుకుంటారా.... తనని తన్ని తగలెయ్యరూ! అక్క సుఖంగా వుండేటట్లయితే తానేమయినా ఫరవాలేదు. కాని సినిమాలోలాగ అక్క కూడా దెబ్బలు తింటూ ఏడుస్తే తనని దేవుడు కూడా క్షమించడు. అమ్మా నాన్న చిన్నప్పుడే పోయిన రాముకు తన ఒక్కగానొక్క అక్క గుర్తుకొచ్చింది. ఎంతో ప్రేమగా తనని చూసుకుంటూ వున్న అక్క ఒక రోజు ఇలాగే చెప్పాపెట్టకుండా ఎక్కడికో వెళ్ళిపోయింది. తాను అనాధ అయినాడు అప్పట్నుంచి. ఆ అక్క కూడా సినిమాలోలాగ ఎవరింట్లోనో దెబ్బలు తింటూ వుందేమో! ఆ అక్క వెళ్ళిపోయినప్పుడు తాను చాలా చిన్నవాడు. తనకు ఏమీ తెలీదు. కానీ ఇప్పుడు తనకు కొంచెం కొంచెంగా ప్రపంచం తెలుస్తూ వుంది. వెళ్ళిపోయిన ఆ అక్కను ఈ అక్కలో చూసుకుంటున్నాడు తను. ఈ అక్క వెళ్ళిపోతే తను బ్రతగ్గలడా? ఊహూ! అక్క వెళ్ళిపోకుండా ఆపాలి. తనా ఉత్తరం తెచ్చివ్వకుండా వుండాల్సింది. కానీ ఏమిటో తనది తెచ్చిచ్చాడు. ఇప్పుడేం చేయాలి? సినిమాలోలాగ జరగకుండా వుండేందుకు ఏదైనా ఉపాయం ఆలోచించాలి. ఎలా? హఠాత్తుగా వాడి చిట్టి బుర్రలో చిన్న ఆలోచన ప్రవేశించింది. సంతృప్తిగా తల వూపుతూ దాన్ని అమలుపరచేందుకు నిశ్చయించుకున్నాడు రాము.

**"ఉత్సాహం కల్గించే వృత్తి మాత్రమే కాదు. కుటుంబ ఆదాయం కూడా దీని ద్వారా అభివృద్ధి చేసుకోవచ్చు. ఇది ఈనాటి ఆర్థికపరిస్థితిలో చాలా అవసరం కూడా—" అన్నారు మద్రాసు తొలి ఆటోరిక్షా లేడీ డ్రైవర్ శ్రీమతి షఫీయా బీ 'వనిత' ప్రతినిధితో మాట్లాడుతూ.**



# ఆటోరిక్షా నడుపుతున్న తొలి వనిత

# షఫీయాబీ

ముప్పైఎనిమిదేళ్ళు నిండిన నలుగురు పిల్లల తల్లి అయిన ఈమె ఆటో నడపడం నేర్చుకున్నదంటే ఆశ్చర్యం లేదు. ఎంచేతంటే ఈమె భర్త మద్రాసులో ఒక డ్రైవింగ్ స్కూల్ నడుపుతున్నారు. అయితే డ్రైవింగ్‌ను వృత్తిగా చేపట్టే ఉత్సాహం కల్గించింది ఒక మంత్రిగారు.

గత సంవత్సరం పోలవరంలో జరిగిన స్త్రీల మోటారు పోటీల బహుమతీ ప్రదానోత్సవంలో "డ్రైవింగ్‌ను కేవలం వినోదాలకు, పోటీలకు మాత్రమే పరిమితం చెయ్యకుండా వృత్తిగా స్వీకరించడానికి స్త్రీలు ముందుకురావాలి" అని ఆయన ప్రసంగించారు. ఆ మాటలకు ఉత్తేజితురాలైన షఫీయా బీ-పట్టుదలతో డ్రైవింగ్ నేర్చుకుని గత నవంబర్ పదో తారీఖున ఆటో నడపడం ప్రారంభించారు.

"నడపడం సులభంగా నేర్చుకున్నాను. కాని ఆటో కొనడానికి మాత్రం కొంత శ్రమపడ్డాను. ఋణం కోసం అర్జీ పెట్టినప్పుడు మొదట బ్యాంక్ వాళ్ళు నిరాకరించారు. లైసెన్సు విషయంలోనూ అదే జరిగింది. కాని నేను ఈ విషయాన్ని ముఖ్య మంత్రి దృష్టికి తెచ్చాను. ఆపైన పనులన్నీ చకచకా అయిపోయాయి." అందామె నవ్వుతూ. రిక్షా కొనడానికి పొందిన ఋణంలో ఆమె యిప్పుడు వారానికి నూటపన్నెండు రూపాయలు చెల్లిస్తోందట.

ఉదయం తొమ్మిది గంటలకల్లా ఇంటి పనులు ముగించుకుని పిల్లల్ని బడికి పంపి ఆటోలో బయలుదేరే షఫీయా సాయంకాలం పిల్లలు బడినుంచి వచ్చేలోపల ఇల్లు చేరుకుంటుంది. అంచేత గృహిణిగా తన నిత్య కృత్యాలకు ఇది ఏ విధంగానూ ఆటంకం కాదు అన్నారామె. ఇలా నడపడంవల్ల రోజుకు కనీసం పదిహేను రూపాయలు ఆదాయం వస్తుందట.

"రెండు మూడు మాసాలుగా ఆటో నడువుతున్నారు కదా మీ అనుభవాలు ఏమిటి?" అని అడిగినప్పుడు—"ఎలాంటి చేదైన అనుభవాలూ ఎదురు కాలేదు. పైగా మద్రాసు ఆటో డ్రైవర్‌లు చాలామంది మా వారి స్కూల్లో నేర్చుకున్న వాళ్ళే గనక నా దగ్గర ఎంతో గౌరవంగా నడుచుకుంటారు. 'స్త్రీలకు, కుటుంబాలకు మాత్రమే' అని బోర్డు తగిలించడం కేవలం రక్షణ కోసమే. ఇకపోతే ఈ వృత్తిని నేను ప్రజాసేవగా భావిస్తున్నాను. అందుకే మీటర్ ఛార్జికన్నా ఒక్క పైసా కూడా ఎక్కువ తీసుకోను." అన్నారామె.

"డ్రైవింగ్ నేర్చుకోవాలని ఉత్సాహం వున్నా ఆర్థికంగా ముందుకు అడుగు వేయలేని పేద స్త్రీలకు మొదట ఫీజు తీసుకోకుండా డ్రైవింగ్ నేర్పించి - వాళ్ళు స్వయంగా నాలుగు డబ్బులు సంపాయించేప్పుడు ఫీజు చెల్లించే సౌకర్యం కల్పిస్తాము. పేద స్త్రీల ప్రగతికి మేము చేసే చిన్న సాయం ఇది" అంటారు షఫీయా.

తొలి ఆటోరిక్షా లేడీ డ్రైవర్‌గా తాను వుండడమే కాదు, తనలా తోటి వనితలు కూడా ఈ మార్గంలో పయనించాలని ఉబలాటపడే షఫీయా బీ ఇరవైయేళ్ళ క్రితమే ఒక సాహసం చేసింది. సనాతన హైందవ కుటుంబంలో పుట్టి పెరిగిన ఈమె ఒక ముస్లిమ్‌ను పెళ్లాడింది ఆ రోజుల్లో అదీ ఒక విప్లవమే!

# పుట్టిన రోజులు



ఎల్. నరేంద్రవర్మ (కల్పాక్కం) పుట్టినతేదీ: 21-2-78 తల్లి పేరు: ఎల్. రాధ

ఈ నెల పుట్టిన రోజులు గల శిశువుల్లో ఏడాది పిల్లల గ్రూపులో ఎల్. నరేంద్ర వర్మ; రెండేళ్ళ గ్రూపులో జి. ఇందూ కళాధర్ రెడ్డి 'పుట్టిన రోజు బహుమతుల'కు ఎన్నికైనారు. మూడేళ్ళ గ్రూపుకు చెందిన ఫోటోల్లో ఏదీ సరైనది కనబడకపోవడం వల్ల - ఆ గ్రూపుకు బహుమతి ఇవ్వలేదు. నిర్ణయింపబడిన పై ఇద్దరితోపాటు, మొత్తం మీద రెండు గ్రూపులలోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ముగ్గుర్ని ఎన్నికచేసి విడిగా ప్రచురిస్తున్నాము. మార్చి సంచికలోని ఈ శీర్షికకు ఫొటోలు పంపేవారు - వివరాలతోసహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి; ఫొటో వెనక పెన్సిల్‌తో శిశువు పేరు రాయాలి. ఫొటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు) ఫిబ్రవరి 5 వ తేదీలోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.



జి. ఇందూ కళాధర్ రెడ్డి (పాలకొల్లు) పుట్టినతేదీ: 17-2-77 తల్లి పేరు: జి. అనూరాధ



కె. వి. కుమార్ (ప్రొద్దటూరు) పుట్టినతేదీ: 9-2-77 తల్లి పేరు: కె. ఉషా



◀ చైతన్యకుమార్ (నిజామాబాద్) పుట్టినతేదీ: 1-2-78 తల్లి పేరు: రాధ



కె. మైథిలి (విశాఖపట్నం) పుట్టినతేదీ: 22-2-77 తల్లి పేరు: నాగేశ్వరి సుబ్బారావు

Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.







REGD. No. TN/...(S)/64 VANITH...